# భారతి

సాహిత్య మాసపత్రిక

డిశంబరు 1978

చెలియలికట్ట

రమణారెడ్డి

ఎక్కట్లు

సీతారామమూర్తి

హేమంతము

వేంకటేశ్వర్లు

శాపగ్రస్తుడు

నగీన్ మోదీ



హాస్తి మశకాంతరం

సుబ్బారావు

చాప్లిన్ దృష్టి

ఓడాన్నెల్

ఫాక్ట్స్ - కామెంట్

పిరాట్ల

స్వీయచరిత్ర

శ్రీరామమూర్తి

ఇంకా మన్మధరావు, మునిసుందరం, అసురా, గోపాలకృష్ణ, మాణిక్యరావు, ఆనందారామం, సాంబశివరావు, శ్రీరామమూర్తి ఇతరుల రచనలు

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)



డిశంబరు 1978

సంపుటము : 55 సంచిక : 12

విడిపత్రిక వెల రూపాయి న్నర

# అడ్డుగోడలు అంతరించాలి

మనిషికి మనిషికీ మధ్య కులం, వర్గం అనే అడ్డుగోడలు ఉన్నంతకాలం సమ సమాజాన్ని నిర్మించడం సాధ్యం కాదు.

ఈ విషయాన్ని గుర్తించిన మన ప్రణాళికావేత్తలు, పరిపాలకులు మన రాష్ట్రంలో హరిజన సంక్షేమానికి ఎల్లప్పుడూ అత్యధిక ప్రాధాన్యం ఇస్తూ వచ్చారు. **1978-79** సంవత్సరపు బడ్జెటులో ఈ రంగానికి ఇతోధిక నిధులు - రూ. **690** లక్షలు కేటాయించారు.

ఇందులో రూ **60/-** లక్షలు ఆంధ్రప్రదేశ్ షెడ్యూలు కులాల సహకార ఆర్థిక కార్పొరేషన్‌కు యిస్తారు. ఆర్థిక కార్యక్రమాల అమలుకు బ్యాంకులనుంచి రుణాలు పొందడానికి వీలుగా తమ సభ్యులకు ఈ మొత్తాలను పెట్టుబడిగా ఈ కార్పొరేషన్ అందజేస్తుంది.

**1, 2** తరగతులలో ప్రవేశం లభించిన షెడ్యూలు కులాలకు చెందిన బాలలకు స్కాలర్‌షిప్పులు మంజూరు చేయడానికి రూ. **75** లక్షలు కేటాయించారు.

గాంధీజీ హరిజనుల విషయంలో కన్నకలలు ఈ విధంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఫలించనున్నాయి.

ఈ సంక్షేమ కార్యక్రమాలను చురుకుగా అమలు పర్చడం ద్వారా అడ్డుగోడలను అంతరింపజేద్దాం.

సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాదు.

24/78–79



# విషయానుక్రమణిక

## డిశంబరు 1978





# ఎక్కటీడు

## శ్రీ తుమ్మల సీతారామమూర్తి

పోఁగు లుంగరాలు భుజకీర్తులు పసిండి
కంటె వేఱుగానికరణి ఖగము
నగము తరువు పురువు నరుఁడు బ్రహ్మముకంటె
వేఱుగామి గన్న విద్య విద్య.

నానాత్వమునం దేకతఁ
గానంగల చదువె చదువుగా నెన్నఁదగున్;
ఈ నేర్మి గన్న వానికి
లేనేలే వెడఁద నేచు లేములు బాముల్.

ఆలు బిడ్డలు చుట్టమ్ము లనుఁగుఁజెలులు
కలరు, పదవులు భాగ్యముల్ కలవు వాని;
కెన్నియున్నను దత్త్వంబు నెఱుఁగు తెలివి
లేమి పెనులేమియై బెగ్గలికము నింపె.

కలదు గొఱ్ఱెపిల్ల కాపరిమూఁపుపై
వెఱ్ఱిముదిరి దాని వెదకు నతఁడు
చదురులేనిమాపి యెదలోని శివుని గ
న్గానక పరుగులెత్తు గుడికి గుహకు.

పరముకల్మి నేను బొటింప నని తెగి
యెల్ల పాపములకు నియ్యచేసి
నీల్గినతఁడు కుందునేకద యది యున్న
సుకృతి యగుట లెస్సచూ! యెట్లైన.

ప్రార్థన పరాయణుండ నైనపుడు సలుపుఁ
డస్మదీయ శస్త్ర చికిత్స నన్నయోగి
భక్తి ముక్తిద మగుఁ గాని రక్తిలేని
జడుని కేకలు చిందులు శాంతి నిడునె.

మానవత్వము ముక్తిపై మమతకల్మి
పరమ పురుషాశ్రయము వశంపడుట యరిది
భగవ దతివేల కారుణ్య ఫల మనంగ
మేల్మి లీమూఁడు నటనట మేళగించు.

ఓయి నరుఁడా! జగాన నీ వుఁడవచ్చు
జగము నీలోన నుండుట చనదు చనదు
నీటిలో యానపాత్రంబు నిల్వవచ్చు
నిలువరాదు నీ రద్దాన నిలువరాదు.

ప్రేమ కలదు మనకుఁ బెను వెల్లిగా నది
సాగు రిత్తలంబి సంద్రమునకు (సంసారము)
వేల్పుదెసకు దాని వెడలింపవలయు ను
త్కట విరాగ మానకట్టు గాఁగ.

ఏటికో వాఁడు నన్గని యూరసించి
కలఁచు; నాతనిపై నేను గనలు టెట్లు?
వానియందును నాయందు వాసుదేవుఁ
డొక్కఁడే నిల్చి నను మహావాక్కతింగి.

పుండరీకుఁ డెంత పండెనో హరి వచ్చి
యెట్ట యెదుట నుండ నిటికఁ ద్రోసి
నిలువు మిఁదుఁ దండ్రికొలువులో నున్నాఁడ
ననియె జనకునందు హరిని గనియె.

నిలిచినాఁడు చరిత్రలో నేఁటి నాఁటి
కర్మములు తెచ్చు వెతల జంకనివటారి
కడలితరఁగల తాఁకున గట్టువోలెఁ
దొనఁకఁ డింతయు విన్నాణి దుఃఖహతుల.



# వ్యత్యాసం

వెలుగులు విరజిమ్మే రాజవీథిలో
గడ్డిబండిని లాక్కుంటూ
వెడుతున్నాయి గాయపడ్డ రెండు ఎడ్లు
కిలుం పట్టి, మాశిపోయి
పొగ తాగిన లాంతరొకటి
బండిక్రింద వేలాడుతూంది.
ఒక వెలుతురులో.
మరో వెలుతురు
కాలుగాలిన పిల్లిలా
సుళ్లు తిరుగుతూంది.

# ఈ గాలికి గమ్యం తెలియదు

నల్లని నదిలా ప్రవహిస్తున్న మౌనం
రుబాయీలు పాడుతున్న సంధ్య
అశ్రు విగళిత నయనాల నుండి
నలకలు తీస్తున్న ఎండ
నలకలన్నిటినీ చేర్చి
నేనొక పడవ చేశాను
ఈ గాలి, మహా ముక్కోపి
నా పడవను
వ్యాకరణ ద్వీపంలో వదిలేసింది.

శ్రీ ఎస్. మునిసుందరం

# చలం

'అసుర'

అతనెప్పుడూ రోడ్డుగుండా నడవడు
దారులకు దూరంగా నడిచిన జాడలైనా ప్రతిష్ఠించకుండా
అతి సుతారంగా నడుస్తాడు ఎక్కడో ఎవరూ
కనలేని సెలయేళ్ళ మర్మ సంకేతాల్ని తన చర్మాన్ని గాలం
వేసి వింటూ
నాకు మాత్రం అతడు తన మెత్తని పాదాలతో
నిరామయ వాయువుల గుండా ఈదుతున్నట్లు తోస్తుంది
అపరిచిత మార్గాలలో నిర్వికారంగా సాగిపోయే చేపపిల్లలను—
— జ్ఞప్తికి తెస్తూ.
మార్గ మధ్యంలో ఐన్‌స్టీన్, ఎడ్డింగ్‌టన్‌లు
తటస్థపడి ఆహ్వానించినా నిర్మోహమాటంగా తన
నిరసన తెలియచేసి సుదూరమైన
స్తబ్ద తీరాలకు అదృశ్యమవడం నేను అతనిలోనే చూశాను.
తీవ్ర మోహావేశంతో పైకెగసిపడే సముద్ర కెరటాల్లా
జ్వలించగల్గడం
గొప్ప రసానుభూతితో నిండిన స్త్రీలా పరిపూర్ణంగా
నవ్వగల్గడం
సమీపంలోనే వుండీ స్పర్శేంద్రియాలకు లోబడకపోవడంకూడా
నేను మొదటిసారిగా అతనిలోనే చూశాను.

# హేమంతము

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

**ఉత్సాహ వృత్తము :–**

హిమము కురియు వేళ లందహీన కాంతిఁ బాల సం
 ద్రమున నాగువాడు మిసిమి తరగల నగ — శారదా
విమల తారకాళి యనగ—వేలు లక్షలగుచు -- కొ
త్తమిఱి చేలు పూలు పూచె దీప్తనయన పర్వమై !! 1

చలికి భీతినొంది సకల జనులు రాత్రియైనచో
వెలికి రాక యణిగియుంద్రు — వీధి నిర్జనంబునై
బొలిచె-- ప్రణయ వార్ధిలోన మునిగి చలిని దంపతుల్
గెలిచిరెన్ని బాడ బాగ్నికీల లాత్మదాల్చిరో !! 2

జ్వలన శిఖి శిఖా కృపాణ సముదయమ్ము నెత్తి — బె
బ్బులిని బోని దూకు చలిని పోవ ద్రోలినంత-సం
కలిత భీతి నెదుట నిల్వగా వశమ్ముఁ గామిఁ జూ
పులకు నక్కి వెన్నుపోటుఁ బొడిచె చలి ప్రజాతతిన్ !! 3

కుంచి తాస్యగతి — విభుగ్న కూజితా రవమ్ము — ప
క్ష్మాంచ లాంతర్గాత్మ డింభకమ్ము — సంవృతార్ధ నే
త్రాంచితమ్ములగుచు శిశువందు పారువములు ని
స్సంచరితము లనగ నాల్గు జాలఁ గడపె రా తులన్ !! 4

ఆ నిశాంత మందు శైత్యహాని నొంది వేకువన్
పూని వేవెలుంగు జోదు పొడిచినంత గాఢ హ
ర్షా నవోదయాశ్రు బిందు సముదయమ్ము విడుచు చం
దానయాకు కొనలఁ జార్చె తరులు తుహిన బిందులన్ !! 5

# అమావాస్యకు స్వాగతం

## శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు

లక్షలాది చుక్కల వెలుగుల్ని
కక్కబూని త్రాగేసిన చంద్రుడు
ఆకాశ వీధిలో విహరిస్తూ
అందరి నోళ్ళు నొక్కిన అధినేతలాగ

పున్నమనాడు వెలుగుతున్నాడు
పుట్టెడు వెలుగుతో విర్రవీగుతు
తనను మించిన కాంతి
కనుపించకూడదని

సామాన్యుల పౌర స్వత్వాలను
సమూలంగా పెరికేసిన నియంతలాగ
ఒక్కొక్క చుక్కను
పుక్కిట నమిలివేసే

తెల్లని చందమామ మాకొద్దు
నల్లని అమావాస్య కావాలె

చిన్నవారి పెదవులపై
చిరునవ్వులు తాండవింప

బాధ అందరిని తనవిగా
భావించి, కమిలి, కుమిలి

లక్షలాది తారలను
అక్షణంగ వెలగనిస్తు

విషం మింగి విశ్వాన్ని రక్షించిన
విశ్వనాథుని కంఠం వలె

నిలువునా నల్లబడ్డ తనువుతో
నిశీధిన వచ్చే అమావాస్య కాహ్వానం

అంతటితో తృప్తిపడే
అమావాస్యకు స్వాగతం

# గరిక పూవులు

## శ్రీ మేక మన్మధరావు

**వాగు** చెంతను దారియందున
మొలచి మెరిసే మురిసి విరిసే
పసరు తునకల కొసరి నవ్వుల!
పసిడి మొలకల మిసిమి దివ్వెల!!

మంచు సోనల జలకమాడి
పాల వెన్నెల వలువ దాల్చి
నింగి వెలిగే తారకాళికి
నేల పూచిన సుప్రతీకల!

కన్నెపిల్లల కురులయిన
వెలవుగలిగి నిలువగలుగు
మల్లెమొల్లలు కానె కావు—
స్వామి సేవను నోచ గలిగిన

పారిజాత ప్రసూనాలు
కావు కావవి— కానే, కావు—
నామ హీనుల నయన ధారలు!
భాగ్యహీనుల హృదయ ఛాయలు!!

ప్రణయ మెరుగని భ్రమరమానని
విగతి జీవుల విరతి చూపులు!
పాదఘట్టన నలిగి సురిగే
దీన జీవులు! క్షణిక చరితలు!



శ్రీ కోడూరి శ్రీరామమూర్తి

# మూడు దశాబ్దాల తెలుగు సాహిత్యంలో 'స్వీయ చరిత్ర'

స్వీయ చరిత్ర వ్రాసుకోవడమనేది చాలా యిబ్బందులతో కూడు కున్నపని. దీనికి ముఖ్యంగా కొన్ని కారణాలున్నాయి. తన కథ తాను చెప్పుకోవడం ప్రారంభించినాక, రచయిత తను సాధించిన ఘన కార్యాల గురించి చెప్పుకోవలసి వుంటుంది. అంతేకాదు —తన సమకాలీకుల గురించి కూడా ప్రస్తావించాల్సి వుంటుంది. వీళ్లల్లో తనని అభిమానించి, ఆదరించిన వారూ వుంటారు. కత్తిగట్టి ఎది రించినవారూ వుంటారు. రచయిత అందరి గురించి వ్రాయక తప్పదు. తీరా వ్రాశాక— ఆత్మస్తుతి, పరనింద, అన్నమాటకూడా పడక తప్పదు. తెలుగులో మొట్టమొదటి స్వీయ చరిత్రకారులుగా చెప్పబడుతున్న వీరేశలింగంగారు — సుమారులో యిలాంటి బాధనే వ్యక్తం చేశారు తమ 'స్వీయ చరిత్ర' ముందు మాటలో. బహుశా— ఈ కారణం చేతనే అనుకుంటాను — మిగితా సాహిత్య ప్రక్రియ లకు లభించిన ఆదరణ తెలుగులో 'స్వీయ చరిత్ర'కు లభించలేదు. వీరేశలింగంగారి 'స్వీయ చరిత్ర' మొదటి భాగం 1911 లోనూ, రెండో భాగం 1915 లోనూ అచ్చయినవి. రెండో భాగం నుంచి లెక్క తీసుకున్నా, నేటికి ఆరు దశాబ్దాలు దాటిపోయాయి. కాని తెలుగులో వెలువడిన స్వీయ చరిత్రలు కనీసం అరవై దాటి వుంటాయా అంటే—ఖచ్చితంగా 'ఔను' అని చెప్పలేము. దీనికి గల కారణాలను పరిశీలన చేస్తూ నార్లవారు యిలా అంటారు : * '' — స్వీయ చరిత్ర వ్రాయడంలో పంతులు గారు చెప్పిన చిక్కులున్నా — ఆత్మస్తుతి, పరనింద, ఆరోపణలకు బెదిరినందు వల్లనే — అప్రియ సత్య సంఘటనల ప్రకటనకు సంకోచించినందు వల్లనే ఆత్మకథా రచన జోలికి హెచ్చుమంది పోలేదని నేను అను కోను. ''కథ'' అంటూ వుంటే తప్ప — 'ఆత్మకథ' వ్రాయడం సాధ్యం కాదు. ఎవరికి వారికే తమ జీవితం ఒక కథ కావచ్చుగానీ, యితరులకు దాని గురించి అన్యథా భావాలుండవచ్చును. నిత్య జీవితంలో ''నా కథ కాస్త వినండి'' అంటూ వచ్చేవారిలో వెయ్యికి 999 మంది నిజానికి మనకు వినిపించేది ''ఆత్మకథ'' కాదు. ''ఆత్మక్షోభ''ను. మన క్షోభ సాహిత్య గౌరవం పొందగల కథ కావడం సమకాలిక సంఘ విస్తృతిని, వైశిష్ట్యాన్ని, దాని వెలుగునీడల సహితంగా — మన జీవిత చరిత్ర బహుధా ప్రతిబిం బింప చేయగలిగినప్పుడే — ఈ మహాద్భాగ్యానికి నోచుకున్న వారు మనలో చాలా కొద్ది మంది. వారిలో ఆత్మ పరీక్ష చేసుకొనగల వారేమి, తను గురించి, యితరుల గురించి, న్యాయమైన తీర్పుకు రాగలవారేమి, మరింత తక్కువ. ఈ దక్షత వున్నా — కొన్ని నెలల తరబడి రచనను కొనసాగించగల ఓర్పు చూపగలవారు అసలే తక్కువ. ఇందువల్లనే మనకు ఆత్మకథలు తక్కువ అని అనుకుంటాను. ''

కారణాలు ఏమైనప్పటికీ — తెలుగులో స్వీయ చరిత్రలు తక్కువే. సంఖ్యా విషయకంగా చూస్తే —వచన సాహిత్య ప్రక్రియ లన్నింటికీ రచయితల ఆదరాన్ని తక్కువగా నోచుకున్న ప్రక్రియ యిదే.

అసలు స్వీయ చరిత్ర ఎందుకు వ్రాస్తారు అన్న విషయాన్ని మరి కొంచెం పరిశీలిద్దాము. ''ఇండియన్ ఆటోబయాగ్రఫీస్'' సంకలన కర్త యస్. పి. సక్సేనా ఈ ప్రశ్నకు సమాధానం చెబుతూ యిలా అంటారు : ''పాఠకుల్ని సన్నిహితంగా తీసుకొని, నిర్మొహమాటంగా తన జీవితంలో జరిగినవి చెప్పుకోవడం కోసం కొందరు, తాము చేసిన పనుల్ని సమర్థించుకోవడం కోసం కొందరు, క్షమార్పణ చెప్పుకోడానికి యింకొందరు, యిక మిగిలిన వాళ్లు తమ గొప్పల్ని చాటుకోవడం కోసం — యిలా అనేక కారణాలుగా తమ కథల్ని తాము వ్రాసుకొంటారు ''. ఈకారణం వల్లనే మనకు విన్‌స్టన్ చర్చిల్, లాయడ్ జార్జి లాంటి వాళ్ళు వ్రాసిన ఆత్మకథలు — న్యూమాన్ ''ఎపోలజియా'', రూసో రచించిన ''కన్‌ఫెషన్స్'', యిలా ఒక్కొక్కటి ఒక్కో ధోరణిలో కన బడతాయి. ఒక్కో ఆత్మకథలోనూ సమకాలీన సమాజం ఒక్కో కోణంలో కనబడుతుంది. ఆ రోజుల్లో ఒక వ్యక్తికీ, పరిస్థితు లకు మధ్య జరిగిన సంఘర్షణ కనబడుతుంది. ఈ పరిస్థితులు సమాజంలోని మూఢాచారాలు సృష్టించినవి కావచ్చు. రాజకీయ రంగంలోంచి ఊడి పడ్డవి కావచ్చు. లేదా, సాహిత్య, కళా, రంగా లకు పరిమితమైనవి కావచ్చు. అన్నింటా — మనకు ఏదో ఒక 'సంఘర్షణ' కనబడుతుంది. అసలు 'సంఘర్షణ' అనేది లేకపోతే ఆ వ్యక్తి తనను గురించి తాను వ్రాసుకోడానికి గాని, ఆ వ్రాసు కున్నది యితరులకు పఠన యోగ్యంగా వుండడానికి గానీ, ఏమీ

---

* దరిశి చెంచయ్య గారి 'స్వీయ చరిత్ర'కు వ్రాసిన ముందు మాటలో.

వుండదు. నలుగురు నడచిన దోవలో భద్రంగా షర్టుకాలరు నలక్కుండా చూచుకుంటూ పోయే మనుషులు వ్రాసిన వ్రాతలపట్ల పాఠకులకు సాధారణంగా ఉత్సాహం వుండదు. అలాంటి వాళ్ల జీవితాలు తెలుసుకోవడంవల్ల పొందే ప్రయోజనం కూడా వుండదు గాంధీజీ వ్రాసిన "మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్" అనే ఆత్మకథను చదివిన వాళ్ళు యిప్పటికీ ఉత్తేజాన్ని పొందుతున్నారంటే – దానికి కారణం ఆనాటి పరిస్థితులు ఈనాడు వుండడం కాదు. పరిస్థితులు ఎలాంటి వయినా, వాటిని ఎదుర్కొనేందుకు కావలసిన నిజాయితీ, నిర్భయత్వము, ఎలా వుండాలో చెప్పేదిగా వుండటం వల్లనే ఈ నాటికీ మనం ఆయన ప్రయోగాల కథను ఆదర్శంగా వుంచుకోగలుగు తున్నాము.

ఆత్మకథను ఎవరు వ్రాసినప్పటికీ – దానిని వ్రాయడానికి ప్రధానంగా కావలసిన కనీస అర్హత, సత్యాన్ని వ్యక్తీకరించగల శక్తి. ఇందుకు కావలసిన నిజాయితీ లోపించిననాడు ఎంత గొప్ప వ్యక్తి రచించిన స్వీయ చరిత్ర అయినా సాహిత్యంలో స్థానాన్ని కోల్పోతుంది. "The best autobiographics are those which dwell upon the movement of man's inner life—" అనడంలోని ఉద్దేశం యిదే. అయితే, కొన్ని స్వీయ చరిత్రల్లో ఈ ప్రాథమిక లక్షణం కూడా అగోచరమవుతున్నది. యిలా జరగడానికి గల కారణాల్ని "Cassells Encyclopaedia of English literature" యిలా చెబుతోంది:

1) మనిషి జ్ఞాపకశక్తి అన్ని వేళలా నమ్మదగ్గది కాక పోవడం – ముఖ్యంగా చిన్నతనానికి సంబంధించిన విషయాలు మరచిపోయేందుకు చాలా అవకాశం వుండడం.

2) కొందరు 'స్వీయ చరిత్ర' రచయితలు పెద్దవాళ్లు అయిన తర్వాత తమ జీవితంలో జరిగిన సంఘటనలకు, ఏర్పడిన అభిప్రాయాలకు, సరిపడే విధంగా తమ చిననాటి రోజుల కథను కృత్రిమంగా మలిచేందుకు ప్రయత్నం చెయ్యడం.

3) కొన్ని విషయాలు చెబితే తమకు అపఖ్యాతి కలుగుతుందనో; లేదా చెప్పడానికి మొహమాటపడో కొన్ని నిజాల్ని వదిలి పెట్టెయ్యడం. ముఖ్యంగా సెక్సుకు సంబంధించిన విషయాల్లో యిది జరుగుతుంది.

4) కొన్ని సత్యాలు జ్ఞాపకం వున్నప్పటికీ – ఆత్మకథను కళాత్మకంగా, రసవత్తరంగా చెప్పవలసివున్నందున–వదిలి పెట్టవలసి వస్తుంది. 'గతే' అన్నట్లు– "A fact of our life is valuable not so far as it is true, — but so far as it is significant–" అన్న అభిప్రాయం కూడా వుంది.

ఈ కారణాలన్నింటి వలనా – ఆత్మ కథల్లో 'సత్యం' పాలు కొంతవరకూ లోపించే అవకాశం వుంది. సత్యం తప్పకూడదని స్వీయ చరిత్ర రచయితలు 'గిరి' గీసుకొని కూర్చున్నా – కాస్తంత కాల్పనికత చోటుచేసుకోక తప్పదు. అయితే – కాల్పనికత పాలు ఎక్కువై పోయినప్పుడు స్వీయ చరిత్ర కాస్తా 'నవల' గా మారి కూర్చుంటుంది. సత్యదూరం కాకుండా, – పాఠకులకు విసుగు కలిగించకుండా – స్వీయచరిత్రలు వ్రాయడం ఒక గొప్ప కళ. అంతేకాదు – స్వీయ చరి తలకు రచయిత భావాలకు తగ్గట్టు పేరు పెట్టడం కూడా ఓ 'కళే'. పాశ్చాత్య ప్రపంచంలో 'గతే' (Goethe) – "పొయిట్రీ అండ్ ట్రూత్", రాబర్ట్‌గ్రీవ్స్ "గుడ్‌బై టు ఆల్ దట్", స్టార్మ్ జేమ్సన్ "నో టైమ్ లైక్ ది ప్రెజెంట్" – యిలాంటి పేర్లు గల ఆత్మకథలు కనబడతాయి. మన భారతీయ స్వీయచరిత్రల్లో కూడా, కృష్ణాహతీసింగ్ "యెట్ నో రిగ్రెట్స్", ముల్క్‌రాజ్ ఆనంద్ "సెవెన్ సమ్మర్స్", కె. ఏ. అబ్బాస్ "అయామ్ నాట్ ఎన్ అయ్‌లెండ్", యిలాంటి మకుటాలు కనబడతాయి. తెలుగులో ఆత్మకథలకు యింత అందమైన పేర్లు పెట్టినవాళ్ళు తక్కువ మంది.

ఆత్మకథకు ప్రాతిపదిక జ్ఞాపకాలు. గతాన్ని గురించిన జ్ఞాపకాలను పూసగుచ్చితే ఆత్మకథ తయారవుతుంది. అయితే ఆత్మకథకూ, మరొక వచన సాహిత్య ప్రక్రియ అయిన "మెమోయిర్స్"(జ్ఞాపకాలు) కూ గల తేడాను గమనించాలి. ఈ విషయాన్ని వివరిస్తూ 'Cassells Encyclopaedia of English literature, యిలా అంటోంది : "The writer of an autobiography has as prime object the narration of his life. The author of a volume of memoirs is intent upon telling the history of his times" – స్వీయ చరిత్రలో తన కథ వివరిస్తున్నప్పుడు తన కాల పరిస్థితుల్ని వివరించక తప్పదు. అదే విధంగా తన కాలపరిస్థితుల్ని వివరిస్తున్నప్పుడు – తన కథ అంతర్లీనంగా అందులో కలవక తప్పదు. అయితే– తన కథకు, తన కాలపు కథకు, ప్రాధాన్యతలలోని తేడాలను బట్టీ – Autobiographies, Memoirs, అనే తేడా ఏర్పడుతున్నదనుకోవాలి 'తన కాలపు కథ' అంటే – తను సాక్షిభూతుడుగావున్న పరిస్థితుల కథ. తను చూడని విషయాలు – తన పాత్ర ఏవిధంగానూ లేని విషయాలు – యిట్లాంటివాటి గురించి పేజీల తరబడి వర్ణిస్తే Memoirs కాస్త చరిత్ర అయి కూర్చుంటుంది

"— It is a great mistake for the author of a volume of memoirs to pass himself off as an historian... If he gives too great a prominence to the general historical background - or especially if he tries to explain events in which he played no part, he goes beyond his function and is bogged down in a false and hybrid situation. What the reader expects of an author of memoirs is his point of view—" —అనడంలోని విషయాన్ని మనం గమనించాలి.

స్వీయచరిత్రలు రచయిత వ్యక్తిత్వంమీద ఆధారపడితే "మెమొయిర్స్" రచయిత భాష, శైలి, పరిశీలనా దృష్టి, రచనా విధానం వీటిమీద ప్రధానంగా ఆధారపడతాయి.

యిక— స్వీయచరిత్రకున్నూ, దినచర్య (డయరీ) కున్నూ, వున్న తేడా చెప్పాలంటే — ''ఏరోజుకారోజు వ్రాసిన స్వీయచరిత్ర దినచర్య అవుతుంది—'' అనీ చెప్పుకోవచ్చు.

తెలుగులో 'ఆటోబయాగ్రఫీస్' 'మెమోయిర్స్' రెండూ కలకోతగా రచించడం జరిగింది. వివిధ ఉద్యమాల్లో ప్రత్యక్షంగా పాల్గొన్న వారు స్వీయచరిత్రలు రాస్తే—దేశంలో జరిగిన గొప్ప సంఘటనలకు సాక్షులుగా ఒక తరంలో నిలచిన వాళ్ళు, తరువాతి తరాలకు 'మెమోయిర్స్' అందిచ్చారు. అయితే—'జ్ఞాపకాలు' అంటూ అచ్చంగా స్వీయచరిత్రలను అందిచ్చిన వారు కూడా వున్నారు. ఈ తరహా గందర గోళానికి అవకాశం లేకుండా ఈ పరామర్శలో—స్వీయ చరిత్రలు, స్వీయ చరిత్రాత్మక రచనలు, అని రెండు మాటలు వాడడం జరిగింది. దాదాపుగా 'Memoirs' వంటి వానిని స్వీయచరిత్రాత్మక రచనలు అని అనడం జరిగింది. ఇక, డైరీల విషయానికి వచ్చినట్టయితే—తెలుగు వారికి సగటున ఈ అలవాటు బాగా తక్కువ. ఒకప్పుడు గురజాడ వారు రచించిన డైరీలు ''మహాకవిడైరీలు'' అను మకుటంతో ప్రకటితం అయివున్నాయి ఈ మధ్య వెలువడిన డైరీలలో—కె. వి. రమణారెడ్డి గారి ''డిటెన్యూడైరీ'' పలువురి ప్రశంసలను నోచుకొంది.

*            *            *

వీరేశలింగం పంతులుగారి 'స్వీయచరిత్రము' వెలువడిన తర్వాత,—స్వాతంత్ర్యానికి ముందు-తెలుగులో వెలువడ్డ బహు కొద్ది స్వీయచరిత్రల్లో ముఖ్యంగా చెప్పుకొన దగ్గవి—చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు, రాయసం వెంకటశివుడు గారు, వల్లూరి సూర్యనారాయణగారు, ప్రభృతుల స్వీయచరిత్రలు. వీటిల్లో ప్రకాశం పంతులు గారి 'నా జీవితయాత్ర' తలమానికం వంటిది. ఆనాటి స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి చెప్పే స్వీయచరిత్రల్లో దీనికి సాటైనది మరొకటిలేదని చెప్పాలి. అయితే—ఈ పరిశీలనలో స్వాతంత్ర్యానంతర స్వీయచరిత్రా సాహిత్యాన్ని మాత్రమే పరామర్శించడం జరుగుతున్నది కాబట్టి—దాని ప్రస్తావన యింతటితో వదలివేస్తాము.

స్వాతంత్ర్యానంతరం—స్వాతంత్ర్య యోధులు చాలా మంది స్వీయచరిత్రలను, స్వీయచరిత్రాత్మక రచనలను వ్రాసుకొన్నారు. అయితే—వీరిలో కొంత మంది స్వీయచరిత్రల్ని ఆలస్యంగా ప్రారంభించడం వల్ల కొన్ని స్వీయచరిత్రలు అసంపూర్ణంగా వుండిపోయాయి సంపూర్ణమైనా, కాకపోయినా—త్యాగ భరిత జీవితాలను గడిపిన ఆ మహనీయుల స్వీయచరిత్రలు తరువాతి తరాల వారికి ఎల్లప్పుడూ ఉత్తేజాన్ని అందిస్తూనే వుంటాయి. ఈ సందర్భంలోనే మనం కొండా వెంకటప్పయ్య పంతులు గారి '' స్వీయచరిత్రము '', అయ్యదేవర కాళేశ్వరరావు గారి ''నా జీవితము—నవ్యాంధ్రం'', దరిశి చెంచయ్య గారి ''నేను—నాదేశం'', గొట్టిపాటి బ్రహ్మయ్య గారి ''నా విజీతనౌక'', పెద్దిబొట్ల వీరయ్య గారి ''స్వీయచరిత్ర'' మొదలగు వాని గురించి ప్రస్తావించాలి.

కొండా వెంకటప్పయ్య పంతులుగారు తమ స్వీయచరిత్రమును రెండు భాగములుగా రచించారు. 1918 వరకూ, అంటే—గాంధీజీ ప్రభావానికి ముందు స్వరాజ్యోద్యమానికి సంబంధించి మొదటి భాగాన్ని—1919 నుండి 1932 వరకూ అంటే ఉప్పు సత్యాగ్రహం వరకూ గాంధీ యుగానికి సంబంధించి రెండో భాగాన్ని నిర్దేశించి, ఆయన స్వీయచరిత్ర వ్రాయడం జరిగింది. ఆనాటి 'శా' కాలేజీ చదువుల దగ్గర్నించి—కాంగ్రెస్ అతివాద, మితవాద, రాజకీయాలు—బ్రాహ్మణ, అబ్రాహ్మణ ద్వేషాలు, ఆంధ్రరాష్ట్రోద్యమం, మొత్తం ఆనాటి కథ అంతా వీరి స్వీయచరిత్రలో మనకు కనబడుతుంది. ఇక—గాంధీజీ మహనీయ నేతృత్వానికి, వ్యక్తిగా ఆయన ఔదార్యానికి, మానవతకు సంబంధించిన ''ఏనెక్‌డోట్స్'' ఎన్నో——

వీరి స్వీయచరిత్రకు 'విజ్ఞప్తి' వ్రాస్తూ కాటూరి వెంకటేశ్వరరావు గారు—''భోగిరాజు వారి ప్రజ్ఞ ప్రకర్షగాని, టంగుటూరి వారి సాహసరసికతగాని, కాశీనాధుని వారి వితరణగాని, కొండావారికి లేదు. అట్లయ్యు, వీనిన్నింటికి మించిన సత్యతత్పరత, ఆస్తిక్యము, నిరంతర సేవాసక్తి, ఆత్మవితరణము,—యివి 'దేశభక్తు'ని సమానులలో ఉత్తమ శ్లోకు నొనర్చినవి—'' అన్నమాటలను 'దేశభక్త' యొక్క 'పెన్‌పిక్చర్' గా చెప్పుకోవచ్చు.

గాంధీజీ నాయకత్వంలో దేశం మొత్తం మీద పన్నుల నిరాకరణ ఉద్యమం జరిగినప్పుడు, ఉప్పు సత్యాగ్రహోద్యమం నడిచినప్పుడు, ఆంధ్రదేశంపై—ముఖ్యంగా కృష్ణాజిల్లాపై—వాటి ప్రభావం ఎలా పడినదీ వీరి స్వీయచరిత్ర చదివితే తెలుస్తుంది. పన్నుల నిరాకరణోద్యమం 'బార్డోలీ' లో ఎంత చరిత్రాత్మకంగా జరిగిందీ స్వాతంత్ర్యోద్యమ కథతో సంబంధం వున్నవారందరికీ తెలిసిన విషయమే. ఆ బార్డోలీ సత్యాగ్రహమే వల్లభాయి పటేల్‌ను 'సర్దార్' పటేల్‌గా మార్చింది. అలాంటి ఉద్యమమే కృష్ణాజిల్లా పెదనందిపాడు తాలూకాలో జరిగింది. ఆ కథ వీరి ఆత్మకథలో చాలా వివరంగా చర్చించబడింది. ఆ భాగాలు చదువుతూంటే ఎంతో ఉత్తేజం కలుగుతుంది. ఆ విషయాన్ని గురించి వ్రాస్తూ కొండా వారు యిలా అంటారు :

''—అప్పుడు చెన్న పట్టణములో గవర్నరుగా వుండిన లార్డ్ వెల్లింగ్టన్ యింగ్లాండ్ వెళ్ళినప్పుడు, పెదనందిపాడు ఫిర్కాలోని పన్నుల నిరాకరణోద్యమము బ్రిటిష్ ప్రభుత్వమును కుంకుడు వ్రేళ్లతో కదిలించినదని పార్లమెంటులో వాక్రుచ్చెను. ఇంతటి సంక్షోభమును కలిగించిన పెదనందిపాడు యుద్యమమును గురించి కాంగ్రెస్ చరిత్రకారులు కాంగ్రెస్ చరిత్రలో నామ మాత్రముగ సూచించి విడుచుట శోచనీయము. ''(పేజీ 110)

ఆనాటి స్వాతంత్ర్య సమర చరిత్రలో యిలాంటి ఫిర్యాదులు ఎన్నో. వెంకటప్పయ్య గారి ఆత్మ కథలోని మరో విశేషం గాంధీజీ ఆంధ్రదేశ పర్యటను చాలా వివరంగా వర్ణించడం. ఆ మహనీయునికి ఆతిథ్యం యివ్వడం కోసం ధనికులు వేలం పాటలు పాడుకోవడమూ, ఎవరింటికి ముందుగా తీసుకెళ్ళాలన్న విషయంలో తగువులు పడడమూ, యిందులో చాలా కుతూహల దాయకంగా చెప్పబడినాయి. ఆ మహా నాయకుని దర్శనం అయితే చాలని విరగబడే జనమూ, ఎంతటి త్యాగాని కయినా సిద్ధపడే అనుచరులు, — మళ్ళీ ప్రపంచ

చరిత్రలో యిలాంటి ఉదాహరణ మరొకటి సాధ్యమా అనిపిస్తుంది. ఏం వుంది మహత్యం ఈ 'అర్ధ దిగంబర సన్యాసి'లో అనుకుంటూ పులకించిపోతాం ఇవి చదివితే.

వెంకటప్పయ్యగారి స్వీయ చరిత్ర ఇలా ఎన్నో ఆసక్తిదాయక మైన విషయాలను అందిచ్చినా, పంతులుగారి రచనా ధోరణి అంత ఆసక్తికరంగా వుండదు. అక్కడక్కడ కొన్ని భాగాలలో "రీడ బులిటీ" కూడా లోపిస్తూంటుంది. ఏదిఏమైనా, తెలుగులో వెలువడ్డ మంచి స్వీయ చరిత్రల్లో యిది కూడా ఒకటి.

1959 వ సంవత్సరంలో అయ్యర దేవర కాళేశ్వరరావుగారి "నా జీవిత కథ — నవ్యాంధ్రం" వెలువడింది. "— దేశ స్వతంత్రతను, నవ్యాంధ్రమును, చూచి అనుభవించు అదృష్టము నాకు లభించెను. కావున భావి తరాల వారికి ఆంధ్రదేశమున జరిగిన విప్లవముల గూర్చియు, వాటిలో నాకుగల యనుభవము గూర్చియు, క్లుప్తముగా తెలుపు నుద్దేశముతో నీ గ్రంధమును వ్రాసితిని" అన్నారు కాళేశ్వరరావుగారు తమ ఉపోద్ఘాతంలో కాళేశ్వరరావుగారి స్వీయచరిత్ర ఆనాటి ఆంధ్రదేశ సాంఘిక రాజకీయ చరిత్ర అని చెప్పవచ్చు. ఇందులో మనకు ఆనాటి కాంగ్రెసు రాజకీయాలు కనబడతాయి. సంస్కరణోద్యమాలు, విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి వంటి సంస్థలు నిర్వహించిన సాహిత్యోద్యమాల, మదన మోహన మాలవ్యా, బాలగంగాధర తిలక్, గాంధీజీ మొదలయిన వారితో కాళేశ్వరరావుగారికి గల పరిచయాలు — యివన్నీ మూకవుమ్మడిగా మనకు కనబడతాయి వీరి ఆత్మకథ గురించి, పెద్దిబొట్ల వీరయ్యగారి ఆత్మకథ గురించి చెబుతూ ప్రసిద్ధ జర్నలిస్ట్ శ్రీ దిగవల్లి వెంకట శివరావుగారు — "ఇవి కేవలము వ్యక్తుల జీవిత చరిత్రలే గాక, లోకమాన్యుని కాలమునుండి గాంధీ మహాత్ముని నిర్యాణము వరకూ మన దేశములోని రాజకీయ, సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక వ్యవస్థలందు ప్రజల చిత్త ప్రవృత్తులందు కలిగిన గొప్ప మార్పులను గురించి వర్ణించు చరిత్రలుగనున్నవి" అన్నమాటలు అక్షరాలా నిజం.

స్వాతంత్ర్యోద్యమ వీరగాథల్ని వర్ణించే స్వీయ చరిత్రలు ఎన్ని వెలువడినప్పటికీ — దరిశి చెంచయ్యగారి "నేను - నా దేశం" కు సాటైనది ఇటీవలి కాలంలో ఏదీ రాలేదని నా అభిప్రాయం. ఈ స్వీయ చరిత్ర చదవడం ఒక గొప్ప అనుభవం. ప్రతి తెలుగువారూ ఈ స్వీయ చరిత్రను చదవాలని, వివిధ భారతీయ భాషల్లోనికి దీనిని అనువదించాలని అనడానికి నేను సందేహించను. ఒక వ్యక్తి తన జీవితంలో ఎంత సాధించాడనిగాక, ఒక గొప్ప ఘనకార్యాన్ని చేసేందుకు ఎంత తపన చెందాడు, తన ఆదర్శాన్ని అందుకోడానికి ఎంత పరితపించాడు, అని తెలుసుకోవాలంటే చెంచయ్యగారి స్వీయ చరిత్ర చదవాలి. చెంచయ్యగారి పేరు ఆనాడూ, ఈనాడూ కూడా ఎక్కువ మందికి తెలియకపోవచ్చు. ఎందుకంటే ఆయన ఎప్పుడూ 'సేనాని'కాదు. ఎప్పుడూ 'సైనికుడు' మాత్రమే. కాని — ఆయన చరిత్రలో "సంఘర్షణ" వుంది. త్యాగం వుంది. నిజాయితీతోకూడిన తపన వుంది. తన తపనకు చక్కటి అక్షర రూపం యివ్వగల శక్తి వుంది. ప్రవాహంలో చీపురుపుల్లలా కొట్టుకుపోవడానికి ఇష్టపడని ఒక వ్యక్తి ప్రభుత్వంతో, సంఘంతో— (ఒక్కొక్కప్పుడు "డాన్‌క్విక్సోట్"లా అనిపించినా) ఎలా పోరాడతాడో ఈ స్వీయ చరిత్రలో చెంచయ్యగారు మనకు చెబుతారు. అందుచేతనే, ఈ స్వీయచరిత్ర ఒక నవలలాగా మనచేత చదివింపజేస్తుంది. / ఒకమంచి నవల లాగా ఆలోచింపజేస్తుంది.

శ్రీ దరిశి చెంచయ్యగారు గదర్ ఉద్యమ వీరులు. ఈగదర్ ఉద్యమం 1913—1919ల మధ్య నడిచింది. 'గదర్' అంటే సైనికులు తిరుగుబాటుచేసి—నూతన ప్రభుత్వ స్థాపనకై సాయుధ పోరాటాన్ని సాగించడం అని అర్థం. ప్రథమ ప్రపంచ యుద్ధ సమయంలో గదర్ ఉద్యమం ప్రారంభమై అంతలోనే త్రుంచివేయబడింది. లాహిరీ అనే బెంగాలీ యువకుడి ప్రోత్సాహంతో లాలాహార దయాళ్ వర్మ అమెరికాలో గదర్ పార్టీని 1913 లో ప్రారంభించినప్పుడు— అప్పట్లో కాలిఫోర్నియా విశ్వ విద్యాలయంలో విద్యార్థిగా వున్న చెంచయ్యగారు ఈ పార్టీ సభ్యులయ్యారు. ఈ పార్టీ ప్రధాన ఆశయం విప్లవ మార్గంలో మన దేశానికి స్వాతంత్ర్యం తీసుకురావడం.

"—నేను ఈ ఉద్యమ ఆరంభంలో పాల్గొన్నందుకు గర్వపడుతూంటాను. ఆ ఆరంభ చరిత్ర ఎరిగినవారు పట్టుమని పది మంది కంటె ఎక్కువలేరు. వారిలో తొమ్మండుగురు యిప్పుడు మనమధ్య లేరు. మిగిలిన నేను—నేనెరిగినంత వరకూ సంగ్రహంగా ఈ వీరగాథను తెలియ జెయ్యడం నా కర్తవ్యంగా భావిస్తాను—" అని, లాహోరు కుట్రకేసులో ముద్దాయిలలో ఒకరయిన చెంచయ్యగారు రాయడాన్ని గమనించితే, ఈ ఆత్మకథ ఎంత అమూల్యమైందో మనకు అర్థం అవుతుంది.

మొదటి ప్రపంచ యుద్ధాన్ని గదర్ పార్టీవారు అవకాశంగా ఉపయోగించుకోవాలని భావించారు. కాశ్మీర్‌లో, పశ్చిమ పరగణాలలో తిరుగుబాటు, సాయుధ పోరాటం తీసుకురావాలనీ, టర్కీ, జర్మనీ దేశాలకు, యింగ్లాండ్‌కు, మధ్య జరుగుతున్న యుద్ధంలో భారతీయ, మహమ్మదీయ సైనికులను టర్కీ పక్షంగా త్రిప్పివేసి, యుద్ధంలో యింగ్లీషు వాళ్ళు ఓడిపోయేలా చెయ్యాలనీ గదర్ పార్టీ వారు ప్రయత్నించారు. ఈ కారణంగా బ్రిటిష్ పోలీసులు గదర్ నాయకులను అరెస్ట్ చేశారు. ఊచకోతగా బ్రిటిష్ ప్రభుత్వం గదర్ యోధుల నందరినీ అణచివేసింది. ఈ స్వీయ చరిత్రలో చెంచయ్యగారు బ్రిటిష్ ప్రభుత్వ సి. ఐ. డీ లను తప్పించుకోడానికి తాము చేసిన ప్రయత్నాలను, బ్రిటిష్ మిలటరీ పోలీసుల చేతిలో మన దేశంలో, యితర దేశాలలో తాము పడిన బాధలను, అవమానాలను చక్కగా వర్ణించారు.

గదర్ పార్టీ ఉద్యమ ఫలితంగా చెఱసాల వాసాలు పూర్తి చేసుకొని, చెంచయ్యగారు సంస్కరణ ఉద్యమాల్లో పని చేశారు. వితంతు వివాహాలు జరిపించారు. కళావంతులకు పెళ్ళిళ్ళు చేశారు. ఆ తర్వాత కమ్యూనిస్ట్ ఉద్యమాలవలన ఆకర్షితులై ఆ ఉద్యమంలో

ఉధృతంగా పనిచేశారు. వీరి ఆత్మకథలో మనకు ఆనాటి కమ్యూనిస్టు ఉద్యమాలు కళ్లకు కట్టినట్లు కనబడతాయి. పర ప్రభుత్వంతోను, సంఘ దురాచారాలతోను, చెంచయ్యగారు జరిపిన పోరాటాన్ని వీరి ఆత్మకథ కుతూహల ద్యాయకంగా చెబుతుంది.

''-గడచిన 36 సంవత్సరాల రాజకీయ జీవితంలో నన్ను నాలుగు సార్లు జెయిళ్లలో నిర్బంధించారు. రెండు సార్లు విదేశీ ప్రభుత్వం, రెండు సార్లు ప్రజా ప్రభుత్వం బేంకాకు, సింగపూరు, లాహోరు, కలకత్తా, ఢిల్లీ, కోయంబత్తూరు, వెల్లూరు జెయిళ్ళలో వున్నాను. వేతులతో, కాళ్లతో, బూట్లతో, లాఠీలతో, దెబ్బలు తిన్నాను. కొన్ని రోజులు నా బట్టలన్నీ ఊడదీశారు. ఎన్నో బాధ లకు గురి అయినది ఈ శరీరం. నేను కోరిన సంపూర్ణ స్వరాజ్యం కాని, ప్రజా ప్రభుత్వం కాని, యింకా ఏర్పడలేదు. కాని-నా జీవిత కాలంలో ఏర్పడు తుందనే నమ్మకం నాకు యిప్పటికీ ధృడంగానే వున్నది'' అంటూ తమ 'స్వీయ చరిత్ర'ను ముగిస్తారు చెంచయ్య గారు.

గదర్ ఉద్యమం నుండి కమ్యూనిస్టు ఉద్యమాల వరకూ విస్తరించిన ఈ స్వీయ చరిత్ర బాస్టిల్ చెఱసాలను మించి పోయిన ఆనాటి దేశ, విదేశ, చెఱసాళ్ల గురించి చెప్పడం మాత్రమే గాక ఎన్నెన్నో ''ఏనెక్‌డోట్స్'' కూడా అందిస్తుంది. సన్ యేట్ సీన్‌ను రచయిత కలుసుకొనడం అలాంటి ఉదాహరణలలో ఒకటి. ''అంత కన్న చవక బట్టలు, కుర్చీలు, ఏ యింటిలోనూ వుండక పోవచ్చు. అతి నిరాడంబరజీవి-'' అంటూ చెంచయ్యగారు సన్ యేట్ సీన్ గురించి చెప్పిన మాటలు చాలా కాలం జ్ఞాపకం వుంటాయి.

ఆనాటి స్వాతంత్ర్య సమర యోధులలో కొందరు ఆనాటి తమ వీరగాథల్ని పైన చెప్పిన రీతిలో స్వీయ చరిత్రలుగా మన ముందు వుంచితే - మరి కొందరు, యిదివరలో ప్రస్తావించిన రీతిలో స్వీయ చరిత్రాత్మక రచనలుగా మన ముందుంచారు.

ఈ సందర్భంలోనే మనం డా. తిరుమలరావు గారి 'గడచిన రోజులు' గురించి చెప్పాలి. గడచిన తరానికి చెందిన స్వాతంత్ర్య వీరగాథల్ని మన ముందు అందంగా వుంచే మంచి స్వీయ చరిత్రాత్మక రచనల గురించి చెప్పేటప్పుడు తప్పని సరిగా 'గడచిన రోజులు' గురించి పేర్కొనాలి. ఈ పుస్తకం చదివితే మనం మరచిపోయిన లేదా మరచిపోతున్న స్వాతంత్ర్య యోధులందరూ ఒక్కసారి కళ్లముందు నిలచినట్లుగా వుంటుంది. బులుసు సాంబమూర్తిగారి మొదలు, కామరాజ్‌నాడార్ వరకు ఎందరో పెద్దల జ్ఞాపకాలను ఘనం ఈ రచనలో చూస్తాం. రచయితకు చక్కటి భాషా జ్ఞానం వుండడం వల్ల 350 పేజీల ఈ రచన అంతా ఒక బిగిన చదవ బుద్ధి అవుతుంది.

''1930-31 ప్రాంతాలలో కాకినాడ కేంద్రంగా ఆ ప్రాంతంలో ఉద్యమం నడుస్తున్నది. రోజా టవున్‌హాల్లో సాయం సమయాల్లో ఉపన్యాసాలు జరుగుతూండేవి. ఆనాడు జ్యోతుల్లా వెలిగిన వ్యక్తులు కొందరు యిప్పటికీ లీలగా మెదులు తున్నారు - మనస్సులో. ఆనాటి యువకుల హృదయాలపై చెరగని ముద్రవేసిన వారిలో ప్రతివాద భయంకర వెంకటాచారిగారు ఒకరు. అతని పేరు వింటే పోలీసులు హడలి పోయేవారు. కాకినాడ కుట్రకేసుతో ఈయన పేరు ప్రసిద్ధమైంది. అందరూ భయంకరా చారి అని పిలిచేవారు-'' అంటూ రచయిత ఆ రోజుల్లో గోదావరి జిల్లాల్లో జరిగిన స్వాతంత్ర్యోద్యమాన్ని కడు రమణీయంగా వర్ణిస్తారు. అయితే -ఈ పుస్తకం అంతటిలోకీ నాకు నచ్చిన ఆయన జ్ఞాపకం శ్రీ ఖాసా సుబ్బారావు గారికి సంబంధించినది. రాయవెల్లూరు జెయిలులో వుండే రోజుల్లో తనకు పరిచయం అయిన ఖాసావారిని గురించి రచయిత హృదయం స్పందించే రీతిలో రాశారు. జర్నలిస్టుగా ఎంతో శక్తి సామర్థ్యాలు వుండి, పెద్ద పెద్ద పత్రికలు గొప్ప జీతాలు యిస్తామన్నా కూడా లక్ష్యపెట్టక - జీతాలు సరిగారాని 'స్వరాజ్య' పత్రికలో పనిచేస్తూ - ఆఫీసుకు బస్సుమీద వెళ్ళడానికి కూడా డబ్బు చాలక - అన్నం మూటగట్టుకుని బీచి రోడ్డంట నడుస్తూ 'స్వరాజ్య' ఆఫీసుకు వెళ్లే శ్రీ ఖాసావారి జ్ఞాపకాలు తిరుమలరావు గారి గ్రంథంలో చాలా చక్కగా చోటుచేసుకున్నాయి.

స్వీయ చరిత్రాత్మక రచనలు వ్రాసుకున్నవారిలో బ్రిటిష్ వారితో పోరాడిన స్వాతంత్ర్య సమరయోధులు మాత్రమేకాదు-''జన్మ జన్మాల బూజు'' అయిన నిజాము రాజాతో తలబడిన మహనీయులు కూడా వున్నారు. ఈ సందర్భంలోనే మనం మాడపాటి హనుమంత రావుగారి ''తెలంగాణా ఆంధ్రోద్యమం'', రావి నారాయణరెడ్డిగారి ''వీర తెలంగాణా - నా అనుభవాలు'', సంగం లక్ష్మీబాయమ్మగారి ''నా అనుభవాలు'' మొదలయిన వానిని పేర్కొనాలి. మాదిరాజు రామకోటేశ్వరరావు, కొండా వెంకటరెడ్డిగార్ల స్వీయ చరిత్రలను కూడా ఈ కోవకే చేర్చవలసివుంటుంది

మాడపాటి హనుమంతరావుగారి 'తెలంగాణా ఆంధ్రోద్యమం'' 1950 ప్రాంతాల్లో రెండు వాల్యూములుగా వెలువడింది. తెలంగాణాలో జరిగిన వివిధ ఉద్యమాలలో ఆయనకుగల పాత్ర పుస్తకం అంతటా కనబడుతుంది. యిందులో మనకు నిజాం నిరంకుశ పాలనలో ప్రజలు పడిన బాధలు, ప్రజాజీవిత పునరుజ్జీవనంలో ఆంధ్ర మహాసభ పాత్ర, తెలంగాణాలో జరిగిన ఆంధ్ర మహాసభల వివరాలు, ప్రజలపై వీటి ప్రభావం, - యివన్నీ బహు చక్కగా ఆంధ్ర పితామహులచే వర్ణితములయినాయి. ఈ పుస్తకము ప్రచురితం అయిన, సుమారు ఒక దశాబ్దానికి వెలువడిన మాదిరాజు రామకోటేశ్వరరావుగారి స్వీయచరిత్రలో రజకార్ల దురంతాలు, మూసీనది వరదలు, ఆనాటి ఉర్దూ భాషా సంస్కృతి, యివన్నీ కళ్లకు కట్టినట్లు కనబడతాయి.

''వీర తెలంగాణా - నా అనుభవాల, జ్ఞాపకాలు'' అనే స్వీయ చరిత్రాత్మక రచన రచించిన రావి నారాయణరెడ్డిగారు ఆంధ్రమహాసభ కార్యకలాపాలలో ప్రముఖ పాత్ర వహించినవారు రెండుసార్లు ఆంధ్ర మహాసభకు అధ్యక్షత వహించినవారు. వీరు రచించిన ఈ గ్రంథం మనకు తెలంగాణా ప్రజా ఉద్యమాల చరిత్రను - ముఖ్యంగా కమ్యూనిస్టు ఉద్యమపు కథను-చెబుతుంది.

రాజకీయాలతో సంబంధంలేని ఒక మామూలు సభ పెట్టుకోవాలన్నా ఆనాటి ప్రజలు ఎదుర్కోవలసి వచ్చిన యిబ్బందులు — "అంజుమన్ తబ్లీగులాస్లాం" చేసిన అభ్యుదయ నిరోధక కార్యకలాపాలు — యివన్నీ యివాళ చదువుతూంటే అతిశయోక్తులుగా కనబడవచ్చు. కాని — అవి పచ్చినిజాలు. రావి నారాయణరెడ్డిగారి జీవిత కథతో ముడిపడిన ఆ నిజాల కథే — ఈ స్వీయ చరిత్రాత్మక రచన.

*　　　*　　　*

స్వీయ చరిత్రలు వ్రాసుకున్న ఆంధ్రులలో రాజకీయ ఉద్యమాలలో పాల్గొన్నవారేకాక, — కవులు, కళాకారులు, సంఘ సంస్కరణాభిలాషులు, మొదలయిన వారెందరో వున్నారు.

స్వాతంత్ర్యానంతర యుగంలో స్వీయ చరిత్రలు వ్రాసుకున్న రచయితలలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రముఖులు. వ్యావహారిక భాషావాదులయిన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చక్కటి కథకులు. తెలుగు దేశపు మధ్య తరగతి వైదిక బ్రాహ్మణ జీవితాలను, వాళ్ల సెంటిమెంట్లను, అత్యంత వాస్తవికంగా చూపించడంలో ఘటికులు వీరు. శాస్త్రిగారు రచించిన స్వీయచరిత్ర "అనుభవాలు—జ్ఞాపకాలూను—" అనే మూడు భాగాల రచన భాషాపరంగా చూచినా, వస్తువిషయకంగా చూచినా, చాలా ముఖ్యమైన రచన. ఈ పుస్తకం గురించి అభిప్రాయం రాస్తూ — రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు — "మీ పుస్తకం చదవకపోతే, ఈ కాలం వారికి యిటువంటి ప్రపంచం ఒకటివుందని ఊహించడానికయినా వీలు లేదు. కాలపరిస్థితులంతగా మారిపోయినవి. రచనలో, అచ్చులో మీరే ఒక స్వచ్ఛంద శయ్య—కృత్యాకృత్యాలలో మీకున్న భావోద్రేకాలన్నీ అన్నిచోట్లా ప్రతిఫలించి మెరయించే శక్తిమీది. దాని ఛేదనించి తప్పించుకోగలిగిన చదువరులే అరుదు—" అన్నారంటే, అందులో అతిశయోక్తిగాని, అసత్యంగానీ, రవ్వంతయినా లేదు.

శ్రీ శాస్త్రిగారు ఆధునికమైన కాలేజీల చదువులు చదువుకోలేదు. శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన వీరు గురుకుల వాసం చేస్తూ—అచ్చమైన భారతీయ విద్య చదువుకున్నారు వీరి ఆత్మకథ చదివితే, తెలుగుదేశంలో ఒకప్పుడు పల్లెటూళ్లు ఎలా వుండేవో, వాటి అందాలు ఎలాంటివో తెలుస్తుంది గురుకుల వాసంలో వున్న ప్రత్యేకతను గురించి, ఆయవారాలు సంపాదించుకోవడంలోవున్న మెళకువల గురించీ, శాస్త్రిగారు చెప్పిన విషయాలు యివాళ చదువుతూంటే — బహుముచ్చటగా వుంటుంది యిది యిలావుండగా — ఆనాటి సాహిత్యోద్యమాలు, వైదీకుల ఆచారాలు, నిష్ఠలు, యజ్ఞయాగాలు, ఒకటేమిటి? ఆనాటి సాంఘిక చరిత్ర అంతా కనబడుతుంది. అంతేనా? — వివిధ విషయాలపై శాస్త్రిగారి అభిప్రాయాలు జతచేరివుంటాయి. అదిన్నీ, అత్యంత సుందరమైన వ్యావహారిక భాషలో — శాస్త్రిగారి భావాలు మీరు అంగీకరించండి, అంగీకరించకపోండి — కాని, కలకండలాంటి ఆ భాషను పరికించి, వ్యవహారపు పలుకుబడి ఎంత సొగ్గా వుందీ అనుకోనక తప్పదు. చలంగారిని, మల్లాది రామకృష్ణశాస్త్రిగారిని మినహాయిస్తే తెలుగులో యింత మనోహరమైన వ్యావహారికాన్ని వ్రాసిన వారు అంతకముందూ, ఆ తర్వాతా కూడా లేరు. వ్యావహారిక భాషకు యూనివర్సిటీ స్థాయిలోకూడా పట్టాభిషేకం చేసేశామని గొప్పలు చెప్పుకుంటున్న ఈ రోజుల్లో శాస్త్రిగారి "అనుభవాలు—జ్ఞాపకాలు" లోని ఏదో ఒక సంపుటాన్ని ఉపవాచకంగా విద్యార్థులకు నిర్ణయించాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

"—స్త్రీలను ఆశ్రయించే నేర్చుకున్నాను తెలుగుభాష. ప్రయోగ విజ్ఞానం కూడా నాకు స్త్రీలవల్లనే అలపడింది. పురుషుల భాషలోకంటే స్త్రీల భాషలో మాధుర్యము, హృదయాలను పట్టేసే జాతీయతా కనబడినవి. వారి మాటల పొందికా, వారి హావభావ ప్రదర్శనా చాతుర్యము, తెలుగు భాషలో నాకు మాతృభిక్ష ప్రసాదించాయి" అన్న కవి, నాటకకర్త, కథకుడు, నవలా కర్త, శ్రీ పాదవారి ఆత్మకథ సాహితీప్రియులందరకూ అద్యంతమూ గొప్ప పేయరాసం.

సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మన సంప్రదాయాన్ని అందంగా చూపుతూ కథలు రాస్తూండే రోజుల్లోనే 'చలం' అనే తుఫాను తెలుగు దేశానికి వచ్చింది. తెలుగు సాహితీ సీమకు 'చలం' యిచ్చిన 'షాక్‌ట్రీట్‌మెంట్' సామాన్యమైంది కాదు. తెలుగు సాహిత్య చరిత్రలో చలం అంతగా తీవ్రమైన దూషణ భూషణలకు గురి అయిన వ్యక్తులు చాలా తక్కువ మంది. 'పీటర్ వెస్ట్‌లేండ్' అనే సాహిత్య విమర్శకుడు డి. హెచ్. లారెన్స్ గురించి చెబుతూ—
"By many he was accepted as a writer with some

**thing important to say, by others he was rejected as a neurotic imposter–''** అన్న మాటలు చలం గారి విష యంలో కూడా వర్తిస్తాయి.

—''డబ్బు మీద, అధికారం మీద, ఆధారపడనిలోకం వుండ కూడదా?— విజ్ఞానం, సౌందర్యపిపాస, ఆత్మీయత, ప్రేమ, ఈ విలువలు రాజ్యం చేసే ఓలోకం వుండకూడదా?— ఊర్ధ్వలోకాలు వుంటాయ్యంటారు. వాటిలో కాంతి, శాంతి, సౌజన్యం, ఆనందం, ప్రేమ, యివన్నీ foundationsగా అక్కడయినా వుంటాయా?–''
(ఆత్మకథ–)

అని ఆరాటపడిన చలంగారు అలాంటి స్వర్గం కోసమే వ్యక్తిగా, రచయితగా, పరితపించారు. అలాంటి వ్యక్తి రచించిన ఆత్మకథ ఆ మధ్య వెలువడింది. చలంగారి వంటి రచయితల స్వీయ చరిత్రల పట్ల పాఠకులు ఎన్నో ఆశలు కల్పించుకొనడం సహజం. ఎందుకంటే–వివాదాత్మక వ్యక్తుల గురించి సమగ్ర అవగాహనకు స్వీయచరిత్రలు ఎక్కువగా ఉపకరిస్తాయి. అయితే-చలం గారి 'ఆత్మకథ' పాఠకులకు క్రొత్త విషయాలను అందివ్వదు. ''మ్యూజింగ్స్'', ''కవిగా చలం'' మొదలయిన పుస్తకాల్లో యిది వరకు చెప్పిన విషయాలే యిందులో మరో రూపంలో కనబడతాయి. అంతే. ఇది యిట్లావుండగా, చలం గారికి ప్రత్యేకమైన శైలి ఒకటి వుంది. (నా కథలూ, నా శైలీ తగలడనూ...నా అహనా! నా అహనా! – అని చలం గారు అనేటప్పటికిన్నీ–)–అది అనితర సాధ్యమైనట్టిది. ఈ విషయాన్ని విశ్వనాథ సత్యనారాయణ గారి లాంటి వారే అంగీకరించారు. కాని–ఈ స్వీయచరిత్ర ఆయన రచనా శైలికి ఒక తార్కాణంగా కనబడదు. రచనలో 'Flow' కూడా కొర వడినట్లుగా అనిపిస్తుంది. ఏది ఏమైనా–చలంగారి 'ఆత్మకథ' చది వాక పాఠకుడిలో సంతృప్తి కలగదు. ఆయన ఆత్మకథ ఉండాల్సి నంత స్థాయిలో లేదేమోననిపిస్తుంది. ఇలాంటి నిరాశే నాకు బెర్ట్రాండ్ రసెల్ ఆత్మకథ చదివి నప్పుడు కూడా ఎదురయింది. చాలా కాలానికి రసెల్ ఆత్మకథ వ్రాశారని విని, ఆత్రుతగా పుస్తకం చదివి నప్పుడు ఎలాంటి భావం కలిగిందో–సరిగ్గా అలాంటిదే చలం ఆత్మకథ చదివి నప్పుడు కూడా కలిగింది. దీనికి కారణం,అవి బాగా వ్రాయబడి వుండక పోవడం కంటే, యింకా బాగుంటాయని పాఠకులు ఆశపడడం కూడా కావచ్చు.

''—నేను మొదట రాత ప్రారంభించినప్పుడు నేను ఒక రచయితను అవుతానని అనుకోలేదు. ఏవో జరిగిన అన్యాయాలువిని, నా హృదయం మండి–నేను రాసినవి దొంగ నీతి పరుల్లో చలనం పట్టించడం వల్ల నాకు ప్రోత్సాహం వచ్చింది. దేశమంతటా విరివిగా నా రచనలు చదివిన వాళ్లనించి విలాపాలు వచ్చేటప్పటికి నిశ్చయ మైంది నాకు ఈ తెలుగు వాఙ్మయంలో ఒక స్థానం వుందని... ...చలం ఒక రచయిత అన్న సంతోషంలేదు. రచయిత కావాలనేది నా ఆశల్లోనూ, ఆశయాల్లోనూ, ఒకటి కాదు. దానివల్ల నాకేం తృప్తిలేదు. ఇది నా జీవితానికి ఒక 'బై ప్రొడక్ట్' (**By product**) మాత్రమే—'' (ఆత్మకథ – పేజీ 325) అని చలంగారు భావించినందువల్లనే అనుకుంటాను. ఆయన ఈ స్వీయ చరిత్రలో తమ రచనా వ్యాసంగం గురించి అధికంగా వ్రాయ లేదు. అయితే – తన రచనల్లో వాడే భాషగురించి చక్కటి వివరణ యిచ్చారు. ''– నేను రచనలు సాగించేటప్పటికి నాకు తెలీకుండానే నేను మాట్లాడే భాషలో వ్రాశాను ... అసలు ఆనాడు భాషా ఉద్యమం ఒకటి వుందని నాకు తెలీదు. దీక్షితులుగారి నించే విన్నాను గిడుగు రామమూర్తిగారి పేరు. వారి శిష్యులు ఆలోచించి, భాషని ఎంతవరకూ మార్చవచ్చో తూచి రాసేవారు. ఆ ప్రయ త్నాలు, ఆ మడిగట్టుకోవడాలు, చదివితేనే నాకు అసహ్యం వేసింది. భాష ఎట్లా మారాలో నాకు శాసించాలని చూసేవారు, భర్తని ఎన్ని ముద్దులు పెట్టుకోవాలో శాసించినట్లు ...'' (ఆత్మకథ పేజీ 124) – యిలాంటి 'నేచురల్ ముద్దులు' చలంగారి రచనల్లో కోకొల్లలు. వీరి స్వీయచరిత్రలోకూడా ఆ 'ముద్దు ముచ్చట్లు' లేక పోలేదు.

ఇక – తెలుగు సాహిత్యంలో మరొక 'తుఫాను' తీసుకొచ్చిన శ్రీశ్రీగారు కూడా స్వీయచరిత్రను కొంతవరకూ రాశారు. శ్రీశ్రీ గారి ఆత్మకథ 'కథ' చాలా పెద్దది. 1945 'ఆనంద వాణి' పత్రి కలో ప్రారంభమై – 1946 'కథా వీధి' లో నడిచి, ఆ తర్వాత యిటీవల 'ప్రజాతంత్ర' లో పల్లవించింది. అనంతంగా సాగుతున్న ''అనంతం'' పేరుగల ఈ స్వీయ చరిత్రను పత్రికల వాళ్ళు 'సీరి యల్'గా భావిస్తున్నారుగానీ– శ్రీశ్రీగారు మటుకు 'సీరియస్'గా భావిస్తున్నట్టులేదు. శ్రీశ్రీగారు దీనిని ''ఆత్మ చరిత్రాత్మ చరి త్రాత్మక కథ''అని అన్నారు. 'అనంతం' సీరియల్‌లో శ్రీశ్రీగారు కవిత్వంలో తాను చేసిన ప్రయోగాలు చాలా వివరంగా ఛందస్సు లతో సహా వివరించారు. ఇవి సాహిత్య విమర్శకులకు మిక్కిలి ఉప యోగకరం. అయితే – యిదంతా ఒక ఎత్తూ, స్వీయ చరిత్రలో శ్రీశ్రీగారు కనబర్చిన నిజాయితీ మరొక ఎత్తూను. సాహిత్యపరంగా మాత్రమేకాదు, సెక్సు సంబంధాల విషయంలో కూడా ఏ మాత్రం దాపరికాన్ని కూడా శ్రీశ్రీ యిందులో కనబరచలేదు. ఇది చాలా గొప్ప విషయం. ఆయనకే చెల్లింది.

* * *

స్వీయ చరిత్రలు వ్రాసుకున్న ఆధునిక రచయితల్లో బుచ్చిబాబు గారు కూడా వున్నారు బుచ్చిబాబుగారి 'నా అంత రంగ మథనం' స్వీయ చరిత్రా సాహిత్యంలో విస్పందేహంగా ఒక మంచి రచన. బుచ్చిబాబుగారి ఈ స్వీయ చరిత్ర ప్రధానంగా ఆయన బాల్య జీవితాన్ని అంటే, పుట్టినప్పటినించి, పదిహేనవ ఏట స్కూల్ ఫైనల్ పాసై గుంటూరు క్రయిస్తవ కళాశాలలో చేరే వరకూ – చెబుతుంది. అంతేకాదు – బాల్య జీవితంలో ఆయన లేతమనసు మీద పడిన కొన్ని ప్రభావాల గురించి, అవి తన రచనలకు ప్రేరణ అయిన రీతి గురించీ, యిందులో బుచ్చిబాబు చాలా వివరంగా చెబుతారు. ఫ్రాయిడ్ సిద్ధాంతాల్ని తనకు తనే అన్వయించుకుంటూ, తన రచనల్నీ, బాల్య జీవితాన్ని రెండింటినీ సమన్వయం చేస్తూ – ఆదే ఒక నవలగా రాశారు బుచ్చిబాబు.

రవీంద్రుని 'మై బోయ్ హుడ్ డేస్' మాదిరిగా, గోర్కీ 'మై చైల్డ్ హుడ్ డేస్' మాదిరిగా, బుచ్చిబాబు గారి 'అంతరంగ మధనా'నికి కూడా సాహిత్యంలో ఒక స్థానం వుందని చెప్పవచ్చు.

ప్రతి రచయితకు తన రచనల వెనుక ఏదో ప్రేరణ వుంటుంది. ఆ ప్రేరణ ఏమిటో, ఎక్కడ వుందో విమర్శకులు ఆరా తీసి పట్టుకునే దానికన్నా – రచయితే తనకు తాను చెబితే, అంతకన్నా 'రేడ్ ఈజీ' విధానం యింకొకటి వుండదు.

దోస్తొయేవ్‌స్కీ అంటాడు –

"—To write a novel one must store up one or several powerful impressions that have found their way to the author's heart—" అని.

జీవితంలో కనబడేవి అన్నీ రచయితను కదిలించవు. ఇబ్సన్ అన్నట్టు – "– one should distinguish between that which was emotionally lived through and that which are merely experienced- because only the first can be the subject of creativity-"

—మనం బుచ్చిబాబుగారి ఆత్మకథలో చూచేవి అలాంటి మొదటి రకం అనుభూతుల్నే –

బుచ్చిబాబు నవల "చివరకు మిగిలేది" లోని 'కోమలి'పాత్ర చాలా మందికి సుపరిచితం. ఆ పేరు, ఆ పాత్ర స్వభావం రెండూ విత్రంగానే వుంటాయి. అన్నింటికీ మించి దయానిధి లాంటి వ్యక్తి 'కోమలి' లాంటి స్త్రీకి సన్నిహితుడు కావడం ఆ నవల పాఠకులకు ఓ చిన్న చిక్కు ప్రశ్నలాగా వుంటుంది. బుచ్చిబాబుగారి 'స్వీయ చరిత్ర'లో ఈ సమస్యకు కొంతవరకు సమాధానం దొరుకుతుంది.

ఆ పేరు గల వ్యక్తి ఒకామె – బుచ్చిబాబు చిన్నతనంలో తన తండ్రికి సన్నిహితంగా వుండేదట. ఆమెకు, తన తండ్రికి, మధ్య వున్న సంబంధం శారీరక సంబంధాలకు మాత్రమే పరిమితం కాని – ఒక చిత్రమైన అనుబంధం అని బుచ్చిబాబు అభిప్రాయం. ఈ ప్రేరణతోటే అంటే నిజమైన 'కోమలి' ప్రభావంతో– తాను "నన్ను గురించి కథ వ్రాయవూ?" లోని కుముదాన్ని "పాగలేని నిప్పు" కథలోని కథానాయికను సృష్టించానంటాడు బుచ్చిబాబు. యిక – 'చివరకు మిగిలేది' లోని కోమలి లాంటి మొరటు పాత్రను సృష్టించడానికి కారణం ఆ తరహా జీవుల పట్ల తనకు గల అభిమానమే కారణం అని చెబుతూ – చిన్నప్పుడు తాను ఉప్పర స్త్రీ స్తన్యాన్ని గ్రోలడం ఆ కారణం వెనుకగల కారణంగా చెప్పడం పాఠకులకు ఆసక్తి కరంగా వుంటుంది.

తన స్వీయ చరిత్రలో బుచ్చిబాబు యింతటితో ఆగలేదు. చిన్నప్పుడు తన జీవితంలో జరిగిన సంఘటనల జ్ఞాపకాలు ఆ తర్వాత తన రచనల్లో ఎలా వర్ణించబడినవీ – సుదీర్ఘంగా వివరించడానికి కూడా వెనుకాడలేదు. 'చివరకు మిగిలేది' లో అమృతం, దయానిధి, అనుకోకుండా ఒకరి నొకరు చీకట్లో పెనవేసుకునే దృశ్యం ఒకటుంది. అలాంటి సన్నివేశమే తన జీవితంలో జరిగిందంటాడు బుచ్చిబాబు. తను చిన్నప్పుడు ఒక రింటికి ఆడుకోవడానికి వెళ్ళి అక్కడ పడుకుంటే – కోరికలు తీరని ఒక ఆమె వివస్త్రయై నిద్రలోవున్న అతని బుగ్గలకు చనుమొనలు రాస్తే మెలకువ వచ్చిందట. చిన్నప్పుడు సరిగ్గా అర్థంకాని ఈ సన్నివేశం పెద్దయ్యాక నవల్లో చోటుచేసుకుందట.

యింతవరకూ బాగానే వుంది కాని—

"—విజ్ఞాన శాస్త్రానికి నా ఊహలో సాంకేతికం ఒక చక్రం. ప్రకృతి సాంకేతికం ఒక పుష్పం – చక్రం క్రింద పడి పుష్పం నలగిపోకూడదు ఈ సంఘర్షణ యితి వృత్తంగా చాలా కాలానికి వ్రాసిన కథానిక "ఊడిన చక్రం వాడని పుష్పం"—" (అంతరంగ మధనం – పేజీ 58) అంటూ వ్రాయడం కథల వెనుక కథని ఎక్కువగా తవ్వడమేమో అనిపిస్తుంది. అయితే, ఒక్కటి మాత్రం నిజం 'సోషల్ పర్పస్' తో బుచ్చిబాబు రాసిన తక్కువ కథల్లో 'ఊడిన చక్రం – వాడని పుష్పం' ఒకటి.

తన స్వీయ చరిత్రలో బుచ్చిబాబు చెప్పిన విషయాల సంగతి ఎలావున్నా, ఆ విషయాలను చెప్పిన ధోరణి బహు రమణీయంగా వుంటుంది. మొదటి నించి చివరి వరకూ ఈ అంతరంగ మధనం ఏక బిగిన ఒక నవలలాగా చదివింపజేస్తుంది. అద్భుతమైన బుచ్చిబాబు రచనా శక్తికి ఈ స్వీయ చరిత్ర కూడా ఓ ఉదాహరణ,

రచనా విధాన పరంగా ఆలోచిస్తే – తెలుగులో వచ్చిన మరొక గొప్ప స్వీయ చరిత్రాత్మక రచన జానకిరావ్‌గారి 'సాగుతున్న యాత్ర'. దీనికి ముందు ఆచంట జానకిరావ్‌గారు 'స్మృతి పథంలో' అను పేరిట ఒక రచనను చేశారు. ఈ సందర్భంలోనే మనం సంజీవదేవ్‌గారి 'స్మృతి బింబాలు' గురించి కూడా ముచ్చటించు కోవాలి. వీటిల్లో కనబడే కళారాధకుల హృదయ సౌకుమార్యం మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది.

జానకిరావ్ గారు మంచి భావుకులు, రసహృదయులు. "–మల్లె పువ్వులాంటి లాల్చీ, పాము కుబుసం లాంటి జరీ ఉత్తరీయం. ముఖాన్న యింత పెద్ద అగరు చుక్క. గాలికి ముంగురులు ఎగురుతూంటాయి–" ఇదీ 'సాగుతున్న యాత్ర' లోంచి తొంగిచూచే జానకీరావ్ అనే భావుకుని రూపం. ఇక, జానకీరావ్‌గారి జ్ఞాపకాలు తెలుసుకొంటున్న కొద్దీ కళలదేవి కరకంకణ నిక్వణాలు, గులాబీ పువ్వుల గుబాళింపులు, మన అనుభూతికి చేరువగా వస్తాయి 'తేనెలై కలకండ సోనలై వానలై చాన కిన్నెరసాని' పాటలు వినబడతాయి. కృష్ణశాస్త్రి, బసవరాజు అప్పారావుల కవితలు పలకరించి, పన్నీటిజల్లులు చిలకరిస్తాయి. అన్నట్టు – మధ్యమధ్యలో శ్రీనాథుడు, కాళిదాసు, రవీంద్రుడు, వీలుచూచుకొని యోగక్షేమాలు అడిగిపోతూంటారు. మరి – సాహిత్యాభిమానులకు యింతకన్నా మంచి అమృతపానం ఏముంది!

''—తంజావూరు వెళ్ళినప్పుడు అక్కడ పువ్వులవారు ఎడ తెగని కదంబసరులు కడుతూంటే, నేను స్నేహితుడితో అనేవాణ్ణి ''— ఈ ఉద్యోగం మానేసి పువ్వులు కడుతూ వుండిపోతాను'' అని. కానీ, ఒక్కటే బాధ. అందమైన అమ్మాయిచేతిలో యింత కదంబపుదొంతరా, యిన్ని సంపెంగలూ, యిన్ని గులాబీలూ ఈ చేతిలో వుంచి — ఆ చేతితో ఖరీదుపుచ్చుకోవడం నాచేత కాదు — ఏమిటో వెర్రి ఊహలు!'' (సాగుతున్న యాత్ర — సంపుటి 2 — పేజీలు 173–174)

—యిలాంటి రసప్లావితమైన పేరాగ్రాఫులు వీరి స్వీయ చరిత్రాత్మక రచననిండా కోకొల్లలు. బుచ్చిబాబు అన్నట్లు — ''సౌందర్యం కోసం సౌకర్యం త్యాగం చెయ్యగల'' రసహృదయులు జానకీరామ్. అందుచేతనే వీరి ''సాగుతున్న యాత్ర'' కళాత్మక హృదయం ఉన్నవారికి ఒక గొప్ప పండుగలాగా వుంటుంది.

వీరి స్వీయచరిత్ర గురించి తలుచుకున్నప్పుడల్లా నాకు రేడియో ప్రయోక్తగా జానకీరామ్‌గారు తిరుచ్చి కేంద్రంనుండి ప్రసారం చేసిన తమిళ 'ఏకవీర' విశేషంగా శ్రోతలను ఆకర్షించడమూ, బుచ్చిబాబుగారి నవలకు జానకిరామ్‌గారు 'చివరకు మిగిలేది' అని నామకరణం చేయడమూ, కృష్ణశాస్త్రిగారిచేత రేడియోకు నాటకం రాయించడం కోసం నానాపాట్లూ పడుతూండడమూ — యివన్నీ కలగాపులగంగా జ్ఞాపకానికి వచ్చి ఏవేవో ఆనందానుభూతులను కలిగిస్తూ వుంటాయి.

స్వీయచరిత్రకు సాహిత్యంలో స్థానాన్ని కల్పించేది రచనా శైలి ఒక్కటిమాత్రమే కాదు— రచయిత చెప్పిన విషయం కూడా.

గత మూడు దశాబ్దాల కాలంలో వెలువడిన స్వీయచరిత్రల గురించి, స్వీయచరిత్రాత్మక రచనల గురించి జ్ఞాపకం చేసుకొనేటప్పుడు—గిడుగు సీతాపతిగారి సంక్షిప్త స్వీయచరిత్ర, వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ''ప్రజ్ఞాప్రభాకరము'', బులుసు వేంకటేశ్వర్లుగారి ''సర్వదుఃఖ నివారణోపాయము'', స్థానం నరసింహారావుగారి ''నటస్థానం'', నటరాజ రామకృష్ణగారి ''నర్తనవాణి'', కామరాజు హనుమంతరావుగారి ''స్వీయ జీవిత సమీక్ష'', కె. యస్. కేసరిగారి ''నా చిననాటి ముచ్చట్లు'', కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు చెప్పగా, అక్కిరాజు రమాపతిరావుగారు వ్రాసిన ''కోలవెన్నువారి జీవితానుభవములు'' మొదలయిన ముఖ్యమగు స్వీయచరిత్రల గురించి ప్రస్తావించవలసి వుంటుంది. వీరిలో కవులు, కళాకారులు, పండితులు, సంఘసంస్కర్తలు మొదలగు వారున్నారు.

సీతాపతిగారు వ్రాసింది చాలా సంక్షిప్తమైన (సుమారు 60 పుటలు) స్వీయచరిత్ర. తమ సన్మానసంఘం వారి కోరికను పురస్కరించుకొని సీతాపతిగారు దీనిని వ్రాశారు. పుస్తకం చిన్నదయినా యిందులో చాలా ఆసక్తిదాయకమైన విషయాలున్నాయి. ఫొనటిక్ స్క్రిప్టులో, డైరెక్టు మెథడ్‌లో ఆయన విద్యార్థులకు యింగ్లీషు బోధించి విజయాన్ని సాధించిన విషయము, పిఠాపురం రాజావారికిని, వీరికిని గల సన్నిహిత సంబంధం, నిఘంటువు ప్రచురణ విషయంలో జరిగిన కృషి — యివన్నీ చదవడానికి ఎంతో కుతూహలం కలిగించేవిగా వుంటాయి.

బులుసు వారి ''సర్వదుఃఖ నివారణోపాయము'' రచనలో కొంత ఛాందసం కనబడినా—''Uedanta can be understood only by realisation, but never by talking or writing about it''— అనే విషయాన్ని పాఠకుల హృదయాలకు హత్తుకొనేలా చక్కగా చెప్పడం జరిగింది.

ఇక సంఘ సంస్కర్తల స్వీయ చరిత్రల్లో కామరాజు హనుమంతరావు గారి ''స్వీయ జీవిత సమీక్ష''కు ప్రత్యేకమైన స్థానం వుంది. కామరాజు హనుమంతరావు గారు వీరేశలింగ యుగానికి చెందిన వారు. బ్రహ్మసమాజీకులు. ఆంధ్రదేశమున జరిగిన 'బ్రహ్మ సమాజ ఉద్యమాలలో చెప్పుకొనదగ్గ పాత్ర వహించినవారు. ఈ పుస్తకం చదివితే వీరేశలింగం పంతులుగారి కాలం నాటి తెలుగు సమాజం మరోమారు కళ్లకు కట్టినట్లు కనబడుతుంది. పిఠాపురం రాజాగారు, రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు, చలం, మొదలయిన వారు బ్రహ్మ సమాజానికి యిచ్చిన ప్రోత్సాహ వివరాలు తెలుస్తాయి. ఈ తరం పాఠకులు తప్పని సరిగా ఈ స్వీయ చరిత్ర చదవాలని నా అభిప్రాయం. కేశిరాజు పెద బాపయ్య గారి మిత్రులు, శిష్యులు అయిన కామరాజు హనుమంతరావు గారు ఏకేశ్వరోపాసన, స్త్రీవిద్య, స్త్రీ స్వాతంత్ర్యాల కొరకు తమ జీవితాన్నంతా ఎలా వెచ్చించారో తెలుస్తుంది ఈ స్వీయ చరిత్ర చదివితే. ఈ ఆత్మకథను హనుమంతరావు గారు 1945లో 60 సం॥వయస్సప్పుడు ప్రారంభించి—1973లో 88 సం॥ వయస్సులో వుండగా 'రివైజ్' చేసి ప్రచురించారు.

వీరేశలింగం గారికీ, రచయితకు వున్న సన్నిహిత సంబంధం, దాని తాలూకు వివరాలు ఈ ''స్వీయచరిత్ర''లో ప్రముఖమైన స్థానాన్ని వహిస్తాయి. హనుమంతరావు గారు వీరేశలింగం గారి వద్ద కొన్నాళ్లు వున్నారు. ఆయన సలహా ననుసరించి వితంతు వివాహం చేసుకున్నారు. ఆయనతో బాటు హితకారిణీ సమాజం నిధుల కోసం దేశం అంతా తిరిగారు. అయితే—ఆయనకూ, పంతులుగారికీ అంతగా పొసగలేదు.

''—పంతులు గారికి తన యాజ్ఞప్రకారం నడుచుకొను విధేయులగు భృత్యులు కావలెను. సేనాధిపతికి లోబడి ప్రవర్తించు సైనికులు కావలెను—'' (స్వీయ జీవిత సమీక్ష — పేజీ 1 6)—అంటూ, యిందులో హనుమంతరావు గారు చెప్పిన విషయాలు చదివితే వీరేశలింగం గారు కొన్ని సందర్భాలలో ఎలా డిక్టేటర్‌గా ఎలా ప్రవర్తించే వారో, ఇతరుల స్వాతంత్ర్యాన్ని ఎలా అణచే వారో తెలుస్తుంది. ఆశ్చర్యాన్ని పొందుతాం.

*  *  *

''స్వీయ చరిత్రము'' అంటూ ప్రత్యేకంగా పేర్కొనకపోయినా, పరోక్షంగా స్వీయ జీవిత కథను చెప్పిన స్మృతి రచనలు

కొన్ని ఆ మధ్యన వెలువడినాయి. యన్. జి. రంగా గారి "భారతీ దేవి దివ్యస్మృతులు", బసవరాజు రాజ్యలక్ష్మమ్మ గారి "అప్పారావు గారూ—నేనూ—" మొదలయిన రచనలు ఈ కోవకి చెందినవేనని చెప్పవచ్చును. మొదటి పుస్తకాన్ని ప్రముఖ స్వాతంత్ర్యయోధులు శ్రీ యన్. జి. రంగా తమ అర్ధాంగి **భా**రతీదేవి పోయిన దుఃఖం**తో** రా**స్తే**—రెండవ పుస్తకాన్ని ప్రముఖ భావకవి బసవరాజు అప్పారావు గారి సతీమణి తన భర్త అకాల మరణం**తో** కృంగిపో**తూ** కన్నీటిలో కలం ముంచి రాశారు. అనురాగ బంధితులయిన భార్యాభర్తల అనురాగం కేవలం శరీరాల**తో** ముగిసిపోదు. అందుకే మనుషులు గతించినా మమతలు సజీవంగానే వుం**టా**యి. ఆ మమతల స్మృతులే ఈ రచనలు. *అందుకే—**ఈ** తరహా రచనలు దాంపత్య జీవితకథతో పెనవేసుకున్న స్వీయ చరిత్రలుగా మారు**తూంటా**యి తరు**చూ**—

బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారి "అప్పారావుగారూ—నేనూ—" నా దృష్టిలో మంచి స్వీయ చరిత్రాత్మక రచన. భావకవితా ఉద్యానవనంలో **పూ**చిన అందమైన పుష్పాలలో బసవ**రా**జు అప్పారావు గారు ఒకరు. అయితే—ఆ పువ్వు రేకులు విచ్చిన కొద్ది కాలంలోనే వాడిపోయింది. అయినా—ఆ సౌరభాలు మాత్రం ఏనాటికీ ఆ **తో**టలో అడుగిడిన వాళ్లకు మహదానంద **దాయ**కమైన అనుభూతుల్ని కలిగి**స్తూ**నే వుం**టా**యి. ఆ అనుభూతుల కథే — "అప్పారావుగారూ—నేనూ".

"అనుభవాలే పాడుకుం**టా**రు. తన కోసమే ముఖ్యంగా అనిపిస్తుంది. జీవితంలో ఏ దెబ్బ తగిలినా, ఏ సుఖం కలిగినా, వెంటనే కవిగా పలుకుతాడు. మహా చురుకయిన హృదయం—"అంటూ 'ముద్దుకృష్ణ' వైతాళికుల సంక్షిప్త పరిచయాల్లో అప్పారావుగారి గురించి వ్రాసిన మాటలు ఎలా నిజమో ఈ పుస్తకం చదివితే తెలుస్తుంది. అంతే కాదు—అప్పారావు గారి రుచులూ, అభిరుచులూ, చెప్పే భార్య 'హృదయం' కనబడుతుంది.

"ఉదయ మవుతున్నది. మళ్లా సాయంకాలమవుతున్నది. యిప్పుడు కూడా ఆ చంద్రకాంతలు అ**ట్లా**నే **పూ**స్తున్నవి. అవు లంబాయంటూ సంధ్య వేళకు చేరు కొంటున్నవి. బీర పాదులు కూడా **పూ**స్తున్నవి కాస్తున్నవి. ఆ గుర్తులన్నీ అలాగే మాసిపోకుండా మా**ము**లుగానే వున్నవి. కాని—అప్పారావు గారు మాత్రం తిరిగి రారు" అంటూ **ఈ** పుస్తకం చివరి పేజీలలో రచయిత్రి తన భర్త కోసం ఎదురు చూచిన సాయం కాలాలను జ్ఞాపకం చేసుకుంటూం**టే**—చదువరుల హృదయం ఆర్ద్ర మవుతుంది.

ఇక, రంగా దంపతుల విషయం తీసుకుంటే—రైతు బాంధవుడు రంగా, వారి సతీమణి భారతీదేవి, యిద్దరూ **కూడా** అభ్యుదయ దృక్పథము, సేవానిరతి, కలవారే. 1920 నుంచి యాభై సంవత్సరాల పాటు ఈ దంపతులు స్వదేశంలోనే గాక—యితర దేశాల్లో **కూ**డా పర్యటించారు. పరస్పరం మమతలు, అభిప్రాయాలు, పంచుకున్నారు. యిలాంటప్పుడు—ఒకరు లేని లోటు మరొకరికి తీర్చలేనిదిగా కనబడడం సహజం. ఆ దంపతుల మ**ధు**రస్మృతులే ఈ రచన. ఈ పుస్తకాన్ని సమీక్షిస్తూ 'భారతి' (జూన్ '76)**లో** వ్రాసిన వాక్యాలు నాకు నచ్చాయి. అందుకే వాటిని ఇక్కడ ఉటంకిస్తున్నాను:

"— తలంపుల పులకింతలు అనుభవాల జలధిలోకి రంగాజీ స్మృతి మయమను వల విసరగా, అందున్నవి వివిధ వర్ణములకు, వర్గములకు చెందినందున, సామ్యములేని తలంపులు స్మృతిపథంలో మోశాయి. వాటిని అలాగే సంపుటీకరించారు రంగాజీ—"

బహుశా — ఈ కారణం చేతనే అనుకుం**టా**ను పదాలకు అందని భావాలున్నాయి యిందు**లో**.

ఈ విధంగా చూచుకుంటూపోతే,—గడచిన మూడుదశా**బ్దా**ల కాలం**లో** వెలువడిన స్వీయ చరిత్రల్లో మనకు ఎం**తో** వైవిధ్యం కనబడుతుంది. తెలుగులో వెలువడిన స్వీయచరిత్రల సంఖ్యతక్కువే అయినా — వివిధ రంగాలకు చెందిన వ్యక్తులు వీటిని రాసుకున్నందు వలన —గడచిన తరంలో పలు రంగాలలో ఉద్భవించిన సమస్యలూ, జరిగిన సంఘర్షణలు, ఈ తరం పాఠకులకు అవగతం అయ్యేందుకు అవకాశం వుంది. వెనుకటి తరానికి సంబంధించిన సమస్యలు, సంఘర్షణలు, ఈ తరంలో లేకపోవచ్చు. అంతేకాదు—ఆ సమస్యలు ఈ రోజున విడ్డూరంగా కనబడవచ్చు. ఉదాహరణకు కామరాజు వారి స్వీయచరిత్రలో జందెం వేసుకున్న వ్యక్తిని బ్రహ్మసమాజీకుల సభకు ఆహ్వానించవచ్చునా, లేదా, అనే విషయంలో జరిగిన "**హీ**టెడ్ డిస్కషన్—" గురించిన ప్రస్తావన ఉంది. ఈరోజున దాన్ని చదివి మనం నవ్వుకోవచ్చు. అది వేరే విషయం. కాని, ఆనాడు అది ఒక "సంఘర్షణ"అనే విషయాన్ని మటుకు కాదనలేం. "సంఘర్షణ"ల స్వభావ స్వరూపాలు ఏవైనా — ఆ సంఘర్షణలోని 'వ్యక్తి' తన వ్యక్తిత్వాన్ని ఎంతవరకూ నిలుపుకున్నాడనేదే ప్రశ్న. ఆ ప్రశ్నకు సమాధానమే జ్ఞాపకం వుంచుకోదగ్గ స్వీయచరిత్రలు. జీవితంలోని సంఘర్షణలకు గాక, గత కాలంలోని అనేక అందమైన జ్ఞాపకాల చుట్టూ — సొగసైన భాషలో అల్లుకున్న కొన్ని రచనలు (అవి స్వీయ చరిత్రలైనా, స్వీయ చరిత్రాత్మక రచనలైనా,) మంచి "పఠనీయత"ను కలిగి వుండవచ్చును గాని—వ్యక్తి వికాసానికి దోహదాన్ని మటుకు కలుగజెయ్యవు.

కాలం మారుతున్నది. పాత సమస్యలు పోయి క్రొత్త సమస్యలు తల ఎ**త్తు**తున్నవి. జీవన సంగ్రామంలో 'వ్యక్తి' యింకా పోరాడు**తూ**నే వున్నాడు. అయితే — ఈ పోరాటాల కథ స్వీయ చరిత్రల్లో **చోటు** చేసుకొనేందుకు మరికొంత కాలం పడుతుంది. అప్పుడు అవి ముందుతరాల వారికి వెనుకటికాలం కథలు. మనకు— మరచిపోతున్న జ్ఞాపకాల మలి పలకరింపులు.

— ఆ పలకరింపులకోసం కొన్నాళ్ళు వేచి వుందాం.

* ఈ తరహా స్మృతులు పద్య రూపంలో వుంటే దానిని 'ఎలిజీ' అని అంటారు. ఆత్మాశ్రయ కవిత్వంలో 'ఎలిజీ' ప్రధానమైంది.

# చెలియలికట్ట

శ్రీ రమణారెడ్డి

అనంత విశ్వాంతరాళంలో ఒకానొక సన్నటి చుక్క
అత్యుగ్ర మహాగ్నిగోళం గిరాటేసిన ఒక చిన్న నిప్పుకణిక
మహేంద్ర నేలమణిమాలలో మరకతమణి
మహార్ణోరాశిలో దీవి—మనం జీవించే ధరణి
శిశుడోలికైనా శవపేటికైనా మనకిదే సర్వం
కాలిపట్టూ కలలగుట్టూ మనకీ భౌతికవిశ్వం —

ఇది
విధి చేతి జంత్రపు బొమ్మకాదు
ఇహం
సుదూర పరలోకచ్ఛాయకాదు
విధాతృని లీలకాదు మాయకాదు
వాస్తవాతి వాస్తవం
నిరంతర ప్రవాహిని
పరిణామ జీవని ఈ అవని.

ఆదిలో ప్రకృతి సంస్కారచ్యుతమై పడివుండే దిక్కడ
అద్దానికి అద్దమే తోడుగా ప్రతిబింబమేదీ లేకుండా —
ఆరుతూ మండుతూపోయే నిరంతర జీవజ్వాల
అంకురిస్తూ అంతరిస్తూసాగే నిర్విరామ ప్రాణహేల

జననం మరణం
వృద్ధి క్షయం
బహిరంతర సంఘర్షణమయం
ప్రతిక్షణ నవీనతావిష్కరణం
సూక్ష్మంనుండి స్థూలం
కణం నుండి జీవజాలం
స్థాణువుకాదు ప్రకృతి
నిశ్చలతకాదు స్థితి

సౌర చంద్ర గ్రహ నక్షత్ర ఆకర్షణ వికర్షణల్లో
పరిసర వాతావరణ శీతోష్ణాల్లో పదార్థ ధర్మనియమాల్లో
పంచమహాభూతాల సంసర్గఫలం అగణ్య జీవజాలం
దివారాత్రాల సంక్రమణంలో రుతుచక్ర పరిభ్రమణంలో

వైవిధ్య సుందరం
ప్రాణబంధురం
సాగరాలు
పర్వతాలు
నదులు
అడవులు
క్రిములు
కీటకాలు
జంతువులు
పక్షులు
మనుషులు.

అరణ్యం ఆవాసంగా గుహ గృహంగా శాఖామృగంగా జంతువుగా
ఆదిమానవుడు ప్రకృతి అధీనుడు ప్రాకృత జీవనుడు
మూల ప్రకృతిని భిన్నాకృతులుగా తనలో ప్రతిబింబించుకుని
మనః ప్రకృతిని జ్ఞానమయ చైతన్య కోశంగా మార్చుకుని

అవయవాలు పరికరాలుగా
అనుభవాలు ఆచార్యులుగా
ప్రకృతికి లోబడీ
ప్రకృతితో కలబడీ
సర్దుకుంటూ
సంఘర్షిస్తూ

మృగతుల్యుడైన వానరుడు మానవుడుగా రూపొందాడు
ముంగాళ్లను చేతులుగా కళ్లను జ్ఞానజ్యోతులుగా మార్చుకున్నాడు
జ్ఞానేంద్రియాలతో సమకూర్చాడు ప్రపంచానికొక అర్థం
జీవన సంగ్రామ క్రమంలో సమిష్టి ప్రయత్నం పరమార్థం

వాడిదే ఈ అద్భుత సృష్టి
అల్పానల్ప క్రియా సంపుష్టి

అరణ్యంగా అరాచకంగా అసంకల్పిత కార్య రంగంగా
కడలిగా కల్లోలంగా అనియంత్రిత సహజ భీకరంగా
పథక హీనంగా ప్రయోజన శూన్యంగా ఉత్పాతంగా
విఘాతంగా
ప్రకృతి ఘోరాకృతిగా స్థితి నిత్య సందేహాన్వితంగా

దౌర్జన్య రాజ్యం
పర్జన్య గర్జనం
భూ ప్రకంపనం
కుంభ వర్షం
జల ప్రళయం
దుర్దమ క్షామం
క్లేశం
ఆక్రోశం
దుఃఖం
దారిద్ర్యం
సంఘాత మరణం
దైన్యం

ప్రాణం గాలిలో పెట్టిన ప్రదీపకళికగా కొట్టుమిట్టాడేప్పుడు
జీవం క్షణభంగురం బుద్బుదప్రాయంగా అనిపించేప్పుడు
జ్ఞానమే అంకుశంగా జృంభించాడు సింహంలాగా
ప్రకృతి మత్తేభం కుంభస్థలం మీదికి ధిషణాధికుడై
మానవుడు
శక్తితో యుక్తితో మచ్చిక చేయబూనాడు ఆరణ్య జంతు
ప్రకృతిని

సమిష్టి శ్రమ నుండి బుద్ధి పుష్టి
మెదడు పెరిగి విజ్ఞాన ధని
హృదయ సంస్కారంతో కళాధుని
బహిరంతర పోరాట ఫలితం
మానవాంతఃకరణం

సహజానికి జత మానవుడు కల్పించిన కృత్రిమత
బుద్ధి సూక్ష్మత మనస్సుకుమారత—వెరసి నాగరకత

ప్రకృతికీ మనిషికీ మధ్య
పరచుకున్న విశాలరథ్య
విశృంఖలతలకు అడ్డుకట్ట
దృష్టాదృష్టాల నడిమి గండి
జ్ఞాన—కళాన్వితమైన సంస్కృతి

ఇంద్రజాలం కాదు మంత్రం తంత్రం కాదు మానవ
మహాసృష్టి
ఇంద్రచాపంలా నెమలిపురిలా మణిదీప పంక్తిలా అందమైనది
మహానుభవశాలి మానవుడు మహానుభావుడు మానవుడు
మార్పుమీద తలపు కొత్తమీద గురి—అభ్యుదయ సాధకుడు

కీడు నుండి మేలు
ఘోష నుంచి భాష
అనాకారం నుండి సౌందర్యం
కల్లోలినిలో నుండి కల్హారం
గానం
శిల్పం
తన్మయత్వం
తత్వం
నీతి
దయ
యోచన
భావుకత
నవ్వు
నాణ్యం

ప్రకృతి కర్త కాగా సంస్కర్త మానవుడు
ప్రకృతి కర్మక్షాగా నిర్విరామక్రియ మానవుడు.

అదుపులోకి రాని వన్య మృగం వంటిది ఆది ప్రకృతి
ఆజ్ఞాబద్ధం గాక అహంకారంతో ధిక్కరించే భూతశక్తి
అదురుదెబ్బ తీస్తూనే వస్తూంది మానవ సృష్టిని
చిదిపి చెరిపి వేస్తూనే వస్తూంది మానవ నిర్మితిని

హఠాత్తుగా
విపత్తుగా
వాన
వరద
ఎండ
చలి
వడ
వండ

వుప్పెన
గాలి కసురు

శోభను క్షోభగా వుద్యానాన్ని వూసరక్షేత్రంగా మారుస్తూంది
భవనాన్ని నేలమట్టంచేస్తూ బ్రతుకును బ్రద్దలు
కొడుతూంది
నీళ్లలో నిప్పు మంట మండిస్తూ నేలను చీలిక పేలికలు
చేస్తూంది
గాలిని వురిత్రాడుగా పేనుతూ కాంతితో సంహారం చేస్తూంది
క్షేమాన్ని గాయపరిచి ప్రాణాన్ని తుంచిపోసి బీభత్సం
సృష్టిస్తూంది

సహజానికీ సంస్కరణకూ తీరని పోరు
పశు ప్రకృతి మానవుని పోటీదారు.

ప్రతి సంక్షోభమూ మానవజాతి మనుగడకే ఒక సవాలు
శిథిలాలమీద శకలాలమీద హృదయ నిర్వేదం చేవ్రాలు

ఏం చెయ్యాలి మనిషి
ఏం కావాలి ఇంత కృషి
ఎవడికి సాగిలపడాలి
ఏయే బలు లివ్వాలి
ఏ పరాశక్తిమీద వెయ్యాలి
తన బరువూ భారం ?

వ్రాకూ వ్రానూ కాదు మనిషి రాయో కొయ్యో కాదు
మూర్ఖుడై తన మానవతను హృదయ శూన్య వస్తువు
కాపాదించాడు

ఆశలూడ్చిన తరువై మ్రోడు చేతులెత్తి నమస్కరిస్తున్నాడు
ఆనందం కరువై అనాథశిశువై నిస్పృహ ననుభవిస్తున్నాడు

దుర్విధి అవునా ఇది
దురంతమేనా ?

సహజాతి సహజమైన ఘటన సైతం మనస్సును
ప్రస్ఫురుస్తూంది
విహ్వలిస్తున్నాడు హృదయమున్న మనిషి
ప్రకృతికి హృదయం లేదు లేదు మనస్సు
వట్టి పదార్థం అది
పరుషమై ప్రళయమై ఇంతలో ప్రసన్నం ప్రశాంతం
కాగలదు
చండిగా చెండాడి చల్లగా దీవించగలదు మారియై మాత
కాగలదు

అంతా తన భ్రమ
అంతే ! కర్మ కాదు !
అనధీన మహాసత్వం ప్రకృతి
అల్లాగే వుండిపోరాదు !
మనిషి విజేత
అనతిక్రమణీయం నాగరికత చెలియలికట్ట

క్రిమికాదు మనిషి — అంతరించడు —
మహోద్యమం !
సంకల్పబలం మనిషి
మనస్సు మనిషి — దేహమే కాదు —
మనిషి మహస్సు !



డాక్టర్ సి. ఆనందారామం

# డాక్టర్. సి. నారాయణరెడ్డిగారి సాహితీ వ్యక్తిత్వము

ఆది దంపతుల అలౌకిక ప్రణయంలాగ అపూర్వ మాధుర్యం తొణికిసలాడే వాగర్థాల రసవత్తర కళా విలసనం నారాయణరెడ్డిగారి కవిత్వము.

"వేయి కిరణాలా నాకు ?" ముక్కున వేలేసుకున్నాడు రవి.

"కోటి చరణాలేనా నావి ?" తనలో గొణుక్కున్నాడు కవి..." అంటూ కవి కానవలసింది, రవి కానని చోట్లు మాత్రమే కాదు. ఇంకా ఇంకా ఎంతెంతోనని ఎంతకూ తనియని అన్వేషణతో జీవితాన్ని మథించటానికి పూనుకొంటున్నారు. వీరే ఒకచోట చెప్పుకొన్నట్లు సంప్రదాయాన్ని ప్రయోగంతో వినూత్నంగా జీవింపచేసిన కవి వీరు. పురాణాలను పరమ పవిత్రమని పూజించటమో, లేక అందుకు విరుద్ధంగా తిట్టిపొయ్యటమో కాక పురాణ సారాన్ని పామరులకు సహితం అర్థమయ్యేలా మానవతా దృక్పథంతో వ్యాఖ్యానించిన 'గేయ భగీరథులు' వీరు.

"నా హృదయం ఎక్కడుంది ?" అని వెతుక్కుని 'శరధిలోనా, కాదు. శరశయ్య పైన..." అని గుర్తించారు. ఆ శరశయ్య ఎలాంటిది ?

"శరము లివి కావు. ప్రశ్నలు. తాతలకు, గీతలకు,
మెదడు అదిరిపోయేలాగ, ఎదురు తిరిగే
హేతువాద శస్త్రికలు !"

ఈ రకంగా తనది అంధానుసరణం కాదనీ, హేతువాద దృక్పథమనీ స్పష్టం చేస్తున్నారు.

ఇక్కడ 'తాత' అనటంలో భీష్మాచార్యులు, 'గీత' అనటంలో భగవద్గీత ధ్వనిస్తోంది.

ఏనాడో తాతలు చెప్పిన గీతల్నే నమ్ముకు కూచుంటే ఎలా ? సత్యం చిర సత్యం మాత్రమే కాదు, నవ సత్యం కూడా కావాలి.

"ప్రతి నిత్యం నవ సత్యం
శతధా పలికేద నేస్తం !
గత బుద్ధుల రాతి చెవులు కరిగేదాకా—
మృత భావుల మోడు కనులు మెరిసేదాకా..."

ఎప్పుడూ పాత భావాలనే పట్టుకు ప్రాకులాడటం వీరికి గిట్టదు పాతలో పనికిరాని వాటిని వదిలేసి ఎప్పటికప్పుడు కొత్తవి సృష్టించుకోవలసిందే నంటారు.

"ఎలా నిన్ను నమ్మికోను పాత బావీ !
కాల నీరధిలో గుడ్లు తేలవేసిన దీవీ!
జల లూరుతున్న నేటి ఏటి పాయలో
తిలకించని సముజ్జ్వల భావి..."

ఎప్పటికప్పుడే పాత ముఖాల్ని బహిష్కరించి కొత్త ముఖాల్ని ఆవిష్కరించుకోమంటున్నారు.

ఎందుకంటే —

"నువ్వు తొడుక్కునే కొత్త ముఖంలో
రవ్వల్లాంటి
నిప్పు రవ్వల్లాంటి నవ్వు లుంటాయి, అవి సత్యభామ
ముక్కు పోగులో నిత్య నూతనంగా మెరస్తాయి.
నరక ప్రవృత్తిపై తిరగబడి చెర చెరా దహించివేస్తాయి."

నరకాసుర వృత్తాంతంలోని సత్యా సత్యా లెలా ఉన్నా నరక ప్రవృత్తులను దహించి వెయ్యవలసిన ఆవశ్యకత ఎవరూ కాదనలేనిది కదా !

"శప్తనలుడు దవానలుడై
బృహన్నలుడు పురానరుడై
మతి మాసిన సగటు మనిషి
హేతువాద గదాధరుడై"

ఉజ్జ్వలించాలని వీరి ఆకాంక్ష.

ఆనాటి పురాణ పురుషులే ఈనాటికీ ఆదర్శం కావటానికి వీల్లేదు. ఈనాటి మూర్తులు వేరు.

''ఇప్పటి ధర్మజుడు
కర్మెసీకి కట్టుబడి
కట్టుకున్న ఆలిని అమ్మకో

ఇప్పటి శివుడు
ఎదుటివాళ్ళ స్వార్థం కోసం
తన కంఠాన్ని దహించుకోడు.

ఇప్పటి నలుడు

'కవి' గానికి సలాముచేసి
కానలో హృదయేశ్వరిని వదిలేసి
తన తెరువు తాను చూసుకునే మలయానిలుడు కాడు.
అక్రమాలను కడదాకా అరికట్టే ప్రళయా నిలుడు.''

ఎందుకంటే ...

ఈ తరంవాడు

విద్యుద్దీపాలను చూసి ముఖం చిట్లించుకునే
ఆముదపు జ్యోతులకు
ఎప్పుడూ వారసుడు కాడు...''

''అయ్యయ్యో, ధర్మయ్యా!
అన్యాయం చేసావేమయ్యా!'' అని నిలదీసి

''నీ కంటె ఆ క్రూరె దొంగ నయం.
చీరలు దోచే అలవాటున్నా
చీరలిచ్చి రక్షించాడు,
నీ ఆలిని, పాంచాలిని...'' అని దెప్పి పొడిచి

''చార్జి షీటుకి ఇకనైనా
సంజాయిషీ ఇచ్చుకో ధర్మన్నా!''

అని ఆ పురాణ పురుషుణ్ని అదలిస్తున్నారు.

ఆ పురాణ పురుషు లెక్కడో లేరు, మనలోనే ఉన్నా రంటున్నారు –

''మీకు తెలియదు, మీలో
రాకాసులను తరిమికొట్టే రామభద్రు లున్నారని –
అంధకాసురులను మట్టుపెట్టే అపర రుద్రులున్నారని...''

అయినా, ఎందుకిలా ఉంటున్నాం, మనం అంటే, ''ఐనా మీకు అడుగడుగునా సానుభూతి అడ్డొస్తుంది.

బోలెడంత పౌరుషం ఉన్నా భోలాతనం ఎదురొస్తుంది''

... ... ... ... ...

''పర్ణశాలలో కోదండం దాచిపెట్టి,
పొలంలో అగ్నినేత్రం పాతిపెట్టి,
వలసపోతున్నారు, మీరు వంతెనకింది నీళ్ళలా...''

అని ఆవేదన ప్రకటిస్తూ ఎలా ఉండాలో ఇలా ప్రబోధిస్తున్నారు

తలలూపే బసవన్నలు కావద్దు–
తాండవించే నందికేశ్వరులు కావాలి
పేడితనం కసవులా చిమ్మేసి,
క్రీడితనం రుజువు చేసుకోవాలి''.

సమతను కోరుతున్నా వీరి రాజకీయ దృక్పథం సామ్యవాదం కాదు సామ్యవేదం. సగటు మానిసిలో సహ–దేవుణ్ని గుర్తిస్తారు. అధికార వర్గాల్లో అవినీతిని గర్హిస్తారు. చైతన్యాన్ని ప్రబోధిస్తారు. అయినా రక్తపు టేరులు పారించే ఉన్మాదోద్రేకాలను మాత్రం హర్షించలేరు.

ప్రజాచైతన్యాన్ని ఏ ఆంక్షలూ, ఏ శిక్షలూ అణచి ఉంచ లేవని వీరు పదేపదే హెచ్చరించారు.

''స్వరియించే గళముంటే
విరచించే కలముంటే
ఉరికంబంపైన శిరము ఉరుమును కాదా
బరికత్తులలోన పదము పలుకును కాదా!''

అంటున్నారు. సాధారణ మానవుడు సాత్వికుడే! ఎంతవరకు? తిరగబడనంతవరకు...అన్నింటినీ సహించే ఆ అమాయకుని సహితం అరాచక శక్తులు అల్లకల్లోలం చేసినపుడు, ఆ నిస్సహాయుడే అసహాయశూరుడై నిలుస్తాడంటున్నారు.

''పసివాడు–కాడు–అసితో పనిలేకనే–రక్కసి
నెత్తురు కక్కించే ఋషి–వాడు...''

ఇక్కడ 'రక్కసి నెత్తురు కక్కించే' అనటంలో పూతన ప్రాణాలు తోడిన శ్రీకృష్ణుడు స్ఫురణకు వస్తున్నాడు. ''ఋషి'' అనే ప్రయోగం అమాయకపు అంతరంగాలలో ఔన్నత్యాలను చూపు తోంది.

''వినయం మాకు వెన్నతో పెట్టినా, విజృంభణం
మా ప్రాథమిక విద్య
సంప్రదాయం మాకు సహోదరియైనా, సంప్రశ్నం
మా సహజ గద్య''

అంటూ సహజ సాత్విక వ్యక్తిత్వాలతో చైతన్యం కూడా ఒక భాగంగా ఎలా విలీనమయి ఉందో చూపుతున్నారు.

''ఓడిపోయిన జీవితంలో వాడిలేదు,
**వాడిపోవటం తప్ప,**

వేడితేదు, వేడికోలు తప్పు...''

అంటూ స్వేచ్ఛకై తిరగబడవలసిందే నంటారు—వీరు !

''గానుగెద్దులా తిరగడంలో గతి ఉంది, ప్రగతిలేదు
గంగిరెద్దులా ఎగరడంలో తమాషా ఉంది, తాండవం లేదు''
నీరస జడత్వాన్ని ఈసడిస్తారు, వీరు—
''చైతన్యం తరుముతుంది జాతిని;
నెత్తికెక్కిన గంజాయి దమ్ము
మత్తును వొదిలించుకోలేకపోతే
నెత్తుటి మంటల్లో దూకి,
కొత్తపుటక పుట్టవలసిందని...''

ఈ తిరుగుబాటు ఎక్కడో, ఎవ్వరో చేసేది కాదు. అణువణువునా ప్రజ్వలించేది.

''మట్టిలో మోగింది, రుద్ర విపంచిక
ప్రానులో రేగింది రక్తస్రవంతిక...''

పాపం, అమాయకుడైన సగటు మనిషి చీటికీ మాటికీ తిరగబడే వాడు కాడు. అయినా దుష్టశక్తులే అతనిలో చైతన్య జ్వాలను రగిలిస్తున్నాయి.

''ప్రవచనాల కొళాయీలనుంచి,
బయటపడే పాముపిల్లల్ని చూసి
శ్రీరంగ నీతుల మేడిపళ్ళనుంచి,
చీల్చుకొస్తున్న విషప్పురుగులను చూసి,
పట్టుతప్పిన నరనరాల పుట్టుకొస్తుంది తరుణజ్వాల...''

పైకి సాత్వికంగా కనిపిస్తున్నంత మాత్రాన సామాన్యుడు అసమర్థుడు కాడని హెచ్చరిస్తున్నారు, వీరు—

''వాని క్రోధం కార్చిచ్చు — అది
వ్యాపించే దాకా తెలియదు
వాని ధ్యేయం రక్తోషస్సు — అది
కటకటాలకు లొంగదు.
... ... ... ... ...
''మీవాడు జితేంద్రియుడు
కనిపించని విప్లవాగ్నిలో, తనుతానే వేల్చుకుంటున్న
తపోధీరుడు, క్రాంతికారుడు...''

చచ్చినా వల్లారని చిచ్చుగుణం ఉంది, ఈ సామాన్యుని సాత్విక తేజస్సులో —

''ఇన్నాళ్ళూ మనం చూసింది,
ఈ నేల పండించుకున్న స్వాతంత్ర్యాన్ని
ఇకముందు మనం పండించవలసింది,
దళితజీవుల అభ్యుదయ మనోరథాన్ని...''

అని కర్తవ్యం గుర్తుచేస్తున్నారు. కర్తవ్యాన్ని మరిచి అహం తను ప్రదర్శిస్తే అధః పతనమేనని హెచ్చరిస్తున్నారు.

''వీళ్ళు నియంతలు, కళ్ళకు కట్టుకున్నారు,
అహంతల గంతలు, అందుకు ఫలితం,
అధః పతనం —
ఇది యుగయుగాలుగా కాలం నేర్పిన
జగజ్జనీన పాఠం...''

చిరునవ్వు మనిషికి నగలన్నింటినీ మించిన నగ కాని నగ — అయితే ఎన్నెన్ని రకాల చిరునవ్వులు ?

''మంత్రగాని చిరునవ్వు చేయలేంది,
మంత్రిగారి చిరునవ్వు చేస్తుంది.. ''

అని చమత్కారంగా అధికార దుర్వినియోగాన్ని ఎత్తి పొడుస్తున్నారు. కోటల్ని పెల్లగించే క్లియోపాత్రా చిరునవ్వులు, కొంపల్ని కూల్చే మందర చిరునవ్వులు, - ఇలా ఎన్నో. అయితే, అంతు పట్టని చిరునవ్వులుంటాయని అసలు చిరునవ్వుకే ఎసరు పెట్ట వద్దంటున్నారు.

సాయుధ విప్లవాన్ని సమర్థించరు కాని, సానుభూతి మాత్రం ఉంది.

''గిరులు గీసుకోవద్దన్నాను నేను,
గిరులు పిలిచాయన్నాడు వాడు,
మనుషుల మీద నమ్మకం పోయిన వాడు,
మట్టినీ గుట్టనూ పట్టక ఏం చేస్తాడు ?
తమ్ముని గొంతుతో శ్రుతి కలపలేకున్నా,
దమ్మును మాత్రం మెచ్చుకొంటున్నాను...''

అంటున్నారు.

''దురంత పద్మవ్యూహాల వల్లకానిది,
రవంత అనురాగం వల్ల ఔతుంది—''

అంటూ విద్వేషం కంటే సౌహార్దమే మేలంటున్నారు. అంత మాత్రాన నోరు మూసుకుని చేతులు కట్టుకుని కూచోమనటం లేదు. మన చుట్టూ సమాజంలో ఎన్నెన్నో సమస్యలు ! కనీసా వసరాలన్నీ ఎడతెగని ప్రశ్నలే !

''ఈ ప్రశ్నలకు సమాధానం ఎవరిది ?
ఇంద్రజాలం అలవరచుకున్న వ్యవస్థది —''

అంటూ —

''కన్నీటి తడి ఎరుగని ఇంద్రనగరివి
కర ఖడ్గాలు ధిక్కరిస్తున్నాయి.
ఏమని ?

మాటలతో వినకపోతే, మహాప్రళయం తప్పదని...'' తిరుగుబాటునే సమర్థిస్తున్నారు. అయితే వీరు కోరే తిరుగుబాటు ఎలాంటిది ?

''రేకుల్లో ఎన్నాళ్ళు ఒదిగి ఉండాలని
తిరగబడుతున్నాయి పరిమళాలు.
గొంతుల్లో ఎలా ఒదిగి ఉండాలని
గొడవ చేస్తున్నాయి స్వర వరాలు...''

అప్పుడు —

''పరిమళమై స్వరవరమై
ధరణికి దిగుసురపురమై...''

ఒక చేతన కదిలింది. ఇదీ, వీరు కోరే చైతన్య స్వరూపం...

మొత్తం మీద వీరిది 'పక్షపాత' దృష్టికాదు. అంటే ఒక పక్షానికి చెందిన ఒక పార్టీని పనికట్టుకుని సమర్థించే ప్రచార సాహిత్యం కాదు. తమ మానస విహంగానికి రెక్కలు విరిచి ఒకానొక సంకుచిత పరిధికి పరిమితం చెయ్యకుండా యథేచ్ఛగా విహరింపచేసే విశ్వకవి వీరు.

కథానికా శిల్పంలోని కొన మెరుపుల్ని మెరిపిస్తూ కొన్ని ధ్వని ప్రధానమైన కవితలు చేసారు.

''అనగా అనగా ఒక రాజు గారు—'' ఈ రకమైన కవిత లలో ప్రధానమైనది. అనగనగా ఒక రాజు గారు. ఆయనకు పచ్చదనమంటే గిట్టదు. అంచేత పచ్చని చెట్లన్నీ ధ్వంసం చెయ్యమని ఆజ్ఞాపించారు. అయితే ఆ పచ్చదనాన్ని ధ్వంసం చెయ్యటం ఎవ్వరి తరమూ కాలేదు.

''నరకబడ్డ చెట్టే ఒక నవ విప్లవ విరాట్టుగా విజృంభించింది''. ''చెట్టు చైతన్యానికి చిహ్నం. ఆ చెట్టును ప్రసవించిన అవనీస్త్రీ ధన్యం'' అని ముగించారు.

''లక్ష రూపాయల బహుమతి''లో ఒక రాజుగారు రాక్షసుణ్ని పట్టుకున్న వానికి లక్ష రూపాయల బహుమతి అని ప్రకటించారు. ఆ రాక్షసుని వర్ణన వింటే, దిగ్భ్రాంతి కలుగుతుంది, ''వీడా, రాక్షసుడు?'' —అని. ఇక ఆ రాక్షసుని కోసం గాలింపగా కనిపించినది —

''ప్రతి ఇద్దరిలో ఒక రాక్షసుడు
ప్రతి ఒక్కరిలో ఒక రాక్షసుడు
అంతరంగంలోకి తొంగిచూడగా
అక్కడా ఒక రాక్షసుడు...''

ఈ ఫలితానికి అన్వేషకుడయిన కవి విచారింపలేదు, సరికదా,

''లక్ష రూపాయలు చిక్కనందుకు, లవ మాత్రం చింతింప లేదు; స్వస్వరూపం తెలిసినందుకు సంతృప్తిగా నిట్టూర్చాను—'' అని సంతోషాన్నే ప్రకటించారు.

''చీకటి చదువు''లో 'చీకటి' అజ్ఞానానికి ప్రతీక. ఈ కవితలో చమత్కారంతో పాటు, వీరికి భాషపై గల అధికారం కూడా అడుగడుగునా ప్రత్యక్షమవు తుంది. ఉదాహరణకు ''వక్రాలూ, వక్రతమాలూ దానికి అత్యంత ప్రియతమాలు'' అంటారు. చదువు పరంగా చూస్తే వక్రాలంటే, ఎవీ; ఒఓలూ. వక్రతమాలంటే ఐ, ఔలు. అజ్ఞాన పరంగా ఆలోచిస్తే వక్రాలంటే వంకర బుద్ధులూ, వక్రతమాలంటే మరీ కుళ్ళు బుద్ధులూ. ఇలాంటివి చదువుకున్న చిరంజీవి చీకటి అధికారంలోకి వస్తే ''హత్యలే ప్రభాత కృత్యాలు; అనృతాలే అపూర్వ సత్యాలు'' అని ముగింపు.

''కొత్తరకం కోడిపుంజు'' అర్ధరాత్రే అరిచినా ఎవరూ లెక్క చెయ్యలేదు. నిద్రపాడు చేసుకోలేదు. వెలుగు, వివేకమూ, ఏమిటీ అల్లరని దాన్ని గద్దించి ప్రశ్నించాయి. పాపం, అది సమాధానం చెప్పలేదు. కానీ, రాలిన ఈకలు రహస్యాన్ని చెప్పేసాయి. అర్థం పర్థం లేకుండా కొందరు అహంకారులు ఆర్భాటం చెయ్యబోయినా లోకం లెక్క చెయ్యదని ధ్వని — ''ముడిచిన తోక విప్పలేదు'' అనే ప్రయోగంలో, లోక వ్యవహారంలోని ''తోక ముడిచే సాడు'' అనటంలోని చమత్కారం స్ఫురిస్తోంది.

''తొండర గండడు'' లో తొండర గండడు ఆదర్శాల ముసుగు వేసుకుని ప్రవచనాల్తో ప్రలోభ పెడుతూ పాపం, అల్ప జీవుల్ని అల్పాహారంగా ఆరగిస్తున్నాడు. అయితే ఇలాంటి ఆటలు ఎల్ల కాలం సాగవు. అల్పజీవులే అయినా అన్యాయాలకు తట్టుకో లేక విజృంభించాయి. వేషం మార్చినా, శ్రీరంగ నీతులు వల్లించినా, మరోసారి మోసపోకుండా, ఆ తొండర గండడిని హతమార్చేసాయి. ''వంచకుని బ్రతుకులో అంతిమ ఘట్టమది అల్పజీవుల చరిత్రలో ఆదిమ విజయమది' అని ముగింపు.

''అఖిల భారత తోడేళ్ళ మహాసభ''లో తోడేళ్ళు తమ జాతి నశించి పోతున్నదని ఆరాట పడుతుండగా ఒక నరుడు ఆ సభలో ప్రవేశించాడు. తోడేళ్ళు తమ జాతి వాడు కాడనుకొని ఆ నరుణ్ని కబళించబోతే ''నరుణ్నికాను, నేను వృక వరుణ్ని'' అని పైపై వేషాలు తీసి అసలు రూపం చూపించాడు. తమ సంఖ్య తగ్గిపోతున్న దని ఆరాటపడే తోడేళ్ళకు ధైర్యం చెపుతూ, విద్యాలయాల్లో, వైద్యాలయాల్లో, గద్దెల మీద, గుళ్ళలోనూ, కర్మాగారాల్లో,కార్యాలయాల్లో, అంతటా తమ వారేనని'' సగర్వంగా చెబుతున్నాను వినండి, సకల భారత జనాభాలో సగానికి పైగా మన వాళ్ళదే?'' అని తేల్చి చెపుతాడు. అవినీతి దేశమంతటా ఎంతగా పరచుకొందో ఇలా చూపిస్తున్నారు కవి. ''గండుచీమలు''లో చీమలు నిరంతరం తిరుగుతూ ఉంటాయి. ఊరకే ఎవరినీ కుట్టవు తీపినీ, చలవనూ కోరు కుంటాయి.

''కారమన్నా, తిరస్కారమన్నా వాటికి కంగారు.
చేదైనా, నిలువున ముంచేదైనా వాటికి చిరాకు''—
ఇంతకూ ఈచీమ లెవరు? జన సామాన్యమే!

''ఆ తిరగడం—అణువణువూ శోధించటం—
ఆ రుచి మరగడం—పరమాత్మను ఆస్వాదించటం,

ఆ కుట్టడం—అలిగితే శాపం పెట్టడం— ''
అని వివరణ.

ఈ కవి ప్రత్యేకించి ఏ ఇజాలూ అనుసరించరు, హ్యూమనిజం తప్ప. అనేక సార్లు, అనేక విధాలుగా దేవుడి కంటే మానవుడే గొప్పవాడని ప్రతిపాదించారు వీరు. ఎక్కడో ముక్కు మూసుకుని కూచునే యోగి కంటె, సంఘర్షణల తాకిడికి స్పందించే సంఘజీవి మేలని వీరి అభిప్రాయం.

''పంచేంద్రియాల వాకిళ్ళు మూసేస్తే
పాటకూ మాటకూ ఆపైన స్వస్తే
అందుకే నా మనసు అలజడించింది.
వద్దు బాబూ దివ్య వాతావరణమని
ప్రతిఘటించింది...'' అంటున్నారు...

''నావాణి—ఎపుడో పదునాల్గు భువనాల కంఠాలు శ్రుతి చేసింది''—అని తనకవితలో విశ్వజనీనత ప్రధానమంటున్నారు.

''గొంతు పలికితే స్వరం—గుండె పలికితే వరం.
గొంతును, గుండెను కలిపి కుట్టే
వింత సృష్టి అనశ్వరం......''

కేవలం గొంతులోంచి మాత్రమే వినిపించేది వేధ గుండె పలికేది అందరి గుండెలనూ కదిలించే లోతులు ముట్టే ఆలోచన—ఇవి రెండూ కలిసినదే కవితాసృష్టి.

''పంచేంద్రియాల పరిష్వంగంలో, ప్రపంచాన్నే పొదుగుకోండి—'' అని ప్రబోధిస్తున్నారు వీరు.

''మనిషి—చిలక''లో చిలక మానవుని అంతరంగానికి ప్రతీక.

''మనిషి చచ్చినా, చిలక చావలేదు.
నాయకత్వం రెచ్చినా న్యాయం అణగారిపోదు.''

మనిషి నశించినా మానవత్వం నశించదు. సగటు మనిషింటే వీరికి అపారమైన సానుభూతి. అతడు ''అద్దె కొంపే బృందావనిగా అనుభూతి చెందే వనమాలి—''

''అంతా పచ్చగా ఉండాలని కోరుకుంటూ ''మంచినీ, మనిషినీ కాజేసే వంచన'' మాత్రం చచ్చుగా ఉండాలంటున్నారు. మానవత్వానికి గీటురాయి మమత. అది డబ్బుతో కొనగలిగేది కాదు.

''అమృతం కొనగలుగుతావు కాని, అంబలి కొనగలుగుతావా?
మధువు ఇవ్వ గలుగుతావు కాని, మనసు ఇవ్వ గలుగుతావా?
అది అవ్వ కాచి ఇవ్వాలి—అందులో ఆత్మ రంగరించి
పొయ్యాలి—'' అంటున్నారు.

కవి దృష్టిలో మానవుడు ఎలాంటి వాడు?

''నేను; కన్నీళ్ళనూ, నిట్టూర్పులనూ,
క్షుధనూ, వ్యధనూ,
సృతినీ వికృతినీ,
బహిష్కరించిన మానవుణ్ణి
మహోజ్జ్వల చైతన్య వారసుణ్ణి—''

మానవుడు చిరంజీవి అని ఈయన అనేక చోట్ల చెప్పారు. ప్రకృతిలో అన్నీ క్షణికమే! కాని, ''అడుగు తిప్పని ఒక గుండె పిడికి లెత్తి చెప్పింది; ఆత్మ శక్తి నడిపే ఆయుస్సు అనంతమని...''

ఈనాటి కలుషిత వాతావరణంలో మానవత మరుగున పడిందేమోనని ''చిరంజీవి మానవతా, నీ చిరునామా మారిందా?'' అని ఆందోళన ప్రకటించినా, ''అక్షతవు అనాహతవు; పెరిగే మనిషికి చెరగని జతవు—'' అని ధైర్యం చెపుతున్నారు. కాలాతీతుడై నిలుస్తాడు మానవుడు.

''ఈ యుగం సాధించిన గుణం
మనుషుల్లా నివసించే దేవుళ్ళు
ఈతరం సాధించిన వరం
దేవుళ్ళను ధిక్కరించే మనుష్యులు—''
అని సగర్వంగా చాటు కొంటున్నారు.

కవిగా తానేమిటో, తన ధ్యేయమేమిటో, అనేక చోట్ల చెప్పుకున్నారు కవి.

ఆకాశం సూర్యుణ్ణీ చంద్రుణ్ణీ ప్రసవించి అంతతో ఆగకుండా వెలగ లేని గాజు ముక్కల్ని కన్నందుకు పరితపించిందట! అప్పుడు కవి నేర్చుకున్న పాఠం ''గణం కంటె గుణం ముఖ్యమని రాశి కంటె రమ్యత శ్రేష్ఠమని.........''

ఆ పలుకుల తల్లి వీరి పలుకులలో ఎలా నాట్యమాడుతుందో అందరికీ తెలిసిందే! అయితే ఈ శైలి కేవలం మాటల గారడీ కాదు.

''విశ్వాన్ని నా గదిలోకి పంపే వెంటిలేషన్ భాష
వేయి పడగలెత్తి నర్తించే ఇన్స్పిరేషన్ భాష—''

బ్రహ్మకంటే నేనే గొప్ప అంటున్నారు, ఈ కవి బ్రహ్మ. బ్రహ్మ అదృష్ట ఫలకం మీద భాస్వర లిపితో జాతకాలు వ్రాయగలడు. అంతే!

''స్వరం గొప్ప భాస్వరం కంటే
గీతిక గొప్ప జాతకం కంటె
అతని కంటె నేనే గొప్ప
ఆత్మ చేతన అంటూ వుంటే...''
ఈ 'ఆత్మచేతన' ప్రధానం కవి దృష్టిలో.

కవి సమాజానికి దీపంలా దారి చూపించాలి. సూర్యుణ్ణీ చంద్రుణ్ణీ అన్నింటినీ మించి పోయిన ఒకే ఒక దీపం ఉందంటున్నారు ఈ కవి.

''మహోజ్జ్వల చైతన్య మూర్తి
మనిషే ఆ దీపం...''

(మిగతా 38వ పేజీలో)

జేమ్స్ పి. ఓడొన్నెల్

# చార్లీచాప్లిన్ దృష్టిలో నెపోలియన్, హిట్లర్

బెర్లిన్‌లో హిట్లర్ పాతనివాసానికి రాయివిసురు దూరంలో వుంటూ అతన్ని గురించి జరిపిన పరిశీలనల ఫలితంగా చార్లీచాప్లిన్ వర్ణించినట్టు ''టూత్ బ్రష్'' వంటి మీసాలుండి, దాదాపు ప్రపంచాన్నంతా జయించిన చిన్న వ్యక్తిగా హిట్లర్‌ను గురించి నేను వూహించాను. చార్లీచాప్లిన్ వృత్తికీ, అడాల్ఫ్ హిట్లర్ వృత్తికీ సన్నిహిత సామ్యం వున్నట్టు కనిపించటంలో ఆశ్చర్యం లేదు. ఈ పోలికను గురించి వివరంగా తెలుసుకోవాలంటే 1940 లో చార్లీ చాప్లిన్ నిర్మించిన ''ది గ్రేట్ డిక్టేటర్'' చిత్రాన్ని చూడండి.

ఆల్బర్ట్ స్పీర్ వంటి హిట్లర్ సన్నిహితులు తమ జ్ఞాపకాల సంపుటాలలో ధృవపరచినట్టు, ఆ చిత్రంలో చార్లీచాప్లిన్ చూపించిన పెక్కు సన్నివేశాలు, ఆ చిత్ర నిర్మాణం తర్వాత చాలా సంవత్సరాలకు జరిగిన సంఘటనల దృశ్యాలని మనందరకీ తెలుసు. ఆ చిత్రంలోని చాలా సన్నివేశాలను ఇందుకు రుజువుగా ఉటంకించవచ్చు



అందులోని ఒక సన్నివేశం గురించి ఆల్బర్ట్ స్పీర్‌ను ప్రశ్నించినప్పుడు అతను కూడా ఆ వాస్తవాలనూ, పోలికలనూ ధృవపరిచాడు. ఇక్కడ గమనించవలసిన విశేషం యేమిటంటే 1938 లోనే హాలీవుడ్‌లో చాప్లిన్ ఆ దృశ్యాల చిత్రీకరణలో నిమగ్నుడయినాడన్న అంశం

## మరపుకురాని దృశ్యం

ఆల్ప్స్ పర్వతాలకు కుడివైపునా, ఎడమవైపునా రెండు రాజ్యాలున్నవని వూహించండి. వాటి అధినేతల పేర్లు — హింకెల్ (హిట్లర్), బెంజినో నెపోలిని (ఇది ముస్సోలినీ పాత్ర). వారి మొదటి సమావేశం దృశ్యాన్ని చాప్లిన్ అభిమానులు ఎన్నటికీ మరువజాలరు.

ఈ దృశ్యం విషయంలో చాప్లిన్ పొరపాటుపడ్డాడని నాకు తరచు అనిపించుతూండేది. దానికి కారణం ముస్సోలినీ పట్ల తన అభిమానాన్ని హిట్లర్ పలుమార్లు ప్రకటించడమే. హిట్లర్ అభిప్రాయంలో బలహీనమయినదైన తన జాతిని ఉద్ధరించవలసి వచ్చిన గొప్ప వ్యక్తి ముస్సోలినీ. ఈ విషయం గురించిన నా అభిప్రాయాన్ని ఆల్బర్ట్ స్పీర్ ఇటీవల ఇలా సరిదిద్దాడు:

''ఇతరులను అనుకరించడం హిట్లర్‌కు బాగా తెలుసు. చాప్లిన్ ఫిలిమ్‌లో, ఆ యిరువురు నియంతలూ తమ మొదటి సమావేశంలో ఒకరినొకరు మోసం చేసికొని, అధిగమించాలని యత్నిస్తారు. వారి నిజ జీవితాలలో కూడా అలాగే జరిగింది.

''రీచ్‌లోని రాయబారి కార్యాలయంలో ఒక రాత్రి ఒక తమాషా జరిగింది. సమావేశానంతరం తన బృందంతో ముస్సోలినీ విశ్రాంతి గైకొనడానికి వెళ్ళాడు. అప్పటివరకూ తనతో వున్న కొలదిమంది మిత్రులకూ, ముస్సోలినీ వికృత వీరరంభాలను ఎలా పలికాడో హిట్లర్ ప్రదర్శించి చూపించాడు. మంచి మిమిక్రీ కళాకారుడు హిట్లర్. మంచి నృత్యకళాకారునివలె హిట్లర్ నటించాడు. ఇటాలియన్ భాషలో ప్రసంగించాడు.''

హిట్లర్‌కు ఇటాలియన్ భాష రాదన్నదే ఇక్కడ గమనించవలసిన చాప్లిన్ టెక్నిక్. ది గ్రేట్ డిక్టేటర్' చిత్రంలో కూడా జర్మన్ భాషలో ఒక్క ముక్కయినా రాని చాప్లిన్ అర్థం పర్థం లేని మాటలతో ఉపన్యాసం చేశాడు. తమాషా యేమిటంటే అనర్గళంగా మాట్లాడిన జర్మన్ భాషవలే ఆ మాటలు వినిపించుతవి. జర్మన్ భాష రానివారికి మాత్రమే సుమండీ.

## మరొక వింత

హాలీవుడ్‌లో జరిగిన ఒక విందులో ''డాన్‌గియోనాగిని'' నుంచి, అందరకూ తెలిసిన ఒక పాట పాడి తన అతిథులను చాప్లిన్ ఆశ్చర్యపరచాడు. ''చార్లీ నువ్వు ఇంత బాగా పాడగలవని మాకు తెలియదే'' అని ఒక అభిమాన గాయకుడు అనగా ''ఓ! నిజానికి నాకు సంగీతం రాదు, కేవలం అనుకరణ. అంతే'' అన్నాడు చార్లీ.

హిట్లర్ చరిత్ర క్షుణ్ణంగా తెలిసిన పండితులకూ, ఆల్బర్ట్ స్పీర్‌కు కూడా తెలియని మరొక తమాషా వున్నది. – 1932 వరకూ ప్రఖ్యాత జర్మన్ నటుడు మారిస్ డెవనంట్, రహస్యంగా అడాల్ఫ్ హిట్లర్‌కు నటనలోనూ, ఉపన్యాసాలు ఇచ్చే పద్ధతులలోనూ శిక్షణ ఇచ్చాడు.

జాతీయ స్థాయిలో జరిగిన అయిదు ఎన్నికలలో హిట్లర్ ఉపన్యాసాలివ్వవలసి వచ్చింది. హఠాత్తుగా అతని గొంతు మూగ పోయింది. అందుకు హిట్లర్ ఒక రోజంతా చాలా కలతపడ్డాడు. చివరకు ఆ నటుని వద్ద రహస్యంగా శిక్షణ పొందాడు. 1932 నుంచి 1975 వరకూ యే విలేకరికి గానీ, చారిత్రకునికి గాని యీ విషయం తెలియనే తెలియదు. మ్యూనిచ్‌లోని ప్రత్యేక భవనంలోని హిట్లర్ గదిలో ఆ శిక్షణ జరిగిందని హాన్స్‌బౌర్ యీనాడు చెబుతాడు.

ప్రతిభగల నటుడు డెవనెంట్. జనాభిమానం పొందినట్టి వాడు. హిట్లర్ అంటే కొండంత అభిమానం అతనికి. ఈ శిక్షణ విషయం ఎవరికీ వెల్లడించనని అతనిచేత ప్రమాణం చేయించాడు. 1945 తర్వాత ఆ విషయం అతను వెల్లడి చేయకపోవడానికి ఇతర కారణాలున్నవి.

## సినిమాలంటే ఇష్టం

1970 లో హైడల్‌బర్గ్‌లో ఆల్బర్ట్ స్పీర్‌తో నేను చాలా ఇంటర్వ్యూలు జరిపాను. హిట్లర్ వద్ద శిల్పిగా అతను పని చేశాడు. తన ఆప్తులతో హిట్లర్ జరిపే గోష్ఠులు ఎంత విసుగు కలిగించేవో మొదటి ఇంటర్వ్యూలో అతను వివరించాడు.

ఈవా బ్రౌన్‌కూ, ఆమె ప్రియుడయిన హిట్లర్‌కూ సినిమా లంటే చాలా యిష్టం. రోజూ సాయంత్రం వేళ వారికి హాలీవుడ్ సినిమాల వంటి చిత్రాలను సప్లయి చేయడం ప్రచారశాఖ మంత్రి అయిన గోబెల్స్‌కు ఒక సమస్య అయినది. ఇక్కడ గమనించవలసిన అంశం హిట్లర్ దర్బారులోని వారు, జర్మనీలో నిషేధించబడిన — లేదా ఎన్నడూ ప్రదర్శించని— పెక్కు చిత్రాలను చూచారన్నది.

''ది గ్రేట్ డిక్టేటర్'' చిత్రాన్ని చూపించాలనే దురాలోచన ఎవరికయినా కలిగిందా!'' అని స్పీర్‌ను నేను అడిగాను అలాంటి ఆలోచన ఎవరికి కలుగలేదనీ, తాను చాప్లిన్ అభిమానిననీ, ఈవాకు కూడా చార్లీ అంటే ఇష్టమనీ స్పీర్ చెప్పాడు. 1933 నుంచీ చాప్లిన్ చిత్రాలన్నింటినీ జర్మనీలో నిషేధించారు. చాప్లిన్ జూయిష్ జాతి వాడని గొబెల్స్ ప్రచారం చేశాడు. నాకు తెలిసినంత వరకూ చాప్లిన్ జూయిష్ జాతివాడు కాదని స్పీర్‌కు నేను చెప్పాను. ఇంతేకాదు — అంతకు ముందెన్నడో చాప్లిన్ వ్రాసిన ''నెపోలియన్'' సినిమా స్క్రిప్ట్ చాప్లిన్ మనస్సులో నలుగుతున్నదనీ, దాని ఆధారంగానే ''ది గ్రేట్ డిక్టేటర్'' చిత్రం నిర్మాణం జరిగిందని కూడా చెప్పాను.

1933–34 లో చాప్లిన్‌తో కలసి పని చేసిన అలిస్టెయిన్ కూకి, నాకు ఒక సంగతి గుర్తు చేశాడు. ''సెయింట్ హెలీనా మీద నెపోలియన్'' అనే అంశం గురించి ఒక చిత్రం నిర్మించాలని కొంత కాలంగా చాప్లిన్ ఆలోచిస్తున్నాడని కూకి అన్నాడు ఆ ఫిలిమ్ స్క్రిప్ట్ వ్రాయడంలో చాప్లిన్‌కు సహాయ పడినాడు కూకీ. నెపోలియన్ వలే చాప్లిన్ ఎలా నటించినదీ కూకీ నాకు వివరంగా చెప్పాడు. కొంత కాలం తర్వాత 'నెపోలియన్' ఫిలిమ్ స్క్రిప్ట్ తయారు చేసే పనిని చాప్లిన్ విరమించుకున్నాడు.

## నెపోలియన్ సమాధి వద్ద

1940 జూన్ 26వ తేదీన విజేతగా, మొదటి సారీ, అదే ఆఖరుసారీ హిట్లర్ పారిస్‌కు వెళ్ళాడు. లే ఇన్ వాలైడ్స్‌లోని నెపోలియన్ సమాధిని సందర్శించాడు తన బృందంతో. అక్కడ చాలా సేపు మౌనంగా వున్నాడు. ఆ తర్వాత తన సహాయోద్యోగి హాన్స్ స్పయిడల్ వైపు చూచి ''కర్నల్ ఇప్పుడు టైమ్ ఎంత యింది'' అన్నాడని అప్పుడు ఆ సమాధిని సందర్శించిన హిట్లర్ బృందంలోని ఒకరు చెప్పారు.

విజేతగా నెపోలియన్ 1806 లో నెపోలియన్ బెర్లిన్ నగరాన్ని సందర్శించాడు పోట్స్ డామ్‌లోని ఫ్రెడరిక్ ది గ్రేట్ సమాధిని చూచాడు. తన బృందంలోని వారితో నెపోలియన్ ''జంటిల్ మన్! ఈ గొప్ప రాజు ఇంకా బ్రతికి వుంటే మనం ఇక్కడకు రాగలిగి వుండే వాళ్ళం కాదు'' అన్నాడు ఆనాడు నెపోలియన్ అన్న మాటలకూ, 1940 లో హిట్లర్ అన్న మాటలకూ పోలిక యేమయినా ఉన్నదా! నెపోలియన్ చాలా హుందాగా, ఉదారంగా ప్రవర్తించగా, పూర్తి విజయం సాధించుతున్నట్టు కనిపించిన క్షణాలలోనయినా హిట్లర్ నరాలలో అలాంటి ఔదార్యం, హుందాతనం కనిపించలేదు.

చార్లీ చాప్లిన్, నెపోలియన్, హిట్లర్‌లలో హిట్లర్ పరిణతి పొందిన నటుడు. హిట్లర్ కథను నెపోలియన్ కథతో ఆల్బర్ట్ స్పీర్ పోల్చడానికి తగిన కారణాలుగానీ, ఆధారాలుగానీ లేవు. హిట్లర్ జయించిన దేశాలలో అతన్ని గుర్తుంచుకొనదగిన విశేషాలేమీ లేవు. నెపోలియన్ తన మహా సైన్యంతో అడుగుపెట్టిన ప్రతిదేశంలోనూ నిర్మాణాత్మక సంస్కరణలతో పాటు నెపోలియన్ నిబంధనావళిని కూడా ప్రవేశపెట్టాడు. గొప్ప వ్యక్తి నెపోలియన్ అని నేను ఆల్బర్ట్ స్పీర్‌తో వాదించే వాణ్ణి. కాని, అతను అంగీకరించేవాడు కాదు ఐరోపా ఖండంలోని అయిరోపియన్ల దృష్టిలో సైనిక శక్తితో సమయిక్యం చేసిన ఐరోపా కంటే సమైక్య ఐరోపా అనేది అసలు లేకపోవడమే మంచిదని స్పీర్ వాదించేవాడు. ఆదిలో ఎలాంటి వారయినా నియంతలందరూ తుదకు తిరుగులేని అధికారాలుండేవారు గానూ, మారడానికి వీలులేని అవినీతి పరులు గానూ తయారవుతారని స్పీర్ వాదించేవాడు.

## కొరుకుడుపడని కొయ్య

స్విట్జర్లాండ్‌లో మనోయిల్ డిబాన్‌లో ఒంటరిగా వుంటూ, ఆ భవనమే తన కోటగా భావించుతూండిన మరొక వ్యక్తి నా మనస్సులో మెదిలాడు. అతనే చార్లీ — అదే సర్ చార్లీ చాప్లిన్. జర్నలిస్ట్‌గా న ముప్పది సంవత్సరాల అనుభవంలో సులభంగా ఇంటర్వ్యూ చేయడానికి వీలయిన వ్యక్తులలో ఆల్బర్ట్ స్పీర్ ఒక డయితే కొరుకుడుపడని కొయ్య చాప్లిన్ అనిపించింది నాకు.

అది 1957 జూన్, లౌసాన్, మాంట్రీ నగరాల మధ్య వెవీ చిన్నపట్టణం. చాప్లిన్ జీవితం గురించిన అయిదు భాగాల వ్యాసం ప్రచురించాలని ''సాటర్‌డే ఈవెనింగ్ పోస్ట్'' పత్రిక సంపాద కులు సంకల్పించారనీ, ఆ వ్యాసాన్ని వ్రాయవలసినదిగా వారు నన్ను కోరారనీ ఆ పట్టణంలో వుంటున్న చాప్లిన్‌కు ఫోనులో తెలియ జేశాను. ఆ తర్వాత ఆ విధంగా ఒక జాబు వ్రాశాను అతనికి:

అమెరికన్ పత్రికలు చాప్లిన్ గురించి సరిగ్గా వ్రాయలేదనీ, అతన్ని గురించి ఖచ్చితంగా వ్రాయాలనీ నా సంకల్పం. ''పోస్ట్'' పత్రిక సంపాదకులు కూడా అలాగే భావించారు.

చాలా నిరాశతో అయోమయస్థితిలో చార్లీచాప్లిన్ 1956లో అమెరికా వదలివెళ్ళాడు. పన్నుల శాఖ అధికారుల బాధపడలేక రహస్యంగా పారిపోయాడు. అయిరోపా అంతా దర్జాగా పర్య టించాడు అమెరికన్ అధికారులు అతన్ని వెన్నాడారు.

1957 లో చాప్లిన్ వెవీ పట్టణంలో ఉండిన రోజులలో అమెరికన్లకు వ్యతిరేకంగా ఒక ప్రహసన చిత్రం నిర్మించే పనిలో నిమగ్నుడయి వున్నాడు. సరిగ్గా అప్పుడే నేను రంగంలో ప్రవే శించడం జరిగింది. చాప్లిన్‌కూ, నాకూ మిత్రుడయిన బ్రిటిష్ జర్నలిస్ట్ ఒకడుండేవారు. ఆ నటుణ్ణీ, నన్నూ సన్నిహితం చేయడానికి శక్తివంచన లేకుండా ఆ జర్నలిస్ట్ కృషిచేశాడు.

తమ చెప్పవలసిన వివరాలు చెప్పాలనే చార్లీ అనుకొంటున్నా డనీ, అతని మనస్సు అందుకు సిద్ధపడేవరకూ ఓపికపట్టమనీ ఆ జర్నలిస్ట్ నాకు సలహా చెప్పారు. స్వార్థపరులు అతన్ని వేటాడు తున్నారనీ, పత్రికా రచయితలను ఎన్నడూ నమ్మవద్దనీ హాలీవుడ్‌లో వుండిన రోజులలో అతని వంధిమాగధులు చార్లీకి హితవు చెప్పారు. అదీ అసలు చిక్కు.

ఒక రోజు ఒక హోటలులో చార్లీని నేను కలుసుకొన్నాను. అతడు నామీద విరుచుకుపడ్డాడు. 'సాటర్‌డే ఈవెనింగ్ పోస్ట్' పత్రికను నిందించాడు. దానిమీదట గ్లూసెస్టర్. మసాచుసెట్స్‌లలో అతని చిత్రాలను నేను చూచేవాణ్ణని, వాటిలో కొన్ని చిత్రాలు అద్భుతంగా ఉన్నవనీ బుజ్జగించాను. చార్లీ కొంచెం ప్రసన్నుడయి నాడు. కానీ, అంతలో మారిపోయి హారీట్రూమన్‌ను నిందించాడు. ''సాటర్‌డే ఈవెనింగ్ పోస్ట్'' పత్రిక చవకబారు హాస్యాల ప్రచు రణ ద్వారా ప్రజలనుంచి డబ్బు సంపాదిస్తున్నదన్నాడు. ఆ తర్వాత ఆ హోటలులోనే ఎటో వెళ్ళాడు. అది ఫ్రెంచి హోటలు. కొన్ని క్షణాల తర్వాత హోటలులోని వారందరూ పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వనారంభించారు. అంత తమాషా చేశాడు చాప్లిన్. నేను కూడా నవ్వాను.

## గడువు సమీపించింది

చాప్లిన్ గురించిన వ్యాసాలను వ్రాయడానికి మా సంపాదకులు నిర్ణయించిన గడువు సమీపించుతున్నది. అంతవరకూ నేను అక్షరం ముక్క వ్రాయలేదు. ఇంటర్వ్యూయే అసలు జరుగలేదు, ఆ సంగతి ఫిలడల్ఫియాలోని మా పత్రిక సంపాదకులకు తెలియజేశాను జూలై ఆఖరులో.

చాప్లిన్ తన బట్లర్‌నో, మరొకరినో బర్తరఫ్ చేసేవరకూ ఓపిక పట్టవలసిందిగా మా పత్రికలో విదేశ వ్యవహారాల విభాగం సంపాదకుడు మార్టిన్ సోమాల్స్ వద్దనుంచి నాకు కేబుల్ వచ్చింది.

అలాంటి అవకాశం అనతికాలంలోనే లభించింది. చాప్లిన్‌కు ప్రయివేట్ సెక్రటరీగా సెట్టుమీద ప్రధాన స్క్రిప్ట్ రచయిత్రిగా పనిచేస్తూండిన ఇసబెల్ డెల్యూజ్‌ను అతను బర్తరఫ్ చేశాడు ఆ వుద్యోగంలో చేరకముందు లండన్‌లో ఒక రచయిత భార్య ఆమె.

ఆమెను కలుసుకొన్నాను. ''ది డిక్టేటర్'' చిత్రంలో నిజంగా హిట్లర్‌వలె చాప్లిన్ నటించాడని ఆమెతో అన్నాను. అందుకామె ''మూడ్ చెడిపోయి, వివేకం కోల్పోయినప్పుడు చాప్లిన్ నిజంగా హిట్లర్ అవుతాడు'' అన్నది.

నెపోలియన్‌ను చాప్లిన్ చాలా ప్రశంసించేవాడని ఆ తర్వాత ఒక ఇంటర్వ్యూలో మేడమ్ డెల్యూజ్ చెప్పింది, 1920 తర్వాతి సంవత్సరాలలో చాప్లిన్ కీర్తి ప్రపంచమంతటా వ్యాపించింది. నెపోలియన్ వాడిన దుస్తులనూ, టోపీలనూ, గ్లోవ్స్ వంటి వాటన్నింటినీ చాప్లిన్ సేకరించాడు. ఆ స్మారక చిహ్నాలన్నింటినీ నాలుగు పెద్ద ట్రంకుపెట్టెలలో పదిలపరిచాడు. వెవీలో కూడా చాప్లిన్‌వద్ద ఆ పెట్టెలున్నవి.

చాప్లిన్ గురించి ఏవేవో కొన్ని వివరాలయితే సేకరించ గలిగాను అంతవరకూ అతనితో ఇంటర్వ్యూ మాత్రం జరుగలేదు. అమెరికా మాజీ అధ్యక్షుడయిన హారీ ట్రూమన్‌ను చాప్లిన్ అవ హేళన చేసిన సంగతి గుర్తొచ్చింది. ఆ సంగతి హారీ ట్రూమన్‌కు వ్రాశాను. అందుకు ట్రూమన్ వ్రాసిన సమాధానం నాకు ఆశ్చర్యం కలిగించింది.

ఆ జాబు ఫొటో కాపీని పోస్టులో చాప్లిన్‌కు పంపించాను, అదంతా మోసం అని అతను తొలుత అన్నాడు. ఇక లాభం లేదని

ట్రూమన్ నాకు వ్రాసిన జాబునే చూపించాను. దానికి నకళ్ళు వ్రాసుకొన్నాడు చాప్లిన్. క్రిస్మస్ కార్డులతోపాటు ఆ జాబు ప్రతులనుకూడా చాప్లిన్ పంపించేవాడని ఆ తర్వాత తెలిసింది.

## అంగీకారం

ఎలాగయితేనేమి నన్ను కలుసుకొనడానికి చార్లీచాప్లిన్ అంగీకరించాడు వెనిస్‌లో కలుసుకుందాం అన్నాడు. కాని నేను అక్కడకు వెళ్ళేప్పటికే చాప్లిన్ నైస్‌కు వెళ్ళాడు. ఇలా జరిగిన కొన్ని రోజులకు, లండన్‌లోని ఒక హోటల్‌లో తాను చేయనున్న ఉపన్యాసానికి చాప్లిన్ నన్ను ఆహ్వానించాడు.

ఆ హోటలులో చాప్లిన్ దాదాపు గంటసేపు ప్రసంగించాడు. ఆ తర్వాత నాకు ఇంటర్వ్యూ ఇచ్చాడు. ఇంటర్వ్యూ ప్రారంభం అయింది. కాని, ఏ క్షణంలోనైనా మధ్యంతరంగా అది ఆగిపోయే ప్రమాదం వున్నదని గ్రహించి, నెపోలియన్ ఫిలిప్స్ వ్యవహారం గురించి అడిగాను. చాప్లిన్ ముఖంలో సంతోషం తాండవించింది. రెండు రకాల నెపోలియన్ పాత్ర కథ చెప్పాడు.

''ది గ్రేట్ డిక్టేటర్'' లోని ఇతి వృత్తమే ఆ కథ. 1938 లో అతనికి ఒక తమాషా ఆలోచన కలిగి, ఆ చిత్రంలో నెపోలియన్‌కు బదులు హిట్లర్‌ను ఆ చిత్రంలో చాప్లిన్ ప్రవేశపెట్టి, తను విశ్లేషించిన రెండు పాత్రలనూ తనే పోషించాడు.

ప్రహసనంగా నయినా సరే హిట్లర్ పాత్రను రంగస్థలం మీద చూపించడంలో చాలా చిక్కులున్నవని 1970 లో స్పీర్ అభిప్రాయపడినాడు. రెండు సంవత్సరాల తర్వాత-అంటే1972లో-''ది గ్రేట్ డిక్టేటర్'' చిత్రాన్ని స్పీర్ చూచాడు. హిట్లర్ పాత్రను చాప్లిన్ బాగా చిత్రించాడని స్పీర్ నాతో అన్నాడు. హిట్లర్ పాత్రను పోషించడానికి నెపోలియన్ తాలూకు సరంజామాను చాప్లిన్ వాడుకొన్నాడని ఆ సందర్భంలో నేను చెప్పాను. హిట్లర్ పరిస్థితులకూ, నెపోలియన్ పరిస్థితులకూ గల సామ్యాన్ని స్పీర్ అప్పుడు వివరించాడు.

రెండు సంవత్సరాలలో ఇండియా సరిహద్దులలో తను వుంటానని 1942 లో ఉక్రేయిన్‌లో, ''పారిశ్రామికుల సమావేశం''లో ప్రసంగిస్తూ హిట్లర్ చెప్పాడు. నెపోలియన్ చేసిన తప్పులు తాను చేయబోవడం లేదని అన్నారు. నెపోలియన్ స్థాయి వాడు హిట్లర్ కానే కాదని స్పీర్ స్పష్టం చేశాడు ఆ సందర్భంతో (నాకు).

1945 ఏప్రిల్ 15 వ తేదీన ఒక వింత జరిగింది. జిటడలే మేజర్ జనరల్‌గా విల్ హెల్మ్ మొహింకిని అడాల్ఫ్ హిట్లర్ ఆ రోజున నియమించాడు. అంతకు ముందు అతనికి హిట్లర్ ఒకమాట చెప్పాడు: ఎట్టి పరిస్థితులలోనూ తను రష్యన్ల చేతులలో పడరాదనీ, తన అంత్యక్రియలకు సన్నాహాలు తానే చేసుకొన్నాననీ, 1945 మే 5వ తేదీలోగా ప్రమాదం ముంచుకొస్తే ఇరువది నాలుగు గంటలు ముందుగా పరిస్థితిని తనకు తెలియజేయవలసినదిగా మొహింకిని హిట్లర్ కోరాడు.

1945 ఏప్రిల్30వ తేదీ ఉదయం మొహింకి, హిట్లర్‌కు ఆ హెచ్చరిక చేశాడు. ఆరోజు సూర్యాస్తమయంలోగా తనూ, తన భార్యా అత్మహత్య చేసుకొంటామని మొహింకికి, హిట్లర్ చెప్పాడు. 1945 ఏప్రిల్ 30వ తేదీ మధ్యాహ్నం మూడున్నరకు ముహూర్తం నిశ్చయించుకొన్నాడు.

చరిత్ర వ్రాసేందుకు ఉపయోగపడే చాలా వివరాలు మొహింకి నాకు చెప్పాడు. మే 5వ తేదీ గురించి హిట్లర్ అంత భయపడడానికి కారణం ఏమిటి? ఆ తేదీ ప్రాముఖ్యత యేమిటి? మొదటి తేదీ లేదా పదవతేదీ, లేదా 15 వ తేదీ ఎందుకని కారాదని ఆ సందర్భంలో నేను అడిగాను.

జనరల్ మొహింకి, ''హిట్లర్ నాకు చెప్పిన మాటల ప్రకారం సెయింట్ హెలీనా మీద నెపోలియన్ మరణించినది ఆ తేదీయే. 1821 మే 5 వ తేదీ సోమవారం.'' హిట్లర్ మరణ తేదీని ఈ వింత సంఘటన నిర్ణయిస్తుంది.

(''ఎన్‌కౌంటర్'' సౌజన్యంతో)

స్వేచ్ఛానువాదం : **వి. ఎస్. ఏ.**



శ్రీ పులిచెర్ల సాంబశివరావు

# ప్రజాకవి చిఱుమామిళ్ల సుబ్బదాసు

ఉత్తము లుదార గుణులకు
 విత్తము లేదాయె బ్రతుక వితరణజేయన్
ఉత్తము నెరుగని బిజినీ
తొత్తులకు ధనంబు గల్గె దుర్గిపురీశా!

ఈ పద్యం చిఱుమామిళ్ల సుబ్బదాసుగారి శ్రీ దుర్గిపురీశ శతకం లోది. ఆయన ఇటువంటి పద్యాలను అసంఖ్యాకంగా చెప్పారు.

సుబ్బదాసుగారు మరీ ప్రాచీనుడేం కాదు. దొరికిన ఆధారాలను బట్టి ఆయన పందొమ్మిదవ శతాబ్దం వాడనీ, విషునామ సంవత్సరంలో మరణించాడనీ తెలుస్తోంది. మరణ సమయానికి ఆయనకు ఎనభై ఏళ్ళు. ఈ ఆధారాల వలన సుబ్బదాసు గారు 1800 లో పుట్టి 1881 లో స్వర్గస్థులయ్యారని ఊహిస్తున్నాను. ఈయన శేషయ్య గారి పౌత్రుడు; నరసయ్య తిరుమాలంబల పుత్రుడు. పల్నాడులో దుర్గి దగ్గరలో ఉన్న ఓబులేశుని పల్లెలో అమ్మమ్మ గారింట్లో సుబ్బయ్య గారు జన్మించారు. ఓబులేశుని పల్లె ప్రక్కలో ఉన్న ధర్మవరంలో స్థిరపడ్డారు. కులం కమ్మ. వృత్తి వ్యవసాయం. వేణమ్మ గారితో సుబ్బదాసుగారి వివాహం జరిగింది. ఆ రోజుల్లో అద్దంకి తిరుమల తాతాచార్యులు గారు గొప్ప గురువులుగా ఖ్యాతిగాంచి ఉన్నారు. తాతాచార్యులకు ఇష్టమైన శిష్యుల్లో సుబ్బదాసుగారు ముఖ్యులు. ఆ గురువుగారి దయా విశేషం వలన సుబ్బదాసు గారిలో భక్తి భావ బీజాలు నాటుకున్నాయి. ఆయన ఎప్పుడూ ఆంధ్ర భాగవతం చదువుతూ ఉండేవారు. ఆయన పఠించిన భాగవత, రామాయణ తాళపత్ర గ్రంథాలను నేడు చూడవచ్చు. ఈయన కవిత్వం మీద పోతన ప్రభావం పడింది. వేమనలాగా హాస్యం, నీతులూ మేళవించి పద్యాలు చెప్పడం గూడా ఈయనకు బాగా యిష్టం. సుబ్బదాసు గారు సహజ పండితుడు, కవి! పుస్తకాలు చదివీ చదివీ కావ్య రచనా పద్ధతుల్ని ఆకళింపుచేసుకొనే వారు కొందరుంటారు. గురువుల దగ్గర కూర్చొని, భాష నేర్చుకొని, పాఠాలు చెప్పించుకొని, కావ్యకళా రహస్యాలను తెలుసుకొనే వాళ్ళు మరి కొందరుంటారు. ఈ మొదటి తరగతి వాళ్ళు నేర్చుకుందామని చదవరు. భక్తితో చదువుతారు. వాళ్ళకు తెలియకుండానే ఛందోరీతులూ, మెలకువలూ వంటబడతాయి. అదిగో ఆ పద్ధతిలోనే సుబ్బదాసుగారు కవిత్వం చెప్పసాగారు! తాతాచార్యులు గారు కృష్ణభక్తిని బోధించారు. ధర్మవరానికి దగ్గరలోనే ఉన్న దుర్గివేణు గోపాలస్వామిని ఆరాధిస్తూ దాసుగారు భక్తి కవిత్వాన్ని ఆలపింపసాగారు.

చిలుక పలుకులు జెప్పి యా చిల్క
పల్కుల కాపేక్షపడు దొరమాడ్కి
కావ్య శబ్దామర కాండత్రయార్థ
భవ్యుడ గాక మీ పాద సరోజ
భక్తుడనై మీరు పలికించునట్టి
యుక్తులు బలి కెద యొప్పుగా వినుము

అని అంబరీషోపాఖ్యానం ద్విపద రాస్తూ శ్రీకృష్ణుడికి చెబుతాడు కవి. గురువు గారంటే వల్లమాలిన భక్తి అనేక పర్యాయాలు ఆచార్యులుగారిని స్మరిస్తారు.

ఆర్యున్ పాపతిమిర గణ
సూర్యున్ లోక ప్రసిద్ధ సుజ్ఞానుని స
త్కార్యున్ తిరుమల తాతా
చార్యున్ మదిలో స్మరింతు సద్గురు వర్యున్
పూత శ్రీశైల కుల సం
జాతుండా జ్ఞానతత్వ సంపన్నుని ఆ
శీత కరుడైన మద్గురు
తాతాచార్యున్ భజింతు తాత్పర్యమతిన్

అని తన రచనల్లో గురు స్మరణ చేస్తారు దాసుగారు.

తెలుగు కవుల చరిత్ర తెలిసింది స్వల్పం. ఆధారాలు తక్కువ. చాలమంది కవులను గూర్చి అసలు తెలియనే తెలియదు. అందులో మనకు కథ లెక్కువ కొందరు కవులకు మహిమలున్నట్లు గూడా వింటుంటాం. ఇలాంటి కథలు పోతన్నను గూర్చీ, వేమన్నను గూర్చీ చాలా ఉన్నాయి. చిఱుమామిళ్ల సుబ్బదాసుగారి చరిత్ర పరిశీలిస్తే తెలుసుకోవడం పెద్ద కష్టమేమీ కాదు. వారి వంశపు వాళ్ళు ధర్మవరం ఆ చుట్టు ప్రక్కల బాగా విస్తరించి ఉన్నారు. ఆయనను గూర్చి అక్కడి వాళ్లెన్నో కథలు చెప్పకుంటుంటారు. మచ్చుకొన్ని.

సుబ్బదాసు గారు ప్రతిరోజూ దుర్గివేణు గోపాలస్వామి గుడికి పోయి, గంటల తరబడి ధ్యానించడం ఈర్ష్యాళువులకు కొందరకి గిట్టలేదు. ఒకరోజు దాసుగారు వచ్చేవేళకి కుళ్ళుమోతులు కొందరు వేణుగోపాలస్వామి గుడి తలుపులు వేసి, తాళం పెట్టారు. వేణుగోపాలుణ్ణి దర్శించందే దాసుగారు బ్రతకలేరు! ఆయన గుడి వెలుపలనించే స్వామిని కవితా సుమాలతో ప్రార్థించాడు. తాళం విరిగి పడిపోయింది తలుపులు తెరుచుకున్నాయి. వేణుగోపాలుడు ప్రత్యక్షమయ్యాడు. సుబ్బదాసుగారు భక్త్యావేశంతో గోపాలుని మీాద శతకాలకు శతకాలే చెప్పారు. ఈ సంగతి తెలిసి, సుబ్బదాసు

గారిని దేవాలయంలోకి పోనీయకుండా తలుపులు మూసిన దుర్మార్గుల హృదయ కవాటాలు తెరుచుకున్నాయి. వాళ్లు బుద్ధి తెచ్చుకొని, లెంపలు వేసుకొని దాసుగారికి దాసాను దాసులయ్యారు.

సుబ్బదాసు గారు కష్టజీవి. పనిపాట్లు చేసుకుంటూ గూడా భగవన్నామ స్మరణచేస్తూనే వుండేవారు. వేణుగోపాలుణ్ణి కీర్తిస్తూనే వుండేవారు. ఒకరోజు ఆయన పొలం దున్ను తున్నారు. హఠాత్తుగా ఆయనలో భక్త్యావేశం పెల్లుబికింది. కవితా ప్రవాహం వెల్లువలాగా వచ్చింది. దాసుగారు అరక నవతల పెట్టి, గట్టునున్న పెద్ద రాయి మీద పద్యాలు రాయసాగారు. నిమిషాలు దొర్లాయి, గంటలు గడిచాయి. పొద్దు గూకుతోంది. పక్షులు గూళ్లకు చేరుతున్నాయి. అప్పుడు గుర్తుకు వచ్చింది అరక దాసుగారికి. వెంటనే ఎడ్లను ఇంటికి తోలుకు పోదామని అరక దగ్గరకు వచ్చారు. కానీ అక్కడ ఏం చోద్యం చూశాడు? ఎవరో తన పొలం దున్నుతున్నారు. నల్లనివాడు! ఎవరో కాదు సాక్షాత్తు తన వేణుగోపాలుడే! ఇటువంటి పరమేశ్వర లీలలను వర్ణించే కథలు మళ్లా పోతనను గూర్చే మన వాళ్లు చెబుతారు గదూ!

ఒకసారి పల్నాడులో రోగా లెక్కువయ్యాయి. అప్పుడు మందులామాకులా? అంతా దైవాధీనం. అటువంటి రోజుల్లో దాసు గారు అడి గొప్పుల, వప్పిచెర్ల గ్రామాల్లో సంచరించి ప్రజలకు ధైర్యం చెప్పారు. ఆంజనేయోపాసనతో అంటు వ్యాధుల్ని తుద ముట్టించారు.

వీరా హనుమా!
వేగచేకొనుమా! వీర హనుమా
ధీరత్వమున బలుదివి జూల వంచిన
మారుతినే జేయు మనవి చేకొనుమా॥వీ॥

ఇలా హనుమంతుని మీద సుబ్బదాసు గారు ఎన్నో కీర్తనలు చెప్పారు. నేటికీ పల్నాటి ప్రజల ఈ కీర్తనలను ఆనందంతో పాడు కొనడం చూడవచ్చు. ధర్మవరంలో ఆంజనేయుణ్ణి ప్రతిష్ఠించారు దాసు గారు. ఈ విషయంలో ఆనాడు పెద్ద గొడవైంది గూడా! పేరంటాలు లక్ష్మమ్మ సుబ్బదాసు గారికి మేనగోడలే! లక్ష్మమ్మ కథ తెలియని తెలుగు వాళ్లుండరేమో! ఆమె వెలసిన చోట నాటి నుండీ నేటి వరకూ వైభవోపేతంగా తిరునాళ్లు జరుగుతూవుంది. దాసు గారు ఆ పేరంటాలు గుడికి వచ్చిన కానుకల్లో కొంత భాగాన్ని ఆంజనేయ ప్రతిష్టకుపయోగించారు. దాంతో తరువాత గొడవ వచ్చి పడింది. కలక్టర్ గారి దగ్గరి కెళ్లింది వ్యవహారం కలక్టరు స్వయంగా విషయాన్ని పరిశీలించి తీర్పు చెప్పారు. సుబ్బదాసు గారినే ధర్మకర్తగా ఆయన నియమించాడు! ఈ సంగతులన్నీ ఇప్పుడు దాసు గారు రచించిన శ్రీ ఆంజనేయ ప్రతిష్ఠోత్సవ మాలికను బట్టి స్పష్టంగా తెలుసుకోవచ్చు "మహోత్సవ మాల తొంబదిన్నారును నాల్గు పాదములునై విలసిల్ల రచించి నీకు నేధారణ జేసినాను ప్రమదంబున దాల్చగదయ్య" అని ఆంజనేయుణ్ణి దాసు గారు ఆ మాలికాంతంలో ప్రార్థన చేస్తారు. ఇలాగే ఇంకోసారి ఆ ప్రాంత ప్రజలకు అమ్మవారి తాకిడి ఎక్కువైంది. అప్పుడు గూడా సుబ్బదాసు గారు ప్రజలకు ధైర్యం చెప్పారు. ఆనాడు ఆయన పోలేరమ్మ మీద చెప్పిన కీర్తన నేటికీ పల్నాడు ప్రజలు పాడుకుంటున్నారు నేను సేకరించిన దానిని బట్టి అదియిది·

పోలీ తగునా మేలు నీకగునా పోలీ తగునా
జాలిగాదే పసిబాలాల పోసేవు
బాలుర ఉసురంత ఏలాపోసేదవే ॥పోలీ॥
పిల్లాలకును ఉగ్గుపెట్టి పాలివ్వకా
తల్లీ విషముపెట్ట తలపాదిక్కెవ్వరే ॥పోలీ॥
సోకినంతనే నీవు ఆకారములు చెడు
లోకాములో పెద్దరాకాసీ వటనే ॥పోలీ॥
చర్మపోతలు కండశల్య పోతలు పోసి
దుర్మార్గమున ప్రజల దూలజేసెదవా ॥పోలీ॥
బాల ఘాతకివని పలుకుచుందురు గానీ
పోలేరమ్మవని పొగడ నేమిటికే ॥పోలీ॥
గ్రామ దేవతవయ్యు కరుణ యింతయు లేక
తామాషివైయుంటూ ధర్మమే నటనే ॥పోలీ॥
వీరాంజనేయులు విఘ్నేశ్వరులు ఉప
కారులు నీవలె క్రూరులైనారా ॥పోలీ॥
అద్దంకి తిరుమల అయ్యాల సేవించి
అద్దంకి నాంచారి అనుభావ మొందెనే ॥పోలీ॥
ఇకనైనా చాలించు యీ బాలుర రక్షించు
కరుణాతో ప్రజలను కాపాడు కొనుమా ॥పోలీ॥
పాప వృత్తులు మాని భక్తితో శ్రీదుర్గి
గోపాల దేవుని ప్రాపుచేరవే ॥పోలీ॥

సుబ్బదాసు గారు పోలేరమ్మను గూర్చి కీర్తనలు పాడుతూ ఊరూరా సంచరిస్తున్నారు. ఆయన వెంట శిష్యగణం ఉంది. ఆ శిష్య సమూహం పేరు "రామదండు" అని పెట్టారు మాడుగుల గ్రామస్థులు దాసు గారిని ఊళ్లోకి రానివ్వ లేదు. ఒళ్లుమండి సుబ్బదాసు గారు ఈ పద్యం ఆశువుగా చెప్పారట!

ఖగరాడ్వాహను కీర్తనోత్సవము మా గ్రామంబులో జేయగా
తగదంచడ్డము వచ్చి నిల్చిరి మదాంధత్వంబుచే గానకే
సుగుణుం డొక్కడు లేడు చూడగ హహా! చోద్యంబ
యీయూరు మా

డుగులం చెన్నగనేల దీని భువిలోడూ దీసిదూబెట్టనా!

ఆయన కోప ప్రభావం వలన మాడుగుల గ్రామంలో దరిద్రం తాండవించగా జాలిపడి మరల ఇలా చెప్పారట: "...దను జానీకములో మువ్వురుందురే ఈ మను జానీకములో లేకుందురా? దుదీసిదు బెట్టకే మనసా."

ప్రజలంతా సుబ్బదాసు గారిని గౌరవిస్తున్నప్పటికీ, ఆయన చిన్న కోడలు మాత్రం లక్ష్య పెట్టేది గాదు. ఒకసారి ఆయన పూజ చేసుకొంటుండగా, దేవతార్చన పాత్రను కాలితో కొట్టిందట. దాసుగారికి కోపం వచ్చి "దేవతార్చన పాత్రను తాకిన పాదముంటుందా?" అన్నారు వెంటనే ఆమె పాదం ఊడిపోయిందట!

దుర్గిలో రెండు అంబోతులు ఘోరంగా పోట్లాడు కొంటున్నాయి ఒకసారి. ఇక్కడ ధర్మవరంలో భక్తులతో సత్కాలక్షేపం చేస్తున్న దాసుగారు హఠాత్తుగా చేతులెత్తి, ''ఆపండి'' అని కేక వేశారు. భక్తులేమిటని అడిగితే ''అంబోతులు దుర్గిలో గోల గోల చేస్తున్నాయి. వాటి యుద్ధాన్ని ఆపాను'' అన్నారు. తరువాత భక్తులు దుర్గికి పోయి కనుక్కుంటే అంతా సత్యమేయని తేలింది.

సుబ్బదాసు గారు కష్టపడి పంటలు బాగా పండించేవారు. ఆయన పచ్చపచ్చగా ఉండటం చూచి సహించ లేక ఒక కాపు తన గొడ్లను దాసుగారి పొలాలపైకి తోలి,పంటలు పాడుచేస్తుండేవాడు. దాసుగారు ఎన్నిసార్లు చెప్పినా అతడు లక్ష్య పెట్టలేదు. ''నన్నిలా వణికిస్తున్నావు. పరమేశ్వరుడు నిన్ను వణికించకుండా ఉంటాడా?'' అన్నారు దాసుగారు. ఆయన మాట శాపంగా పరిణమించింది. తొందరలోనే ఆ కాపు కాపురం కడగండ్ల పాలైంది.

ఒకసారి సుబ్బదాసు గారు కొద్దిగా బాకీపడ్డారు. ఆ వ్యక్తి దాసుగారి నొకసారి నడిబజారులో నుంచోబెట్టి దుర్భాష లాడసాగాడు. ఎంత చెప్పినా వినిపించు కొనడం లేదు. ఇంతలో ఆ దారిన పోతున్న వైశ్యుడది చూచి, వెంటనే తన దగ్గరున్న డబ్బుతో ఆ బాకీ తీర్చి, దాసుగారిని రుణ విముక్తులను చేశాడు దాసుగారు ఆనందించి ''శ్రీమంతుడవుకా నాయనా!'' అని దీవించారు. కొద్ది కాలంలో నిజంగానే ఆ వైశ్యుడు లక్షాధికారి అయ్యాడు.

సుబ్బదాసు గారు హనుమంతుని ప్రతిష్ఠించినప్పుడు చాలా మందికి కోపం వచ్చింది. అందులో రామయ్య అనే ఆయన ఒకడు. అతడు దాసుగారిని నానా దుర్భాష లాడాడు. పొలంలో మంచెపై ఉన్న రామయ్యను, ఎక్కడ నుండో ఒక పెద్ద కోతి వచ్చి పైబడి రక్కి కిందపడవేసింది. రామయ్యకు కాళ్ళు విరిగాయి. రామయ్య తన తప్పు తెలుసుకొని పశ్చాత్తాపపడి దాసుగారి శిష్య గణంలో చేరాడు.

వంగులూరి కోటమ్మ గారు మహాభక్తురాలు. ఒకసారి ఆమె దాసుగారికి పూలను సమర్పింప బోయింది. ఆ పూలల్లో ఒక బంగారు పుష్పాన్నుంచింది. అయితే దాసుగారు దూరం నుంచే ఇది గ్రహించి ''కోటమ్మా! ఆ బంగారు పువ్వును తీసి, మిగిలిన పూలే నాకివ్వు!'' అన్నారట! ఇలాంటి కథలు అసంఖ్యాకంగా ఉన్నాయి.

ఇక రచనల సంగతి. సుబ్బదాసు గారి రచనల్లో కొద్ది భాగం మాత్రమే ఇప్పుడు లభ్యమవుతున్నాయి. అవి సరిగ్గా అచ్చువేస్తే వెయ్యి పుటల గ్రంథమవుతుంది. దాసుగారి మనుమడైన రామయ్య పదమూడు తాళ పత్ర గ్రంథాలను ఇప్పటికి ఏభైయేళ్ల క్రితం మద్రాసుకు ప్రచురణార్థం తీసుకు వెళ్లాడట! అక్కడ ఆయన నాలుగు గ్రంథాలను మాత్రం ముద్రించి తిరిగి స్వగ్రామానికి వచ్చాడు. అచ్చు ప్రతులను తీసు కొచ్చారే గాని తాళ పత్ర గ్రంథాలు ముద్రణాలయంలోనే ఉండి పోయాయి. స్వగ్రామంలో జబ్బుచేసి రామయ్య గారు స్వర్గస్థుడయాడు. అంతే! ఆ మిగిలిన తొమ్మిది తాళ పత్ర గ్రంథాల ఆచూకీ ఇంతవరకు తెలియదు. ఇప్పుడా పాత ప్రతులు దొరకడం లేదు! ఏ ముద్రాక్షరశాలలో తెలుసుకోలేక పోతున్నాం! అచ్చయిన ఆ నాలుగు గ్రంథాలే ఇప్పటికి నాలుగు సార్లు మళ్లా అచ్చయ్యాయి. వాటిల్లో తప్పులు కుప్పలు కుప్పలుగా ఉన్నాయి.

ఆయన జీవితం లాగే కవిత్వం గూడా భక్తి రసమయం అని ఇంతకుముందే తెలుసుకున్నాం. ఆంజనేయ ప్రభావం,విష్ణువు యొక్క ఆంధ్ర నామస్తోత్రాలు, నానార్థస్తవం, రుక్మాంగద చరిత్ర, అంబరీషోపాఖ్యానం, గజేంద్రమోక్షం, శ్రీకృష్ణ లీలామృతం, ప్రహ్లాద చరిత్ర, వామనావతారం, సగుణ నిర్గుణతత్వ కందార్థదరువులు, విజ్ఞాన దండకం, శ్రీ దుర్గిపురీశ శతకం, శ్రీ గోపాలశతకం, గోపాల శతకం, కేశవ శతకం, నిఖిలవిచిత్ర శతకం, త్రిలోకవందిత శతకం, చిత్త శతకం, భక్త వశవర్తి శతకం మొదలైన భక్తిమయ కృతుల నెన్నిటినో ఆయన రచించాడు. జానపదుల పాడుకొన డానికి వీలుగాఉండే గీతాల నెన్నిటినో ఆయన రచించాడు.

ఇప్పుడు ప్రజాకవి అనే మాట ఎక్కువ ప్రచారం పొందుతోంది. సామాన్య ప్రజల మధ్య నివసిస్తూ, వాళ్ల కష్టసుఖాల్లో భాగం పంచుకుంటూ, వాళ్ల భావాలను ప్రతిబింబించే కవిత్వం చెప్పేవాడే ప్రజాకవి అని ఎక్కువ మంది ఆధునిక విమర్శకులు అభిప్రాయ పడుతున్నట్లు తెలుస్తోంది. ప్రజల కష్ట సుఖాల్లో భాగం పంచుకోక పోయినా, వాళ్ల ఉద్ధరణ కోసం కవితా గానం చేసిన వాళ్ళు గూడా ప్రజాకవులే అని మరి కొందరు నొక్కి వక్కాణిస్తున్నారు. దీన్నిబట్టి రచయిత భర్మ్యహర్మ్యాల్లో తూగుటుయ్యాల్లో పడుకొని, పాశ్చాత్య మద్యసేవనంతో, మదించిన కంఠంతో, పేద ప్రజల కన్నీళ్లను ఊహిస్తూ కావ్యగానం చేసినా ప్రజాకవే అవుతాడు. ఈ పై రెండు ఉద్దేశాల్లోనూ సామాన్యాభిప్రాయం ఒకటుంది. కవి జీవితంతో పనిలేదు; కవి వ్రాసిన దాంతో పని అని.

రచనల్లో సామాన్యుల కడగండ్లు ప్రతిబింబిస్తే ప్రజాకవి; సామాన్యులతో పాటు జీవిస్తూ వారి భావాల కద్దం పట్టే కవిత అల్లినవాడు గొప్పప్రజాకవి. తరతమ భేదాలు. ఇద్దరూ ప్రజాకవులే!

ఈ పద్ధతిలో చూస్తే ప్రజాకవుల్లో ప్రథముడు చిఱుమామిళ్ల సుబ్బదాసు గారు. వ్యవసాయం చేస్తూ, నిరుపేదల మధ్య నివసిస్తూ, తన ప్రజలకు కావలసిన కవిత్వం వ్రాశాడు. ఇప్పుడు ప్రజాకవులనబడే వారికి ధనవంతులను తిట్టడం ఒక మర్యాద. దాసుగారెప్పుడో దీన్ని పాటించారు. శ్రీదుర్గిపురీశ శతకంలో అంటారు—

ఉత్తము లుదార గుణులకు
విత్తము లేదాయె బ్రతుక వితరణజేయన్
ఉత్తము నెరుగని బిజినీ
తొత్తులకు ధనంబు గల్గె దుర్గిపురీశా!

మట్టుగ అన్నము తిని తన
పొట్టకు ఉన్నట్టి పొట్ట పొట్టన వలెనా
పెట్టక అర్థికిని కుడితి
తొట్టన వలె వాని పొట్ట దుర్గిపురీశా!



అమృతాంజన్
లిమిటెడ్‌వారి
విశిష్ఠమైన

# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.




మూడు
సైజులలో
లభిస్తాంది:
50 మిలి
100 మిలి
200 మిలి

అమృతాంజన్ ఆముదము

OBM 3270/3 TGIRR

గుజరాతి మూలం : శ్రీ నగీన్ మోదీ          తెలుగు: శ్రీ గాదంశెట్టి శ్రీరాములు

# శాపగ్రస్తుడు

మద్రాసులో జరిగిన సెమినార్‌లో పాల్గొని ఆనాడు తిరిగి బొంబాయి వెళ్తున్నాను గుంటకల్లు స్టేషన్‌లో బండి ఎక్కువసేపు ఆగింది. రైల్వే క్యాంటీన్‌లో పెరుగన్నం తింటూ వున్నాను. ఉన్నట్టుండి ఎవరో నా వీపు తట్టారు. ఇక్కడ ఇలా నావీపు తట్టేవాళ్ళెవరుంటారు? నేను అదిరిపోయి మెడ తిప్పి ప్రక్కనవున్న వ్యక్తిని చూశాను. నా కళ్ళలో అపరిచితభావం ప్రకటితమవుతూవుండగానే—

''ఏం విపిన్, ఎలా వున్నావు? చాలా కాలం తర్వాత?''అన్నాడతడు. బాగా పరిచయమున్న కంఠమే అనిపించింది. పొడవాటి శరీరం. పలుచని ముఖం. గుంటలు పడ్డ కళ్ళు. పొడవైన తెల్లని గడ్డము. బుగ్గపైన నల్లని మచ్చలు. ఈ రూపం ఎవరిదో; ఇంకా మనస్సుకు తట్టలేదు. నా చేతిలో ముద్ద చేతిలోనే వుండిపోయింది. ''విప్‌లా, ముందు ముద్ద నోట్లో పెట్టుకో!'' విప్‌లా, సంబోధనతో నా స్మృతిపటలము అల్లల్లాడింది. మరుక్షణంలోనే ''ఓహో, సలీమ్ ..ను...వ్వా...నువ్వు ఇక్కడకు ఎలా వచ్చావు?'' అడిగాను అప్రయత్నంగానే.

''ఆ సంగతి తరవాత చెబుతాగాని ముందు కడుపు నిండా తిను'' అంటూ ఎంతో ఆప్యాయతతో నన్ను ఆజ్ఞాపించాడు. కాని, అన్నం తినడం మధ్యలోనే వొదిలేసి నిలబడ్డాను. కడుపులో ఇంకా ఆకలిగానే వుంది. అయినా, అటు తరవాత రుచించలేదు.

''నువ్వు తిన్నావా?'' అంటూ మామూలుగా అడిగాను. తృప్తిగా ''ఆఁ ఆఁ'' అంటూ పంటి పుల్లతో పళ్ళుపొడుస్తున్నాడు. బయటికివస్తూ సలీమ్ భుజాన చేతులు వేసి అడిగాను.

''ఎక్కడికెళ్ళావు నువ్వు?''

''మద్రాస్''

''ఇప్పుడు మద్రాసునుంచే వస్తున్నావా?''

''అవునా! నువ్వు?''

''నేను కూడా మద్రాసునుంచే!''

నాలుగడుగులు వేసింతర్వాత మళ్ళీ అడిగాను.

''మద్రాసుకు ఎందు కెళ్ళావు?''

నా ప్రశ్నతో వాడికళ్ళు మెరిశాయి, ఆ ప్రశ్న కోసరమే ఎదురు చూస్తున్నట్లు ఉత్సాహంగా జవాబు చెప్పాడు ''మన ఊళ్ళోనే వుంటూవచ్చాను, కాని మద్రాసులో ఒక పెద్ద సర్ప గృహం వుందని తెలిసింది. దాన్ని చూడ్డానికి వెళ్ళాను. నీళ్ళల్లో వుండే పాములు వుండక పోవచ్చుననీ, కొన్ని విశిష్టమైన చేపలు వుండవచ్చునని నేను భ్రమపడ్డాను. నా భ్రమ అక్షరాలా నిజమే అయింది.''

''జీవితంలో సర్వస్వం కోల్పోయినా ఇంకా నీకు ఈ పిచ్చి వదల్లేదా?'' బాధాకరంగానే అడిగాను. దాంతో అతడి కళ్ళల్లో విషాదరేఖలు ఆవరించాయి. వాడిపోయిన ముఖాన్ని ప్రక్కకు తిప్పుకున్నాడు.

★ ★ ★

పల్లెటూళ్ళో ఐదవతరగతి చదివిం తరవాత నేను బొంబాయిలోని మామగారింటికి చదువుకోడానికి వెళ్ళిపోయాను. సలీమ్ చదువు అంతటితో ఆగిపోయింది. అతడికి అంతకంటే ఎక్కువ చదువు అవసరం కూడా లేకపోయింది. అతడికి తాతముత్తాతలు చేస్తూ వచ్చిన సముద్ర చేపలవృత్తి వుండనే వుంది. అందులో, సలీంకు చేపలు పట్టడమంటే చాలా ఇష్టం. అతడు రకరకాలరంగు రంగుల చేపల సేకరించి పెట్టేవాడు. అతడికి చిన్నప్పటినుంచి కూడా చేపలగురించి విచిత్రమైన పరిజ్ఞానం వుండేది. నేను బొంబాయి వెళ్ళిం తరవాత పండుగలకు, పబ్బాలకు సెలవుల్లో ఊరికి వెళ్ళినప్పుడంతా సలీమ్‌ను కలుసుకొనే వాణ్ణి. వయస్సు రాగానే అతడు సముద్ర ప్రయాణాలు మొదలుపెట్టాడు. కొంచెం కొంచెం ఇంగ్లీషు ముక్కలు మాట్లాడ్డం కూడా నేర్చుకున్నాడు. సముద్ర జీవజంతువులకు సంబంధించిన పుస్తకాలు చదవడం మొదలెట్టాడు. వాళ్ళ తండ్రికి, తాతకు సముద్ర ప్రయాణాలంటే ఎంతో ఇష్టమట. వాళ్ళంతా ఓడల్లో సముద్ర ప్రయాణం చేసి దేశదేశాలు తిరిగి వచ్చారట. సముద్రంలో చేపలు పట్టి పట్టణాలకు తీసుకవెళ్ళి టోకుగా అమ్మేవారనీ, ఆ వ్యాపారంలో వాళ్ళకు బాగా లాభాలువస్తుండేవని సలీం చెప్పేవాడు.

చదువు పూర్తయిన తరవాత నాకు బొంబాయిలో ఒక కాలేజీలో ఉద్యోగం దొరికింది. మా వూళ్ళో మా తండ్రిగారికి ఒక దుకాణం వుంటూ వుండేది. సెలవులు ఇచ్చినప్పుడంతా నేను వూరికి వెళ్తూ వుండేవాణ్ణి. సలీమ్‌ను కలుసుకోవడమే నాకు ముఖ్య ఉద్దేశంగా వుండేది. నేను ఎప్పుడు ఊరికి వెళ్ళినా సలీంను కలుసుకోడానికే వస్తానని ఊళ్ళో వాళ్ళంతా అనుకొనేవాళ్ళు. సలీంను కలుసుకోగానే ఆ సంవత్సరం అనుభవాలన్నీ అతడు నా ముందు వెళ్ళగక్కేవాడు. రకరకాల చేపల జాతులు, వాటి ప్రత్యే

కతలు సూక్ష్మాతి సూక్ష్మంగా వివరించేవాడు. వాటి నన్నిటినీ చూస్తూవుంటే నాకు ఎంతో సంతోషంగా వుండేది. ఇంటివెనుక అతడొక పెద్ద గుంట త్రవ్వించాడు. అందులో రకరకాలైన చేపలను సేకరించి వుంచాడు. వాటి నన్నిటిని ప్రేమగా చూపించేవాడు, వాటిని గురించి గంటల కొలది చెబుతూ వుండేవాడు. అది అతడి ఎక్వేరియం. మా తల్లి చనిపోయిన తరువాత మా తండ్రి దుకాణం తీసివేశాడు. నేను ఆయన్ను బొంబాయి తోడుకవచ్చాను. క్రమంగా నేను కూడా బొంబాయి నివాసినైపోయాను.

ఒకమారు చాలా కాలం తరవాత సలీంను కలుసుకోడానికి ఊరికి వెళ్ళాను. చాలా కాలం తరవాత వెళ్ళినందుకు సలీం నాపైన కోప్పడ్డాడు. రాత్రంతా మేము మాట్లాడుకుంటూనే వుండిపోయాం. తెల్లవారు ఝామున నాలుగు గంటలకు కోడికూసింది. ''విపిన్, పడుకుందాంపద; చాలా విషయాలు మాట్లాడుకున్నాం; కాని ఇంతకూ ఒదినెగారి వద్ద ఎన్నాళ్ళు సెలవు తీసుకుని వచ్చిందీ చెప్పలేదే ?'' అన్నాడు సలీం.

''బొంబాయిలో బోరుగొట్టిపోయి ఇక్కడకు వచ్చాను. ఇక్కడ బోరుగొట్టినపుడు బొంబాయి వెళ్ళిపోతాను'' అంటూ తేలిగ్గా జవాబు చెప్పాను.

''అంటే వాళ్ళు నీ కొరకు ఎదురుచూడరన్నమాట, పది పదిహేను రోజుల తరవాత నీకు బుద్ధి పుట్టినపుడు వెళ్ళిపోతావన్నమాట.''

''అవును.''

''అయితే, ఒక పని చెయ్యి విపిన్, మా ఓడలో కొన్నాళ్ళు సముద్ర ప్రయాణం చేస్తాం పద,'' అంటూ నా జవాబు కోసం నావేపు చూస్తూవుండిపోయాడు నాటకాభినయంలాగా. సలీం ప్రస్తావన నాకు బాగా నచ్చింది. అతడి బుర్రలో సముద్ర పరిశోధన చేయాలనే కోరిక చిన్నప్పటి నుండే వుండేది. దాన్ని చూసి నాకు ఈర్ష్య కూడా కలిగేది. నా తండ్రి వ్యాపారి కనుక, సముద్రపు నీళ్ళు కాదుగదా! చెరువు నీళ్ళల్లో కూడా కాలు పెట్టనిచ్చేవాడు కాదు. ఎప్పుడైనా అతి కష్టంమీద సముద్రము వేపు షికారు వెళ్ళడానికి అనుమతించేవాడు. వెళ్ళేముందుగా ఎన్నో ఉపదేశాలు చెప్పేవాడు. నేను తిరిగి ఇంటికి వచ్చినంతవరకు మేడమీద నిలబడి ఎదురుచూస్తూ వుండేవాడు. కాని ఇప్పుడు కాదనే వాళ్ళు ఎవరూ లేరు. నేను ఆలోచనల్లో మునిగిపోవడం చూసిన సలీం అలమారాలో నుంచి ఒక పాత పత్రిక బయటకు లాగాడు. గబగబా పేజీలు తిరగవేస్తూ ''విపిన్, ఇలా చూడు, ఇందులోని నూట ఇరవై ఏడో పేజీలో ఒక వ్యాసం వుంది. చదువ్'' అంటూ మూడేళ్లనాటి పాత 'వరల్డ్ ఎవ్వులైఫ్' పత్రిక నా చేతికి ఇచ్చాడు.

నేను నూటఇరవై ఏడవ పేజీతీసి చూశాను. ఆ వ్యాసంలో జలజంతువులను గురించిన ఆశ్చర్యకరమైన విషయం వుంది. వ్యాసము చివరి పుటలో ఎర్రపెన్సిల్‌తో అక్కడక్కడ గుర్తులు పెట్టి వున్నాయి. నేను వాటిని చదివి స్తంభించిపోయాను. నాకళ్ళు ఆ పేరాగ్రాఫుపైన చాలా సేపటివరకు అట్లే వుండిపోయాయి. వ్యాసకర్త అభిప్రాయం ప్రకారం భారతదేశపు పశ్చిమ సముద్రపు ఒడ్డున ఒక విచిత్రమైన జలప్రాణి వుంది. అది రాత్రి కాగానే సముద్రంనుంచి బయటికి వచ్చి సుమారు నూరు గజాల దూరం వరకు నేలపైన నడిచి వస్తుంది. తుపాకి తూటాల గొట్టంలాంటి తన ముఖాన్ని చాపి ప్రాణులపైన గుండ్లు కురిపించి వాటిని వేటాడుతుంది. తిరిగి సముద్రంలోకి వెళ్ళిపోతుంది.

నేను సలీం అభిప్రాయాన్ని తెలుసుకొన్నాను. నా ముఖాన సంతోష రేఖలు కనిపించాయి. అది చూసిన సలీం ''విపిన్, నవ్వులాటకాదు. నేను ఈ విచిత్ర ప్రాణిని కనుగొని పేరు పొందాలనుకుంటున్నాను. నువ్వు వెంటవస్తానని హామీ ఇస్తే మనం మలబారు పశ్చిమ కొసవరకు వెళ్దాం. ఒకవేళ ఏమీ దొరకని యెడల సముద్ర షికారు ఆనందం ఎలాగూ వుండనే వుంటుంది'' అన్నాడు.

ఆ ఊళ్ళో నాకు వేరే పనికూడా ఏమిలేకపోయె. కేవలం కాలక్షేపణకే సెలవుల్లో వెళ్ళి వుంటిని. అందుకని సలీంతో సరేనన్నాను. నేను ఇష్టపడ్డంతో సలీంచాలా సంతోషించాడు. రెండు రోజుల్లో త్వరత్వరగా ఏర్పాట్లన్నీ చేశాడు. ఓడను సిద్ధంచేశాడు. మంచినీళ్ళు, భోజన సామగ్రి వగైరాలు ఓడనిండా పెట్టేశాడు. ఓడ నడపడానికి ఓ ఇద్దరు మిత్రులను ఏర్పాటు చేశాడు. నాకు ఓడలో ఏలాటి ఇబ్బందీ లేకుండా జాగ్రత్త పడ్డాడు.

మేము మూడోరోజు ఉదయాన్నే ప్రయాణం సాగించాము. మా ఓడ పగలంతా నడుస్తూనే వుంది. మధ్య మధ్యలో వలవేసి చేపలు పట్టి నాకు చూపించేవాడు. వాటి వివరాలన్నీ చెప్పేవాడు. వాటిలో తినడానికి యోగ్యమైనవి అట్టిపెట్టి మిగతావి సముద్రంలో విసరేసేవాడు. మరీ విశిష్టమైన చేప ఏదైనా దొరికితే దాన్ని ఓడపైన నీటితొట్టిలో పడవేసేవాడు. రాత్రి కాగానే దగ్గర్లో ఏదేనా ఊరుచూసి ఓడ లంగరువేసి నిలబెట్టేవాడు. రాత్రిళ్ళు ఓడలోగాని. ఒడ్డునగాని విశ్రాంతి తీసుకొనేవాళ్ళం. సలీం రాత్రిళ్ళు కూడా నిద్రపొయ్యేవాడు కాదు. అతడు దగ్గర్లోవున్న ఊళ్ళోకి వెళ్ళి మాట్లాడి వచ్చేవాడు. నేను ఓడలోనే పడుకొని పుస్తకాలు చదువుకుంటూ వుండేవాణ్ణి. చదవడం విసుగుపుట్టినపుడు సలీం చెప్పే కబుర్లు వినేవాణ్ణి. ఇలా పదిహేను రోజులు గడచిపోయాయి. నాకు బోర్ కొట్టకుండా సలీం జాగ్రత్త పడుతుండేవాడు.

ఒకనాడు మేము మలబారు ఓడరేవులో ఓ గ్రామంవద్ద విశ్రాంతికోసరం ఆగాము. రాత్రికి ఇసుకలోనే గుడారం వేశాము. అప్పుడింకా సాయంకాలమే! అక్కడ చేపలు పట్టేవారు ఉదయాన్నుండి చేసిన తమ పనంతా సవరించుకొంటూ మావేపు అనుమానాస్పదంగా చూశారు. అంతలో సలీం వాళ్లవద్ద కెళ్ళాడు. వాళ్ళతో వచ్చీరాని హిందీలో మాట్లాడాడు. 'మేము ఇక్కడకు సెలవులు గడపడానికే వచ్చాము' అనే విషయం వాళ్లకు బాగా వంటబట్టేటట్లు చెప్పాడు. ఇసుక తిన్నె మీద కూర్చొని కూర్చొని నాకు కునుకు వచ్చింది. మెళుకువవచ్చి గడియారం చూస్తే ఎనిమిదిన్నర గంటలైంది. మా మిత్రులు వంట చేస్తూవున్నారు. ఇంతలో నవ్వు ముఖంతో సలీం మావద్దకువచ్చాడు. అంతవరకు అతడెక్కడ వున్నదీ

నాకు అర్థమైపోయింది. దగ్గరకు వస్తూనే నా భుజాన చేతులు వేస్తూ ''విపిన్, ఇక మనం తొందరగానే తిరిగిపోవచ్చు. భాష తెలియక చాలా ఇబ్బంది అయిపోతూవుంది. ఇంతసేపు వాళ్లతో తల బాదుకున్నాక తెలిసిందేమి టంటే, ఇక్కడ సముద్రంలో ఏదో విచిత్ర ప్రాణి వుందట. ఇక్కడ ఇసుక తిన్నెలమీద వుండవద్దనీ, ఊళ్లోకి వచ్చి వుండమనీ సలహా ఇచ్చారు'' అన్నాడు సలీం.

సలీం మాటలు వినగానే మా ఇద్దరు మిత్రులు వంట చేయడం మానేసి మా వద్దకు పరుగెత్తి వచ్చారు. వాళ్లను చూసిన సలీం ''అరే మీరింకా డేరా వేయలేదే? పదండి నేనూ వస్తాను'' అంటూ వెళ్లి ఓడలోనుంచి డేరా ఈడ్చుకవచ్చి క్షణాలమీద గబగబా డేరా వేసేశాడు. నేను ఏమీ మాట్లాడకపోవడం చూసి ''విపిన్, చాలా రోజులైపోయిందికదూ? నీకు బోరుగా వుండి వుండవచ్చు ఇంక నిన్ను ఎక్కువ రోజులు వుంచను. ఇంకో రెండు మూడు రోజుల్లోనే తోడుకవెళ్లి బొంబాయికి సమీపంలో ఏదైనా మంచిచోట వదలివేస్తాను. అక్కడనుంచి నువ్వు త్వరగా ఇల్లు చేరుకో గలుగుతావు మాకేమో ఎప్పుడూ ఇవే పనలైపోయే!'' అన్నాడు.

మేమందరం భోజనాలు ముగించుకొని పడుకొని మేలుకొనే వున్నాము సలీం కళ్ళు సముద్రంవేపే వున్నాయి. పదిగంటలరాత్రి అయివుంటుంది సలీంసూక్ష్మదృష్టికి దూరంగా ఏదో కనబడింది. నా చెవులో గుసగుస లాడాడు. ''చూడు విపిన్, అటువేపు ఏదో శబ్ద మవుతూవుంది గదూ! ఇసుకలో సరసరా ఏదో నడుస్తున్నట్లుంది'' నేను కూడా ఆ చీకట్లో గుడ్లప్పగించి సలీం వేలు చూపించినవేపు చూస్తూ వుండిపోయాను పిల్లికంటే చిన్నప్రాణి ఏదో ఇసుక పైన పరుగెత్తుతూవుంది సలీం టార్చిలైటు, బల్లెము చేత బట్టుకొని దాని వెనకాలే గుట్టుగా వెళ్లాడు.

- సుమారు ఓ అరగంట తరవాత సలీం తిరిగొచ్చాడు.

మిత్రమా విపిన్, ఏదీ షేక్ హ్యాండ్ ఇవ్వు. భగవంతుడికి ధన్యవాదాలు. ఆ చేప జాడ తెలిసిపోయింది. దేవుడు మన పరిశ్రమను వ్యర్థం చేయలేదు. నేను ఆ చేపల వెనకాలే వెళ్లాను అవి చెట్టు ఎక్కాయి. చీకట్లో చెట్టు పైన ఏమీ కనిపించలేదు. నేను కూడా చెట్టు వద్దనే గుట్టుగా వుండిపోయాను. ంతసేపటికి గొట్టంలో నుంచి నీళ్లు చిమ్మినట్లు శబ్దమైంది టపటపా నీళ్ల క్రిందపడ్డాయి. అటు తరువాత కంకర రాళ్ళు విసరివేసినట్లు శబ్దమైంది. చెట్టుపైనుండి ఒకటి రెండు పక్షులు, మరేవో ప్రాణులు క్రిందపడ్డట్లనిపించింది. నేను చెట్టువేపు తీక్షణంగా చూశాను. రెండు మెరుస్తున్న కళ్లు తప్ప మరేమీ కనిపించలేదు. నలువేపులా చీకటి బాగా ఆవరించి వుంది. నాకు ధైర్యం సన్నగిల్లింది. నేను వాటిమీద టార్చిలైట్ వేశాను. వాటి కళ్లు మిరమిట్లు గొల్పాయి. తమ శరీరాలను ముడుసుకొని కళ్లుకప్పుకోడానికి ప్రయత్నించేశాయి. నేను లైట్ ఆర్పివేశాను. మళ్లీ గుట్టుగా చూస్తూ వుండగా నాలుగు చేపలు చెట్టుమీది నుంచి క్రిందికి దిగి, క్రింద పడివున్న పక్షులను తినసాగాయి. నేను బల్లెన్నిఉపయోగిద్దామని అనుకుంటూ వుండగానే అవి సరసరా సముద్రం వేపు వెళ్లిపోయాయి'' అన్నాడు.

సలీం ఆ రాత్రి చాలా వ్యాకులతతో గడిపాడు. బహుశా: అతడు రాత్రంతా కళ్లు మూయనేలేదేమో! మర్నాడు నన్ను తోడు కొని ఊళ్ళోకి వెళ్ళాడు అక్కడ స్కూలుగాని, పోస్టాఫీసుగాని లేదు అందువలన చదువుకొన్న వాళ్లెవరూ దొరకలేదు. చివరకు గ్రామ పెద్దను వెదికి కనుగొన్నాము. ఆ పెద్ద ఎలాగైతే నేమి వచ్చీ రాని భాషలో మా ఉద్దేశాన్ని అర్థం చేసుకొన్నాడు. రాత్రి చూసిన సముద్రప్రాణిని గురించి సలీం ఆతడితో చెప్పాడు. అందు మీదట ఆ వృద్ధుడు, అవి చేపలు కావనీ, సముద్ర రాక్షసులనీ, వాటిని రెచ్చగొట్టడంగానీ, గాయపరచడం గానీ మంచిది గాదని చెప్పాడు. వాళ్లు రాత్రిళ్లు సముద్రం దగ్గరకు ఎంత మాత్రం వెళ్లరనీ, ఒకవేళ అవే దారి తప్పి ఊళ్ళోకి వస్తే అందరూ భయ పడి పోతారనీ, వాటిని ఎవరైనా పట్టుకొని చంపితే వాళ్లకు ఆపదలు వస్తాయని కూడా చెప్పాడు. మేము ఒకరాత్రి సముద్రం ఒడ్డున్నే గడిపామని తెలిసి మాపైన కోప్పడ్డాడు. ''మీరు ఆ చేపల నద్దకు ఎంత మాత్రం వెళ్లొద్దు. అవి తుపాకి గొట్టంలాగా విషపు నీరు చిమ్మించి మీ కళ్లు పోగొడతాయి. గుడ్డివాళ్లయి పోతారు జాగ్రత్త' అంటూ ఆ పెద్ద మనిషి మమ్మల్ని హెచ్చరించి వెళ్లిపోయాడు. గ్రామ పెద్ద వెళ్లిపోయిన తరవాత సలీం ఆలోచనలో పడ్డాడు. ఆచేపలు ఎలాంటివి? గ్రామపెద్ద చెప్పినమాటలు ఎంత వరకు నిజం? చేపలు చెట్టుపైకి ఎలా ఎక్కగలవు? తుపాకి గొట్టంలో నుంచి విసరినట్లు గుండ్లు ఎలా విసరుతాయి? ఈ చేపలను సజీవంగా ఎలా పట్టుకోవాలి? అవి చిందించే విషపు నీటి నుంచి ఎలా తప్పించుకోవాలి?

చేపలు వాదిలిన రాళ్లవంటి గుండ్లు కొన్నిటిని సలీం ఆ చెట్టుక్రిందినుంచి తెచ్చాడు. అవి ఎంత గట్టిగా వున్నాయోనని ఒక గుండును పగులగొట్టి చూశాడు.

పగలంతా సలీం ఆలోచిస్తూనే వుండిపోయాడు. మనస్సులోనే ఒక ప్లాను తయారుచేశాడు. మూడు నాలుగు మైళ్ల దూరాన వున్న ఒక గ్రామానికి వెళ్లి ఒక పెద్ద పట్టకార తయారు చేయించుకొని తెచ్చాడు. దాన్ని సాయంత్రం ఇసుకలో దాచిపెట్టాడు. సూర్యాస్తమానానికి ముందే మాకు తన ప్లానంతా చెప్పాడు మూతి చిన్నదిగావుండే ధాన్యపు డబ్బాలు ఖాళీచేయించి పెట్టాడు. అందులో సగానికి నీళ్లుపోయించాడు. సూర్యుడు అస్తమించగానే బెస్తవారంతా తమ తమ పనులు ముగించుకొని ఊళ్ళోకి వెళ్లిపోయారు. సలీం నాలుగు డబ్బాలు కొంచెం కొంచెం ఎడంగా ఒక చెట్టువద్ద పెట్టించాడు. ఎవరి పని వారికి వివరంగా చెప్పాడు.

నాకు టార్చిలైట్ అప్పగించాడు. నీటి బుగ్గలు చిందించడం, గుండ్లు విసరడం అయిన తరువాత క్రిందపడ్డ పక్షులను తినడానికి అవి క్రిందకు దిగి రాగానే సరీగ్గా వాటి కళ్లపైన టార్చి వెలుగును ప్రసరింప చేయాలనీ నాకు బోధించాడు. అదంతా వింటూవుంటేనే నాకు భయం కలిగింది. ఆపదలో చిక్కుకోడానికి ఎందుకు వచ్చానా? అనిపించింది అయినా సలీం మాటలు కాదనలేకపోయాను.

ఆ ప్లానులో మేము పూర్తిగా కృతకృత్యులమయ్యాము.

నేను చేపల కళ్లపైన టార్చి వెలుగును ప్రసరింపచేయగానే సలీం చెట్టు చాటునుంచి పట్టుకార సహాయంతో ఒక దాని తరవాత వొకటి పట్టుకొని దగ్గర్లోనే వున్న డబ్బాల్లో వేసేశాడు. చేపలను పట్టుకోగానే సలీంకు కలిగిన ఆనందానికి హద్దులేదు చేపల డబ్బాలు ఓడమీదకు ఎక్కించగానే "విపిన్, ఇక మనం ఇక్కణ్ణుంచి త్వరగా వెళ్లిపోదాం" అన్నాడు.

తెల్లవారగానే డేరా వూడతీసి కట్టి పెట్టుకొని మలబారు సముద్రతీర ప్రాంతంనుండి బయలుదేరాం. ఒక గంట తరవాత సలీం నాతో ఇలా అన్నాడు: "రాత్రి ఒంటిగంట, రెండు గంటల వరకు చేపలు డబ్బాల్లో గుండ్లు విసురుతూ వున్నాయి. బహుశాః పొట్టలోని గుళ్లు అయిపోయాయో ఏమో! అటు తరువాత నిశ్శబ్దంగా వుండిపోయాయి" అంటూ ఒక్కసారి విజయసూచకంగా నవ్వాడు.

"విపిన్, వీటికి ఏం పేరు పెడదాం?" అడిగాడు సలీం నేను ఒక్కక్షణం ఆలోచనలో నిమగ్నుమయ్యాను. మనస్సులోనే ఆలోచించి "క్లయింబింగ్ షూటర్" అని చెప్పాను.

"వారెవా! మిత్రమా, ఎంత మంచిపేరు చెప్పావు!" అంటూ నా వీపు చరిచాడు. గ్రామానికి చేరుకోగానే ఆ చేపలను జాగ్రత్తపరచే విషయం ఆలోచించాడు. నేను ఆ మరునాడే బొంబాయికి బయలుదేరాను. అప్పుడు చేపలు వదిలిన గుండ్లు రెండు నా చేతికి ఇస్తూ "విపిన్, బొంబాయి వెళ్లాక వీటిలో విశేషాలేమిటో తెలుసుకోవాలి ప్రయోగశాలలో వీటిని పరీక్షింపచేసి వివరాలు నాకు తెలియచేయాలి" అన్నాడు సలీం.

నేను వాటిని బొంబాయిలోని ఒక ప్రయోగశాలలో రసాయనిక ప్రక్రియ ద్వారా పరీక్షించేందుకై ఇచ్చాను. ఆ రిపోర్టురాగానే దాన్నితీసుకొని నేను గ్రామానికి వెళ్లాను. ఊరు చేరుకోగానే సలీం కనపడి "విపిన్, మనం చాలా అదృష్టవంతులం. డబ్బాల్లో బంధించి తెచ్చిన నాలుగు చేపల్లో రెండు ఆడవి. అవి గుడ్లుకూడా పెట్టాయి ఇక ఈ గుడ్లు పిల్లలవుతాయి. రెండు మగ చేపలలో ఒకదాన్ని — దాని శరీరంలో గుడ్లు ఎలా తయారవుతాయో చూస్తామని — చంపి వేశాను. దాని శరీరంలో ఒక విచిత్రమైన యంత్రం వుంది. బహుశాః ఇవి తడిమట్టి తింటాయి. ఆ యంత్రంలో నెమ్మలాగివేసి ఒక సంచీలో వేస్తాయి. బహుశాః అక్కడ వాటిని ఎండబెట్టే ప్రక్రియ వున్నట్లుంది. అందువలన అక్కడ అవి బాగా గట్టిపడిపోతాయి. ఒక్క సంచీలో గుళ్ళు, ఒక సంచీలో నీళ్లు వేరు వేరుగా వుంటాయి. వేటాడేటప్పుడు ఈ రెండూ వదులుతాయి. ఈ నీళ్లు విషపూరితమైనవి కావు. కాని వొంటిమీద పడగానే జిల పుడుతుంది. బొబ్బలు లేస్తాయి బహుశాః ఆ నీళ్లలో ఏదో యాసిడ్ వుండి వుంటుంది" అంటూవున్న సలీం ఒక్కక్షణం ఆగిపోయి నావేపు చూచి "అవునూ, ఆ గుండ్ల విషయం తెలుసుకున్నావా ?" అంటూ ప్రశ్నించాడు.

"తెలుసుకున్నాను సలీమ్, ఈ గుండ్లలో కాల్షియం సిలికేట్, సోడియం సిలికేట్, అల్యూమినియం సిలికేట్ వున్నాయి. అందువల్ల గుండ్లు గట్టిగా వుంటాయి."

"అయితే, ఇక ఈ 'క్లయింబింగ్ షూటర్'ను గురించి ఇంగ్లీషులో ఒక మంచి ఆర్టికల్ వ్రాసి ఇవ్వు. నేను దాన్ని 'వరల్డ్ ఎక్వా లైఫ్' పత్రికకు పంపుతాను" అన్నాడు సలీం.

నేను సలీం ఇంట్లో రెండు మూడు రోజులు వుండిపోయాను. ఒక వ్యాసం తయారు చేశాను. అదే పత్రికకు పంపివేసి బొంబాయి చేరుకొన్నాను. మళ్లీ నా పనిలో నిమగ్నమై పోయాను. మా గ్రామాన్నుంచి బొంబాయికి వచ్చే పోయేవారి ద్వారా సలీం ఉత్తరాలు చేరుతూ వుండేయి. 'క్లయింబింగ్ షూటర్' గుడ్లలో ఎన్ని పిల్లలైనదీ, వాటికి తిండి ఏమేమిపెట్టేదీ వగైరా వివరాలన్నీ వ్రాస్తూ వుండేవాడు.

సలీం కొడుకు అబ్బాస్ పెద్దవాడవగానే తన తండ్రి వృత్తిలో దిగాడు. 'క్లయింబింగ్ షూటర్' వ్యాసం ప్రచురణ కాగానే 'జల జంతువుల వైజ్ఞానిక రంగం'లో సలీం పేరు ప్రసిద్ధి పొందింది. ఆ మూడు చేపలతో వాటి సంఖ్యా పెరుగుతూపోయింది.

సుమారు ఆరుమాసాల తరువాత ఒకనాటి సాయంత్రం నాకు సలీం టెలిగ్రాం అందింది. అందులో తన ఒక్కగానొక్క కుమారుడు అబ్బాస్ కనిపించకుండా పోయాడని వుంది. మర్నాడే నేను ఆ గ్రామానికి వెళ్లాను. నన్ను దూరంగా చూడగానే సలీం చిన్న పిల్లాడిలాగా ఏడ్వడం మొదలెట్టాడు.

అబ్బాస్ చేపలు పట్టడానికని సముద్రంలోకి వెళ్లాడట. అకస్మాత్తుగా అతని ఓడ తుఫాన్ తాకిడికి గురిఅయి నీటిలో మునిగి పోయిందట. ఎంతవెతికించినా జాడ తెలియలేదట. కోడలు విధవరాలైంది ఆమె ఆరు నెల్ల కొడుకు తండ్రిలేని వాడయ్యాడు.

ఈ సంఘటన తదుపరి సలీం మళ్లీ సముద్ర చేపల వృత్తిలో దిగవలసి వచ్చింది. కుమారుడికి అప్పగించిన వృత్తిని విధిలేక మళ్లీ తానుచేపట్టవలసి వచ్చింది. కాని ఇంతకు ముందుమాదిరి పరిశ్రమ చేయలేక పోతున్నాడు. దాని ఫలితంగా అంతకు ముందు సంపాదించినదంతా ఖర్చయిపోయింది. రెండు పూటలా తిండిగడవడం కష్టమై పోయింది. విధవరాలైన సలీం కోడలు కూడ కూలిపనికి వెళ్లవలసి వచ్చింది. ఇప్పుడు సలీం వద్ద తన తండ్రి ఇచ్చిపోయిన ఇల్లు తప్ప మరేమీ లేదు.

* * *

ఇంతటి దయనీయమైన ఆర్థిక ఇబ్బందుల్లో కూడా సలీం ఇంత దూరం కేవలం సర్ప గృహం చూడ్డానికి రావటం ఏమీ బాగా లేదనిపించింది. నా మనస్సులోమాట సలీం అర్థం చేసుకొన్నాడు. అపరాధిలాగా సిగ్గుపడ్డాడు. నేను అతణ్ణి ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లోనికి లాక్కెళ్లాను.

"సలీం, అబ్బాస్ కొడుకు ఇప్పుడు పెద్దవాడై వుండవచ్చుననుకుంటాను."

నా ప్రస్తావనతో అతడు నిర్జీవుడై పోయాడు. కళ్ళు చెమ్మగిల్లాయి. నేను ఆతురతతో అతని జవాబుకు ఎదురుచూశాను,

ఒక్కక్షణం అతడేమీ కదల్లేదు. ఆనక నా చేతులు పట్టుకొని "విపిన్, ఆ మలబారు తీరపు ఊళ్లోని వృద్ధుడు చెప్పిన

మాటలు నిజమయ్యాయి 'క్లయింబింగ్ షూటర్స్' నిజంగా మా పైన పగ దీర్చుకొన్నాయి. మా వంశాన్ని నాశనం చేశాయి. మా ఆస్తి పాస్తులను పాడుచేశాయి.......'' అంటూ అంటూ అతని కంఠం పూడక పోయింది. అతడి మనస్సు వికలమై పోయింది. కొంతసేపు స్థిమితపడి ఆనక మళ్లీ చెప్పడం మొదలెట్టాడు. ''అబ్బాస్ చనిపోయిన తరువాత నేను విధిలేక మళ్లీ సముద్ర చేపల వృత్తి చేపట్టవలసి వచ్చింది. కొడుకు చనిపోయిన రెండువ నెలలోనే ఒకనాడు నేను ఉదయాన్నే త్వరత్వరగా చేపలు పట్టడానికి వెళ్లాను. మన ఊళ్లో తాగే నీటికి ఒకే ఒక భావి వున్న విషయం నీకు తెలిసిందే కదా! అబ్బాస్ భార్య తన ఏడునెల్ల పిల్లవాణ్ణి ఇంటిలో ఒంటరిగా వొదిలిపెట్టి మంచినీళ్లకని భావికి వెళ్లింది. మున్నా దోగాడుతూ 'షూటర్స్' వుండే గదిలోకి వెళ్లాడు.''

''కాని ఆ గది తలుపులు ఎప్పుడూ మూసివుండేవి గదా?''

''కాని, ఆ దురదృష్టకరమైన రోజున త్వరగా వెళ్లే ప్రయత్నంలో తలుపులు మూయడం మర్చిపోయాను. అబ్బాస్ భార్య కూడా ఆ విషయం గమనించలేదు ఆవిడ మంచినీళ్ల భావికి వెళ్లిపోయింది. తిరిగి వచ్చే వరకు అర్ధగంట ఎలాగూ పడుతుంది గదా? ఆ అరగంటలో అంతా అయిపోయింది.'' అంటూ బాధగా ఒక్క నిట్టూర్పు విడిచాడు.

''ఏమైంది'' నేను ఆదుర్దాగా అడిగాను.

''ఏమైందని మాత్రం అడగొద్దు. తలుపులు తెరచి వుండడంతో మున్నా దోగాడుతూ 'క్లయింబింగ్ షూటర్స్' వుండే గుంట వద్దకెళ్లాడు. ఆకలితో వున్న 'క్లయింబింగ్ షూటర్స్' వాడిపైన దాడి చేశాయి. వాడిమీద నీటిని చిమ్మాయి. ఆనక గొట్టం గుండా గుండ్లు వొదిలాయి. వాడి తల్లి మంచినీటి బిందెతో తిరిగివచ్చి, పిల్లవాడు వుండవలసిన చోట లేకపోవడంతో గాబరాపడి పోయింది. వెంటనే తెరచివున్న తలుపుల వేపు చూసింది. గదిలోపలికి పరుగెత్తింది. మున్నా గుంటవద్ద స్మారకం తప్పి పడిపోయి వున్నాడట. నీళ్లలో యాసిడ్ వున్నందున వాడి కోమల శరీరంపైన బొబ్బలు లేచాయి. సెప్టిక్ అయింది. మున్నా కన్ను ఒకటి పోయింది. ఆ తరువాత దేవుడి వద్దకు వెళ్లిపోయాడు. ఆ షాక్‌కు వాడితల్లి తట్టుకో లేక పోయింది. ఆమెకు పిచ్చెక్కింది.''

''తర్వాత ? ''

''మున్నా చనిపోయిన రోజున సాయంకాలం ''క్లయింబింగ్ షూటర్స్'' వున్న గుంటలో విషం పోసేశాను'' అంటూ సలీం భోరున ఏడ్చేశాడు.

ఆనాడు మేమిద్దరం మరేమీ మాట్లాడకుండా బొంబాయి దాకా ప్రయాణం చేశాము. నేను చాలా కష్టం మీద అతణ్ణి మా ఇంటికి తోడుకవెళ్లాను. అక్కడ రెండు రోజులు వుంచుకున్నాను. ఆ రెండు రోజుల్లో సలీం ఒకటి రెండు మారులే నోరు తెరచి మాట్లాడాడు. ఒకనాటి ఉదయం నేను సలీంను బొంబాయి సెంట్రల్ స్టేషన్ నుంచి భారమైన మూగ హృదయంతో సాగనంపాను. అతని ముఖాన వేదనతో నిండిపోయిన ముడతలు నేను చూడ లేక పోయాను. వ్యావహారికంగా రెండు సానుభూతి మాటలు చెప్పడాని క్కూడా నోరు తెరవ లేక పోయాను.

సలీంను సాగనంపి ఇంటికిరాగానే నలువేపుల ఉదాసీనత వ్యాపించి నట్లనిపించింది. చదువు కుందామని ఆనాటి వార్తా పత్రిక చేతబట్టుకోగానే మొదటి పేజీలోనే ఒక వార్త చూసి నిశ్చేష్టుణ్ణయి పోయాను. 'వరల్డ్ ఎక్వలైఫ్ సొసైటీ' వారు తమ సర్వ శ్రేష్ఠ అవార్డును సలీంకు ఇచ్చిన సమాచారంతో నా కన్నీటి దృష్టి అంటుక పోయింది.

[ఇది గుజరాతీ కథకి శ్రీ కన్‌హయాలాల్ భాటీ చేసిన హిందీ అనువాదానికి తెలుగు ]

# డాక్టర్. సి. నారాయణరెడ్డిగారి సాహితీ వ్యక్తిత్వము

(25 వ పేజీ తరువాయి)

కవిగా ప్రశంసలందుకోవటమే కాదు. కువిమర్శలను కూడా ఎదుర్కోవలసి వస్తుంది అలాంటి నక్కల అరుపులు లెక్క చెయ్యక్కర్లేదంటున్నారు.

'లోతు ముట్టే ఆలోచన లేనపుడు—
లోపలి సరుకు ఖాళీ అయినపుడు
మిగిలేవేమిటీ ? బూకరింపులు
పళ్ళబిగింపులు; ఊకదంపులు
నక్కలు బొరియల్లో దూరుతాయి
కుక్కలు సందుల్లో మూల్గుతాయి
క్రాంతి మత్తేభాలు మాత్రమే
ఘంటా పథంలో తిరుగాడుతాయి.''
అది నిజం !

వీరి గురించి వీరి మాటల్లోనే చెప్పాలంటే—

''నా పేరు కవి
ఇంటి పేరు చైతన్యం
ఊరు సహజీవనం
తీరు సమభావనం
నా వచనం బహువచనం
నా వాదం సామ్యవేదం
కవిత్వం నా మాతృభాష
ఇతి వృత్తం మానవత్వం —''

[ఈ వ్యాసానికి డా॥ సి. నారాయణరెడ్డిగారి ''ముఖాముఖి''; ''మంటలూ — మానవుడూ;'' ''మనిషీ — చిలక;'' ''ఉదయం నా హృదయం,'' ''ఇంటి పేరు చైతన్యం''; ''మార్పు నా తీర్పు'' వచన కవితా సంపుటాలు ఆధారం —]

## చర్చ

# "ఫాక్ట్స్ ఆర్ సేక్రెడ్, కామెంట్ ఈస్ ఫ్రీ"

**పి రాట్లు**

శ్రీ జ్వాలాముఖి 'సాహిత్యంలో వాస్తవికత' అంటూ 'భారతి' (నవంబరు 77) లో ఒక వ్యాసం ప్రచురించారు. 'చిత్రీకరణ వాదం,' 'రూపం,' 'వస్తువు' వగైరా వాదాలను పరామర్శించారందులో. "స్వాతంత్ర్యోద్యమ కాలంలో గళమెత్తి పాడినవారు, ఆనాటి యుగ ధర్మాన్ని రచనల్లో ప్రతిబింబించినా, ఎలాంటి స్వాతంత్ర్యం రూపొందాలి" అనే విషయంలో నిర్లిప్తులుగా ఉండిపోవడం వల్ల వారు సమగ్రమైన జాతి రచయితలు కాలేకపోయారన్నారు. "రచయిత త్రికాలవేది, క్రాంతదర్శి. జరిగిన అనర్థాన్ని శాస్త్రీయంగా వివేచించడం, నడుస్తున్న చరిత్రను హేతుబద్ధంగా తిప్పడం, రాబోయే సమాజాన్ని జనపథంగా అక్షరీకరించడం, రచయిత, కవి చేయాల్సిన వైతాళిక ధర్మం" అన్నారు. మావో సూక్తులను ఉట్టంకించి, సాహిత్యానికి ఈనాడు కావలసింది వాస్తవికత అనీ, అతిమిత సెంటిమెంట్లకు, వాదాలకు తావీయకుండా సాహిత్య సృష్టి, సోషలిస్టు వాస్తవికత లక్ష్యంగా అభివృద్ధి చెందాలని నిర్ధారించారు.

దీన్ని చూచి 1978 జనవరి 'భారతి' లో నేనొక వ్యాసం వ్రాశాను. రచయిత త్రికాల వేదిత్వము, క్రాంత దర్శకత్వాన్ని గురించి అందులో ప్రస్తావించాను. జ్వాలాముఖి బాధ్యత కలిగిన రచయిత. వి. ర. సం. కార్యవర్గ సభ్యుడు 1971 సెప్టెంబరులో వి ర సం. వారు తమ కార్యప్రణాళికను విడుదల చేశారు. కాబట్టి 1971 సెప్టెంబరు దాకా జరిగిన చరిత్రను పరామర్శించాను. నాటి వరకూ జరిగిన సంఘటనలనూ, వాస్తవాలనూ అజలోకి తీసుకోవడం నాకేమీ కనపడలేదు కాబట్టి, త్రికాల వేదిత్వం, క్రాంత దర్శకత్వం, శాస్త్రీయ వివేచనత్వాలను — ప్రశ్నించాను. మావో సూక్తులనుంచే ఉల్లేఖించాను.

జులై 'భారతి' లో దీనికి అతి దీర్ఘమయిన వ్యాసం సమాధానంగా వచ్చింది. రచనా వ్యాసంగంలో ఒక సూత్రం ఉంది. **'Facts are sacred, comment is free'** అని. నా ఫాక్ట్స్‌ను కాదనలేదు. సమాధానమూ లేదు. కాకపోతే మన 'కామెంటు' వ్యాఖ్యకు, వాస్తవాలకు పొత్తుందా లేదా అనేది సూక్ష్మగ్రాహి అయిన పాఠకుడే చూచుకుంటాడు. రెంటికీ పొత్తు లేకపోతే నేల విడిచి సాము చేయటం లాంటిది.

తిలజలా కమిటీ కార్యదర్శినీ, కామాఖ్య బెనర్జీనీ సాటివారే ఖతం చేశారనేదీ, 1972 లో చారూముజుందార్ మరణిస్తే చైనా ఒక్కముక్క వ్రాయలేదనేదీ, 1974 లో జ్వాలాముఖి వి. ర. సం. నుంచి బయటికి వచ్చారనేదీ — ఫాక్ట్స్. ఇవన్నీ పీడితులు సంఘటిత పడేటంత వరకూ 'నిర్మాణ విషయం' వర్గ పోరాట దృక్పథం లోపించడంవల్ల 'అవకతవకలు' గను, చెడుగాను, తోస్తాయి. వర్గపోరాటం అంగీకరిస్తే అన్నీ గాలి మేఘాల్లా విడిపోతాయనేదీ, విప్లవాన్ని వ్యతిరేకించేవారే అవకతవకల పేరిట కుశంకల్ని లేవదీస్తారనేది వారి వ్యాఖ్య, వారి కామెంటు. "వర్గ పోరాటం" శత్రువుకు సంబంధించిన లక్ష్యమైతే 'పంథా పోరాటం' వర్గపోరాటాన్ని అమలు జరపటానికి సంబంధించిన లక్షణ యుద్ధమవుతుంది" అన్నారు శ్రీ జ్వాలాముఖి.

ఎంత సులభమైన పరిష్కార మార్గం? వర్గ పోరాటాన్ని అంగీకరించు, మార్క్సిజాన్ని నమ్మకో, నీకు కనబడేవన్నీ అంటావా, బెంబేలుపడకు, అవన్నీ కుశంకలు మాత్రమే, ఆచరణలోని లోపాలు ఆచరణ ద్వారానే పోవాలి, పోతాయి కూడా.

భగవంతుణ్ణి నమ్మికో, సర్వం చక్కబడుతుంది, ఒడుదుడుకులకు బెంబేలుపడకు, నిన్ను బెంబేలు పెట్టేవారంతా నాస్తికులే, కుశంకాపరులే — ఇదీ వాదం కాకుండా పోదుగా! వాదమేం ఖర్మ, పరిష్కారమే.

మార్క్స్ చరిత్రనంతా వర్గ పోరాటం ద్వారా సూత్రీకరించాడు ప్రపంచ చరిత్ర నంతా పుక్కిట పట్టాడు. నీవు నమ్మి తీరాలి కాని నా బోటి వారికి సందేహాలున్నాయి. మంచో, చెడో, ఈ దేశానికి క్రీ. పూ. 3000 లేదా 4000 సంవత్సరాల నుండీ చరిత్ర ఉంది. మార్క్సిజం ద్వారా భారతదేశ చరిత్రకు కూడా నీవు అర్థం చెప్పవచ్చు. కాని దీనిమీద డాక్టరు కోశాంబీ

బోటివారే అనుమానాలు వెల్లడించారు. కోశాంబి కూడా, చరిత్ర అంటే..."history is defined as the presentation, in chronological order, of successive developments in the means and relations of production." అని చెపుతూ కూడా సందేహాలు వెల్లడించారు. మార్క్స్ 1859 లో వ్రాసిన 'క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానిమీ' నుంచి ఉదహరించి ఇలా అంటాడు. "We shall at times have to reconstruct the material changes from what survives as marks upon the ideological superstructure, but let it be noted that Marxism is far from the economic determinism which its opponents so often take it to be......The really vexed question is what is meant by the Asiatic mode of production, never clearly defined by Marx. Asia is dominated culturally by China and India..."

తరువాత "కాపిటల్" నుంచి ఉదహరించి ఇలా అంటాడు: "Similarly, we cannot let pass without challenging Marx's statement "Indian society has no history at all, at least no known history. What we call its history is but the history of successive intruders who founded their empires on the passive basis of that unresisting and unchanging (village) society." IN fact, the greatest periods of Indian History, the Mouryan, Satavahana, Gupta owed nothing to intruders; they mark precisely development of new trade centres," 1

ఇంతకూ కోశాంబీ "ప్రొఫెషనల్ హిస్టారియన్" కాదు. ప్రముఖ గణిత శాస్త్రవేత్త, ప్రముఖ మార్క్సిస్టు కూడా.

## సాహితీ రంగం

చైతన్యవంతులయిన కవులూ, రచయితలూ, కళాకారులూ భావ విప్లవానికి ఆద్యులు, ఎవరూ కాదనరు. వైతాళికుడైన కవి, ఉద్యమకారుడు కాకపోయినా ఉద్యమానికి పుష్టినిస్తాడు. విప్లవంలో సాంస్కృతిక రంగం పోరాటరంగానికి దోహదకారిగా ఉంటుంది. ఇదివరకటి వారెవరూ విప్లవ నిర్మాణం, ఉద్యమ నిర్వహణ కొనసాగించలేదు ఉద్యమాలకు దోహదపడ్డారు. విప్లవ పరిస్థితినిబట్టి, పోరాట విస్తృతినిబట్టి రచయిత, కవి తీరంలో మాత్రమే ఉండి, పోరాట నిజాన్ని అక్షరీకరించలేరు. తీరంలో ఉండక ప్రవాహంలో దుముకుతాడు. ఇదీ నిజమే. తాను నమ్మిన ఆదర్శం కోసం ప్రవాహంలోనికి దూకి త్యాగం చేసే వ్యక్తులంటే, పిరాట్లకు సర్వదా గౌరవమే.

కాబట్టే వారి నా త్యాగానికి పురిగొల్పిన ఆదర్శాన్ని నాశక్తి కొలదీ పరిశీలించి, అర్థం చేసుకొని, నా అభిప్రాయాలకు వేనొచ్చి ఈ క్రింది విధంగా వ్రాశాను: "రాజకీయనాయకుల లక్ష్యాలలోని మంచికి రూపమివ్వటం మంచిదే. కాని ఆ లక్ష్యాలలోని అవకతవకలకూ, చెడుకూ బాధ్యులెవ్వరు? వాళ్ళ మంచి పొగడి, భుజం తట్టి, వాళ్ల చెడుపట్ల కళ్లు మూసుకుని వాళ్లలో దుర్భ్రమ కలిగించటమేనా రచయిత బాధ్యత? మార్క్సియన్ సోషలిజం పేరుతో, సోషలిస్టు వాస్తవికత పేరుతో జరిగిందే" అని ఊరుకోకుండా రెండు పేజీల సంఘటనలనిచ్చి ఇలా వ్రాశాను: "సాయుధ విప్లవాన్ని సపోర్టు చేసిన ఏ రచయితా ఈ ధోరణిని అరికట్టలేకపోయాడు ఈ అనర్థాన్ని 'శాస్త్రీయంగా నివేచించ' లేకపోయాడు, తరువాతి చరిత్రను 'హేతుబద్ధంగా' తిప్పలేకపోయాడు."

ఇది విప్లవ రచయితను నిందించటమా, విమర్శించటమా?

నేను కార్యాచరణలో అవకతవకలున్నాయి కాబట్టి దాన్ని కాదని రచనలు చేయమనడం లేదు.

ఎవరి నమ్మకాన్నిబట్టి వారు రచనలు చేస్తారు. వాస్తవిక పేరుతో వ్యాసం మొదలయింది కాబట్టి, రచయితకు కొన్ని బాధ్యతలను, కొన్ని ధర్మాలను ఇచ్చారు కాబట్టి – 1971 దాకా జరిగిన సంఘటనల నిచ్చి, ఎంతవరకు రచయిత తన బాధ్యతను నిర్వర్తించాడని ప్రశ్నించాను – ఈనాడూ అదే ప్రశ్నిస్తున్నాను.

"విప్లవకారుల కేంద్రం" ఒకటి మొదట్లో ఏర్పడింది. తద్వారా విప్లవ పార్టీ ఏర్పడాలనే ప్రయత్నం జరుగుతుండగా మహా దుందుడుకుగా చారూముజుందార్ విప్లవాభివృద్ధిక్రమాన్నే గల్లంతు చేశాడు. మార్క్సిస్టు – లెనినిస్టు పార్టీని ఏర్పరచాడు 'సాయుధ పోరాటం' (Armed struggle) అంటే 'సాయుధ సంఘర్షణలు' (Armed clashes) గా చిత్రించి, కుట్ర పద తులలో 'ఖతం' కార్యక్రమాన్ని సిద్ధాంతీకరించాడు ... ఆయన 'చైనా ఛైర్మన్ మన ఛైర్మన్' సూత్రం సరైందికాదని అందరూ అంగీకరించారు. 'సాంస్కృతిక విప్లవం' పేరిట జరిగి 'లైబ్రరీ దహనకాండను' అందరూ సమర్థించలేదు..."

"మార్క్సియన్ సోషలిజం పేరిట సోషలిస్టు వాస్తవికత పేరుతో జరిగిందిదే" అని (పిరాట్ల) నిర్ధారించారు. కాని వాస్తవం అదికాదు. వ్యక్తిగత హింసావాదాన్ని విప్లవ పోరాటంగా చిత్రించే అంశాన్ని, చారూముజుందార్ 'ఖతం' కార్యక్రమాన్ని సమర్థించే విప్లవ రచయితల సంఘం వైఖరితో విభేగించి 1974లో మేము కొందరం రాజీనామా ఇచ్చాం. అయినా విప్లవమే పరిష్కార మార్గమంటున్నాం..."

ఇంకా కొన్ని వాస్తవాలు తెలుసుకుందాం. ఇవి జరిగినవి, ఇప్పటికే చరిత్రలో చేరినవి. 1969 మేలో ముజుందార్ మార్క్సిస్టు, లెనినిస్టు పార్టీ నేర్పరిస్తే, దానికి దాదాపు రెండు సంవత్సరాలకు ముందే 'గిరిజన ఉద్యమాలు' ప్రారంభమయ్యాయి. 1967 అక్టోబరు, 1968 అక్టోబరు, 1969 ఒలో కొన్ని ఘటనలు, 1969 ఫిబ్రవరిలో గుత్తికొండబిలం సమావేశం (దీనికి చారూముజుందార్ హాజరయ్యాడని చెప్పబడుతుంది) –

తరువాతనే మార్క్సిస్టు, లెనినిస్టు పార్టీ 1969 డిసెంబరు ప్రాంతాలలోనే సుబ్బారావు పాణిగ్రాహి మరణించాడు. 1970 జులైలో వి. ర. సం. ఆవిర్భవించింది. తాత్కాలిక కార్యవర్గంలో జ్వాలాముఖి సభ్యులు.

ఇంత గత చరిత్రతో, 'దుందుడుకుగా' 1969 మేలో ఉద్భవించిన పార్టీ, అక్టోబరులోనే 'చైనా ఛైర్మన్ మా ఛైర్మన్ చైనా మార్గమే మా మార్గం' అని వ్రాసుకొని, 'ఖతం' కార్యక్రమాలను అమలు జరిపితే, ఆ కార్యక్రమ సృష్టికర్త అయిన ముజుందార్ 1972 లో మరణిస్తే, 1974 జనవరిలో జ్వాలాముఖి రాజీనామా ఇచ్చారు. 'ఖతం' కార్యక్రమ సిద్ధాంతీకరణ **కూడా** కార్యాచరణలో వచ్చే ఒడుదుడుకు కాదా ? లేక చారూముజుందార్ బోటి 'స్వార్థపరుడు చొరబడి విప్లవగమనాన్ని ప్రక్కదారి'పట్టించాడా? ఆచరణలోని లోపంగా ఆచరణలోనే పోదా? నా**బో**టి వాడికది అవకతవకగా కనపడవచ్చు గాని,. వర్గపోరాటం అంగీకరించిన జ్వాలాముఖికి కూడా **ఈ** లోపం గాలిమేఘంలా విడిపోలేదా ?

ఇంకొకవైపు జ్వాలాముఖి సుబ్బారావు పాణిగ్రాహిని పొగుడుతారు. (పాణిగ్రాహిత్యాగాన్ని నేను సందేహించటం లేదు సుమా!) కాని పాణిగ్రాహి కూడా 'దుందుడుకు'గా ముజుందార్ స్థాపించిన పార్టీతోనే చేతులు కలిపి, కార్యక్రమాలు నడిపి, తన జీవితాన్ని త్యాగం చేసిన వ్యక్తే గదా! అదే కొలబద్ద**తో** చూస్తే పాణిగ్రాహి కార్యక్రమం కూడా దుందుడుకుది కాదా ? నాకు గాలిమేఘాల్లో విడిపోక మేఘాలు ఇంకా దట్టమవుతున్నాయి సుమా !

విప్లవం వైపు నిలుచుని దాన్ని అభివృద్ధి చేయాలనే ఉత్కంఠతో ఆచరణలో జరిగే పొరపాట్లను ఎత్తిచూపటం వేరు, మొత్తం విప్లవాన్నే కాదనే రీతిలో విప్లవ కార్యాచరణను విమర్శించడం వేరు పిరాట్ల కోరేదేమంటే విప్లవ కార్యాచరణలో అవకతవకలున్నాయి కాబట్టి, దాన్ని కాదని కొట్టి**వేస్తూ** రచనలు చేయాలని, రైలొకమారు పట్టాలు తప్పింది కాబట్టి రైలు ప్రయాణం పనికిరాదనే వారివాదనా సారాంశం.

పొరపాట్లు అనే విషయం ఒప్పుకుంటే అది ఎవరు ఎత్తిచూపినా ఒక**టే**. కాకపోతే అంతవరకూ గిరికి అటువైపు నుంచుంటే అవి పొరపాట్లే అనిపించలేదు, 74 జనవరి తరువాత గిరికి ఇటువైపు వచ్చేటప్పటికి అవి పొరపాట్లు, 'దుందుడుకుతనం' అయిపోయాయి. వాస్తవాలు మారలా, మన దృష్టే మారింది, మన వివరణ మారింది. ఫాక్ట్స్, ఫాక్ట్స్ గానే ఉన్నాయి. మన కామెంటు మారింది.

ఆలోచన, ఆచరణల సమన్వయమే మార్క్సిజం అయితే, ఆచరణలో ఘోరంగా, అతిగా తప్పిదాలు జరిగితే, అది కొంత వరకైనా ఆలోచనలోని లోపమేనని చెప్పటమే పొరపాటా ?

పిరాట్ల వాదనా సారాంశం రైలొమారు పట్టాలు తప్పింది కాబట్టి, రైలు ప్రయాణం పనికిరాదని కానేకాదు. పిరాట్ల వాదమల్లా మీరు చెప్పే గమ్యానికి ఈ రైలు చేర్చనే చేర్చదు సుమా అనే !

"1946–51 దాకా సాగిన తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటాన్ని, శ్రీకాకుళ గిరిజనోద్యమాన్ని, నక్సల్ బరీ తిరుగుబాటును సరిగ్గా అంచనా వేసుకొన్నాకే, దేశపరిస్థితుల్ని, పాలకుల దళారీ స్వభావాన్ని, సామ్రాజ్య వాదాల వైరుధ్యాన్ని, ఐక్యసంఘటనా వ్యూహాన్ని ఆలోచించగలిగినప్పుడే, ఒక పార్టీ, ఒక కార్యాచరణ ఏర్పడ గలదు. అంతవరదాకా ఈ 'పంథా పోరాటం' కొనసాగవలసిందే. ఇది శ్రీ పిరాట్ల వారికి అర్థంకాని ఆల్జీబ్రా" ఇంతవరకూ ఎవరైనా వీటిని అంచనాలు వేసుకోక, ఆలోచించక తమ కార్యాచరణను ఏర్పరుచుకున్నామని చెప్పారా? ఎన్నికల రంగంలో పాల్గొన్న సత్యనారాయణసింగ్ నుండి, తుపాకీ క్రిందపెట్టమన్న కొండపల్లి శీతారామయ్య, తుపాకీని భుజం మీదే ఉంచుకోమంటున్న రవూఫ్ వర్గం, ఇంతా రమణారెడ్డి వర్గం వరకూ—వీరందరికీ ఎవరి అంచనాలు వారికున్నయ్యి ఎవరి కార్యాచరణ వారికుంది.

## 'ఎల్లల భక్తి'

రష్యా, చైనాలకు కమ్యూనిష్టు ఉద్యమ నిర్మాణం గురించి ఉన్న భేదాలతో నాకు నిమిత్తంలేదు. అలాగే జన చైనా యొక్క మూడు ప్రపంచాల సిద్ధాంతంతోనూ నిమిత్తం లేదు. ఎవరి అంచనాలు వారి కుండవచ్చు. ఇక'ఎల్లలదేశభక్తి'ని కూడా పరిశీలిద్దాం.

నేను చారూముజుందార్ యొక్క డిసెంబరు 1970 వ్రాతల నుండి ఉదహరించాను. దానిలో చైనాను ఎవ్వరో ముట్టడించే ప్రమాదముంది కాబట్టి మనలను కందకాలు త్రవ్వుకో మన్నాడన్నాను. దీనికి మీవ్యాఖ్యను మీరివ్వవచ్చు.

మీ దృష్టిలో ఇది "జనవిప్లవానుభవాల్ని పరిగణన లోనికి" తీసుకోవడమయింది. ఈ పరిగణన సరైనదే. అలాగే ప్రపంచ విప్లవ కేంద్రాన్ని రక్షించడ మంటే ప్రపంచ పీడిత మానవాళిని సమాయత్తం చేయడం. 'అమెరికా న్యూక్లియర్ గొడుగు'ను కోరే వారికి చైనా వానలు గుర్తొస్తాయి. భారతదేశంలో దోపిడీ వడగళ్ళవాన పడ్డా రక్షణ వద్దంటారు. అమెరికాను ఆశ్రయించమంటారు శ్రీ పిరాట్ల వారు భూస్వామ్య వ్యామోహాన్ని దేశభక్తిగా చిత్రిస్తూ, దేశప్రజల్ని, వారి స్థితిగతులను విస్మరించే 'ఎల్లల భక్తి' ని అమెరికా సామ్రాజ్యవాదం క్రింద పెంచదలిస్తే విప్లవకారులు ఈ కుట్రల్ని భగ్నం **చేస్తూ**... ..." ఈ వ్రాత నావిమర్శకు సమాధానమా? లేక ఉక్రోషం**తో** వాపోవటమా! ఎవరు అమెరికను ఆశ్రయించ మంటున్నారు? ఎవరు దోపిడీ వడగళ్లవాన నుంచి రక్షణ వద్దంటున్నారు? 'చైనా అధ్యక్షుడే మా అధ్యక్షు' డనటం విప్లవాభివృద్ధి క్రమమై, నేనిలా వ్రాశారు సుమా అనటం**తో** నాదిభూస్వామ్య వ్యామోహిత దేశభక్తా ?

మళ్లీ **మొ**దటి కొస్తున్నాం. వాస్తవాలను కాదనలేక వ్యాఖ్యను కూడా మానివేసి—ఏదేదో వ్రాస్తున్నాం.

ఇంతకూ 'ఎల్లలభక్తి' చైనాకులేదా? మన సరిహద్దు తగాదాల నవతల ఉంచినా, చైనా రష్యాల సరిహద్దు ఘర్షణలు, కొన్ని వేల మంది సైనికుల నక్కడ ఉంచటం ఎందుకో? నేటి నూతన ధోరణి'యూరోకమ్యూనిజం'కు 'ఎల్లల దేశభక్తి'కి కొంతవరకైనా సంబంధం లేదా ?

మూడవ ప్రపంచంలో అజేయశక్తిగా రూపొందిన జనచైనాను చుట్టివేసే వ్యూహంలోనే 'బంగ్లాదేశ్' ఆవిర్భావం జరిగింది. ఏ దేశ ప్రజలు ఆ దేశ భవితవ్యాన్ని నిర్ణయించుకోవాలి కాని పరాయి శక్తుల ప్రమేయం ఉండరాదని జనచైనా నాడు ఎలుగెత్తి చాటింది ...భారతదేశంలోని పెట్టుబడి దార్లకు మార్కెట్లు కావాలి. ఆక్రమంలోనే బంగ్లాదేశ్ సిక్కింలు ఉపయోగ పడ్డాయి దానిని గ్రహించి అక్కడి వారు భీష్మించుకు కూర్చున్నారు......బంగ్లాదేశ్ అగ్రరాజ్యాల నాలుగు స్తంభాల ఆటలో 'మనం' దొంగలం చేయబడ్డాం. యాహ్యాదురంతాలను ఖండించటం వేరు, ఆ కోపంతో పళ్లు కొరుక్కోవటం వేరు. అస్తమానం పాకిస్థాన్ విద్వేషంతో ఆలోచిస్తే మిగిలేది చచ్చిన పావుకాయే (బంగ్లాదేశ్)''

ఎటువంటి విశ్లేషణ! వాస్తవాలను మరిసించి, మసిబూసి మారేడుకాయ చేయదలుచుకుంటే, ఇంతకంటే చక్కని ఉదాహరణ దొరకదేమో!

1971 మార్చి 25 నుంచే ఘోరదారుణకాండ బంగ్లాదేశ్‌లో మొదలయింది. దానిని గురించి దాదాపు ప్రపంచానికి తెలియదు. తెలిసినా స్వార్థం కోసం అగ్రరాజ్యాలు పట్టించుకోలేదు. ఏప్రిల్ 14న లండన్, 'సండేటైమ్స్' విలేఖరి ఆంథోనీ మాస్కర్ హెన్స్ ఢక్కా పోయాడు. పోయి ఏమి చూశాడు?

"What I saw in East Bengal was to be more outrageous than anything I had read about the inhuman acts of Hitler and the Nazis".ఇంకాఏమంటాడు?

"The world knows why 80, 00, 000 Bengali men, women and children have fled across the border to India? Why at least half a million pepole have died. why countless others now face the grim prospect of death by famine and disease "

తరువాత మేలో లండన్‌పోయి, 'సండేటైమ్స్' పత్రికాధిపతులను కలిసి తన భార్యా బిడ్డలను లండన్ తెచ్చుకుని, జూన్ 13న పాకిస్థాన్ దారుణ మారణ కాండను ప్రథమంగా ప్రపంచానికి బహిర్గతం చేశాడు.[2]

ఇటువంటి వాస్తవాల ముందు, జనచైనాను చుట్టివేసే వ్యూహంలోనే 'బంగ్లాదేశ్' ఆవిర్భావం జరిగిందనటం నిజంగా సాహసమే. ఎవరు చుట్టివేయదలుచుకుంది ? భారతదేశమా ? దాదాపు సంవత్సరంపాటు కోటికి మందికి పైగా శరణార్థులను, తరువాత పాకిస్థానీ సైనికులను మేపటమా దానికి లాభం? మనం జనచైనాను చుట్టివేయ దలుచుకుంటే, మనకు బంగ్లాదేశీయులు పావులుగా ఉపయోగపడి, మన కోసం మిడతల్లాగా చనిపోయారు— అంతేనా ? లేక జనచైనాను చుట్టివేసేందుకే — తమ స్వాతంత్ర్యం కోసం కాదు సుమా — ఇంత దారుణ రక్తపాతంతో బంగ్లాదేశ్ ఆవిర్భవించింది, అంతే. యాహ్యా దురంతాలను మనం ఖండించాలి, అంతే, దానితోనే మన దేశానికి వచ్చిన వారంతా తిరిగి తూర్పు బెంగాల్ వెళ్లిపోయేవారు. మన ఖండనతో యాహ్యా దమనకాండకు స్వస్తి చెప్పేవాడు. అసలిదంతా బంగ్లాదేశీయుల స్వాతంత్ర్య పోరాటం కానేకాదు, కేవలం ఇతరుల వ్యూహంలో భాగం మాత్రమే.

నేనేం వ్రాశాను ? ''లక్షలాది ప్రజల మారణహోమం మన దృష్టిలో నేరం కానేకాదు. మాతో ఏకీభవించని వారి పోరాటం పోరాటమే కాదు. కాబట్టే బంగ్లాదేశ్ అవతరణ సందర్భంగా జరిగినదంతా ఆషిన్ ఛటర్జీ దృష్టిలో చైనాకు వ్యతిరేకంగా అమెరికన్ 'ఇంపీరియలిష్టులు' సోవియట్ 'రివిజనిష్టులు', ఇండియన్ 'రియాక్షనరీ'ల కుట్ర మాత్రమే ...'' అంటూ చారూ ముజుందార్ కూడా ముజిబూర్ రహ్మాన్‌ను వర్ణించిన విధమిచ్చాను.

మనం చర్య జరిపింది మన పెట్టుబడిదార్ల మార్కెటు కోసం — అది గ్రహించి అక్కడివాళ్లు భీష్మించుకు కూర్చున్నారు. ఎంత సులభంగా చెప్పగలిగారు.

ఇలా వ్రాయటం అక్కడి సంగతులు తెలియకా, తెలుసుకుందామని లేకా, లేక తెలిసినా అలాగే వ్రాయదలిచి వ్రాయటమా? తెలుసుకో దలుచుకుంటే విషయాలు తెలుస్తాయే.

1971 ఏప్రిల్ రెండవ వారంలోనే, కొమిల్లా జిల్లాలో బంగ్లా విముక్తి ప్రభుత్వం ప్రమాణస్వీకారంచేసింది. నవంబరులో భయంకరంగా యుద్ధం సాగుతుండగానే, దానిని ధ్వంసం చేసేందుకు బంగ్లాదేశ్ విదేశాంగ శాఖ కార్యదర్శి అధ్వర్యాన యుద్ధాన్ని వెన్నుపోటు పొడిచే ప్రయత్నాలు మొదలయ్యాయి.[3] ఎప్పుడయితే బంగ్లాదేశ్ ఆవిర్భావం అనివార్యమని తెలిసిందో అప్పుడే అమెరికన్ సోదరులు అటు పాకిస్థాన్‌కు వత్తాసిస్తూనే, రెండోవైపు ముజీబ్ నగర్ ప్రభుత్వంలో దూరి విధ్వంసాలకు పునాది వేయసాగారు.[4]

మన హైకమీషనరు సుబిమల్‌దత్తా కోరికమీద భారత ప్రభుత్వం మనదేశంలో చీరెలు కొనేందుకు బంగ్లాదేశ్‌కు 5 కోట్ల రూపాయల గ్రాంటిచ్చింది. అనుభవజ్ఞులైన అధికారుల బృందం ఢక్కానుంచి వచ్చి మన దేశంలోని కలకత్తా, బొంబే మిల్లులను దర్శించారు చివరకు చీరెలకు బదులుగా పెద్దరకం తువ్వాళ్ళు, తక్కువరకం చీరెలుకొని మిగతాది స్వాహాచేశారు. ఇవి బంగ్లాదేశ్ చేరటంతోనే, భారతందేశం బంగ్లాదేశ్‌ని దోపిడీ చేస్తున్నదంటూ, ముజీబ్ వ్యతిరేకులు ప్రచారం మొదలుపెట్టారు. స్వాహాచేసిన అధికారులు తందానతాన అన్నారు. చివరకు ముజిబుర్ రహ్మాన్, సుబిమల్ దత్తాను పిలిపించి యదార్థాలు తెలుసుకున్నాడు.

ఇంకొక ప్రబుద్ధుడు మౌలానాభషానీ 9 నెలలు కలకత్తాలో సుఖంగా గడిపాడు. భారత వైమానికదళ విమానంలో, గాలి

మార్పుకోసం, నైనిటాల్, ముస్సోరీ, డెహ్రాడూన్‌లలో గడిపాడు. మనదేశంలో ఉంటూ మావోకూ, చౌఎన్‌లాయ్‌కూ బంగ్లాదేశ్ స్వాతంత్ర్య సమరంలో సహాయం చేయాలంటూ ఉత్తరాలు వ్రాశాడు. బంగ్లాదేశ్ ప్రభుత్వ మేర్పడిన మూడు వారాలకు తాపీగా తనగ్రామం టాంగెల్‌పోయి చూచుకుంటే, తన ఇల్లు పాకిస్థానీ సైనికులచేత నేలమట్టం చేయబడింది. మన హైకమీషనర్ సుబిమలదత్తాను వచ్చి కలుసుకోమని ఉత్తరం వ్రాశాడు ఆయన ఇంకొక ఉన్నతాధికారి చంద్రశేఖరదాస్‌గుప్తాను పంపాడు. ఇది జరిగింది 1972 మార్చిలో.

ఇంతకూ భషానీ కోరిక ఏమిటి? తన ఇల్లు మరమ్మత్తు నిమిత్తం ఎలభైవేల రూపాయలు, 30 టన్నుల సిమెంటు, ఇనుము భారత ప్రభుత్వ మివ్వాలని. గుప్తా తిరిగి వచ్చిన తరువాత దత్తా భషానీకి ఉత్తరం వ్రాశాడు. బంగ్లాదేశ్ ఇప్పుడు స్వతంత్ర రాజ్యమనీ, ఇంకో విదేశీ పౌరునికీ విధంగా సహాయం చేయటం భావ్యం కాదనీ, బంగ్లాదేశ్ ప్రభుత్వం గనుక అడిగితే తప్పక ఆలోచిస్తామనీ వ్రాశాడు. అప్పటినుంచీ భషానీ భారతదేశంమీద విషం కక్కుతున్నాడు. అలాగే 1975లో అత్యవసర పరిస్థితిని ప్రకటించి, అవామీలీగ్‌ను రద్దుచేసిన తరువాత, తాను తన గ్రామంలో పెట్టబోయే ఇస్లామిక్ విశ్వవిద్యాలయానికి ఆర్థిక సహాయం చేస్తామని ప్రభుత్వం మాట ఇచ్చిన తరువాత, భషానీ అత్యవసర పరిస్థితిని సమర్థించాడు

అత్యవసర పరిస్థితికాలంలో జనపనార మిల్లులను ప్రభుత్వం తీసుకుంటే, జనుము అంతా భారతదేశానికి దొంగరవాణా అవుతుందని ప్రచారం మొదలయింది.

రష్యాకూడా ఊరుకోలేదు. ముజీబ్ సలహాదారుగ, షేక్ మణి[5] రాత్రికి రాత్రే రెండు దినపత్రికలకు అధినాథుడయ్యాడు.

రానురాను ముజీబ్ బలహీనతతో, అసమర్థతతో మన వాణిజ్య సంధులకు విలువలేకుండా పోయింది. గోదాములలో న్యూస్ ప్రింటు మూలుగుతూ ఉంటే, మన దేశానికి మట్టుకు ఎగుమతి చేయలేదు. జనపనారను కావాలని ధ్వంసంచేయటం, హిల్సాచేపలను పూడ్చిపెట్టటం జరిగింది, పైగా భారతదేశంమీద దుష్ప్రచారం మొదలయింది [6]

ఇక జనచైనా సంగతి. బ్రిటిష్ చరిత్రకారుడు హెన్స్టెన్ లాంబ్ ప్రకారం, ఒక దశలో తనే స్వయంగా రంగంలోకి దిగుదామను కుందంటాడు. ముజీబ్ హత్యానంతరం వారం లోపుగానే, చైనా బంగ్లాదేశ్‌ను గుర్తించింది.[7] ఇప్పుడు బంగ్లాదేశ్‌లో తన ప్రభావంకోసం విపరీతంగా ఆదుర్దా పడుతున్నది.

ఏ దేశ ప్రజలు వాళ్ల భవిష్యత్‌ను వాళ్లు నిర్ణయించుకోవాలి. ఇతరుల ప్రమేయం పనికిరాదు. నిజమే. చక్కటి ఉవాచ. ఆచరణలోనే వస్తుంది ఇబ్బందంతా. హంగరీ, జెకోస్లవేకియాలలో రష్యన్ కమ్యూనిజం సాయుధంగా ఎందుకు జోక్యం చేసుకుంది? అప్పుడు చైనా కమ్యూనిష్టులేమైనా నోరు మెదిపారా?

ఇప్పుడు ఆలోచిస్తే తెలుస్తుంది, మనం పాకిస్థాన్ మీది విద్వేషంతో ఆలోచించామో లేక ఆత్మరక్షణ కోసం ఆలోచించామో! ఆ చర్య తీసుకున్నందుకు అప్పుడు శ్రీమతి ఇందిరాగాంధీని అభినందించటంలో తప్పుందా? ఆమె ఏమనుకున్నా, వాజపేయి దృష్టిలో ఆనాటి ఆమె చర్య భారతప్రజల మనోవాంఛను సిద్ధింపచేసింది మనలో మనకు ఎన్ని రాజకీయ భేదాలున్నా, దేశాభివృద్ధి, దేశరక్షణ విషయంలో అంతా ఒకటే. ''వయం పంచాధిక శతం.''

ఇటువంటి 'బాక్‌గ్రౌండ్' ఉంది కాబట్టే నేను ''మరి ఇదంతా ప్రతి సంఘటననూ, ప్రతి విషయాన్ని—అది మన దేశానికి సంబంధించినా లేక విదేశాలకు సంబంధించినా—చైనా అద్దాలతో చూడటం కాదా!'' అని అంటే తప్పా?

చైనా ఆల్జీబ్రానే అర్థంచేసుకోగల శ్రీ జ్వాలాముఖికి ఇండియన్ జామెట్రీ అర్థం కాక పోవటంలో ఆశ్చర్యంలేదు.

కాకపోతే ఈవాడు శ్రీ జ్వాలాముఖి., అమెరికన్ 'ఇంపీరియలిష్టులు', సోవియట్ 'రివిజనిష్టులు', ఇండియన్ 'రియాక్షనరీల'కు తోడుగా, 'ఇండియన్' కాపిటలిష్టుల'ను కూడా కలిపారు, అంతే.

ఈ పరిస్థితులలో మార్క్సిజం ప్రసాదించింది జ్ఞానచక్షువో లేక చత్వారచక్షువో లేక చైనాచక్షువో పాఠకులే తేల్చుకోగలరు.

## 'ఇచ్ఛావర్తనం'

తరువాత శ్రీ జ్వాలాముఖి అనేక విషయాలను కలగా పులగంగా పరామర్శిస్తూ, కొంతమంది పేర్లను ఉదహరిస్తూ గాలిలో బాణాలు విసిరారు. ఒక్కొక్కదానికి ఒక్కొక్క వ్యాసం సమాధానమవుతుంది. అందుకని క్లుప్తంగా మాత్రమే వాటిని తడవటం జరుగుతుంది.

''డాక్టరు. రాంమనోహర్‌లోహియా గారికి సమాజం విషయంలో ఒక నిర్దుష్టమైన దృక్పథం ఉంది'' అన్నారు. నిజమే, కాని అది శ్రీ జ్వాలాముఖి గారి దృక్పథం కంటె పూర్తిగా విభిన్నమైందే కాదు వ్యతిరేకమైంది కూడా అని గుర్తుంచుకుంటే చాలు.

ఆయన సోషలిజం జ్వాలాముఖిగారి మోడల్ కానే కాదు.

డాక్టర్. అంబేద్కర్ బహిరంగంగా ''మనుస్మృతి''ని దహించా , కాదనటం లేదు. అది ఆయన నేడు అమలు జరపబడే హిందూ కుల వ్యవస్థ మీద చేసిన దాడి, అంతేకాని, 'మనుస్మృతి' దహినం అంబేద్కర్‌ను శ్రీ జ్వాలాముఖి ఊహించే మరియు ఆశించే సోషలిష్టులేదా కమ్యూనిస్టు సమాజ ఆరాధకుణ్ణి చేయదే! ఇంత చేసిన హిందూ సమాజం పట్ల కూడా ఆయన దృష్టి ఉదారంగానే ఉంది, కాబట్టే తాను బౌద్ధునిగా మాత్రమే మారతానన్నాడు. ధనంజయకీర్ వ్రాసిన అంబేద్కర్ చరిత్ర చదివితే ఈ విషయాలు అవగతమవుతాయి.

ఇంతెందుకు, నేపాల్ రాజధాని ఖాట్మాండులో బుద్ధుని 2500వ జయంతి సందర్భంగా అంతర్జాతీయ బౌద్ధమహాసభలోని

ఆయన ఉపన్యాసం "బుద్ధిజం అండ్ కమ్యూనిజం" అని. అలాగే మహాబోధి సొసైటీ ఆధ్వర్యాన ఢిల్లీలో 1956 ఫిబ్రవరి 5న చేసిన ప్రసంగంలో కూడా కమ్యూనిజంతో తనకు గల వ్యతిరేకతను ఆయన సుస్పష్టం చేశాడు.

ఇక వివేకానందస్వామి ప్రబోధం సంగతి, ఆయన సామ్యవాదం సంగతి ఆలోచిద్దాం. నాకు 1975లో మాయావతి ఆశ్రమం వారు ప్రచురించిన 'కులము, సంస్కృతి మరియు సోషలిజం' (ఆంగ్ల గ్రంథము) దొరికింది. దాని ముందు మాటలో, సుమారు 20 సంవత్సరాల క్రితం, సోషలిజం మీద వివేకానందస్వామి అభిప్రాయాలంటూ ఒక పుస్తకం ప్రచురింపబడిందనీ, దాని అట్టమీద స్వామి వివేకానంద మాటలుగా "నేను సోషలిష్టును" అని పెద్ద అక్షరాల్లో ముద్రించబడిందనీ, ఇది కొంత ఉత్సుకతని రేపిందనీ, కాని వివేకానంద సాహిత్యాన్ని చదివిన వారికి ఇది ఆయనను అతిగా చిత్రించటమని తెలుసనీ అంటారు. (.......but pepole steeped in the Vivekananda lore could easily see that the picture was over coloured.) అయితే స్వామీజీకి పాశ్చాత్య ప్రపంచంలోని ఈ ఉద్యమాలతో, వాటి సాహిత్యం ద్వారా, కొంత మంది వ్యక్తుల ఎరుక ద్వారా పరిచయముందనీ, 1900లో పారిస్ అంతర్జాతీయ ప్రదర్శనలో పీటర్ క్రాపోట్కిన్‌ను కలిశారనీ, అయితే స్వామీజీ సమీప భవిష్యత్తులో ఒక విధమైన సోషలిజం రాక తప్పదనీ, భవిష్యత్తులో శూద్రులు శూద్రులుగా పాలకులవుతారనీ ఆనాడే అనటం చెప్పుకోతగిందని అంటారు సంపాదకులు.

స్వామివారి వివాదం 'కులం నుంచి సంస్కృతి ద్వారా సోషలిజం' లాగా కనపడుతుందనీ, వివేకానందుల సోషలిజం ప్రకారం, అందరూ అప్పుడు నిజమైన బ్రాహ్మణులవుతారని అంటారు సంపాదకులు.[8] స్వామివారి ప్రసంగాలు, రచనల్లో నుంచి, అంటే 8 సంపుటాల్లో నుంచి — కొన్ని కొన్ని భాగాలను తీసి ఒక సంపుటిగా 'కాస్ట్, కల్చర్ అండ్ సోషలిజం' పేరుతో ప్రచురించారు. ఇందులోని ఆరవ పకరణమే 'నేను సోషలిష్టును' అన్నది.

దురదృష్టవశాత్తు, ఈ భాగాలను తీయటమే, నామట్టుకు నాకు, కొన్నిచోట్ల అసంతృప్తిగా ఉంది. కారణమేమిటంటే అర్థానికి దీనివల్ల, అనర్థం జరిగింది. శ్రీ జ్వాలాముఖి ఉదహరించిన భావాలు ఆ కోవలోకి జేరతాయి. ఈ భాగాలు స్వామీజీ మిస్ మేరీ హేల్‌కు వ్రాసిన ఉత్తరంలోని భాగాలు. ఆ ఉత్తరం, 6వ సంపుటంలో, 'ఎపిజల్స్' అన్న పేరుతో ప్రచురించబడిన వారి ఉత్తరాలలో కనపడుతుంది.

14 గ్రేకోట్ గార్డెన్స్, వెస్ట్ మినిస్టర్, లండన్ నుంచి ఆ ఉత్తరం 1-11-1896న వ్రాయబడింది. కొంత దీర్ఘమయినా విషయ సాకల్యం కోసం ఆ ఉత్తరంలోని భాగాల నిస్తున్నాను.

"... I am a socialist not because I think it is a perfect system but half a loaf is better than no bread.

"The other systems have been tried and found wanting. Let this one be tried - if nothing else, for the novelty of the thing. A redistribution of pain and pleasure is better than always the same persons having pains and pleasures. The sum total of good and evil in the world remains ever the same. The yoke will be lifted from shoulder to shoulder by new systems, that is all.

"Let every dog have his day in this miserable world, so that after this experience of so called happiness they may all come to the Lord and give up this vanity of a world and governments and all other botherations.[9]

(గుర్తింపులు నావి)

'కాస్ట్, కల్చర్ అండ్ సోషలిజం' లో సంపాదకులు ఈ గుర్తింపులు గల భాగాల నెత్తివేశారు. ఇది ఇలా ఉండగా తెలుగు అనువాదం ఇంకా దురదృష్టకరంగా సాగింది. "నేను సామ్యవాదిని అగుటకు కారణము — అసలే లభింపకుండుట కన్న కొంతయైన లభించుట మేలు గనుక..." పై ఆంగ్ల మాతృకకూ, ఈ అనువాదానికీ ఎంత పొంతన ఉందీ పాఠకులే గ్రహించ ప్రార్థన. 'కాస్ట్, కల్చర్ అండ్ సోషలిజం' లో "... ... not because I think it if a perfect system... అని ఉన్న, తెలుగు అనువాదంలో దీనిని అసలు ఎత్తేశారు.

నాకు శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి (శత తమ జన్మ దినోత్సవ ప్రచురణము) 1962 మార్చిలో ఆచార్య జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి సంపాదకత్వం క్రింద ప్రచురింపబడిన 6వ సంపుటం దొరికింది. అందులో 'కులము, సంస్కృతి మరియు సోషలిజం' అనువాదమే లేదు.

ఇంతకూ పై ఆంగ్ల మాతృకను చదివిన తరువాత, 1896లో స్వామిజీ తమా సోషలిస్టు నన్నారనీ, నేనూ 1978లో నూవోను ఉదహరించి సోషలిష్టునంటున్నాను కాబట్టి, స్వామిజీ కూడా నా సోషలిజం వినా గత్యంతరం లేదన్నారని వ్రాయటం— శ్రీ జ్వాలముఖికి భావ్యమా?

తరువాత శ్రీ జ్వాలాముఖి శ్రీ మాధవరావ్ సదాశివరావ్ గోల్వాల్కర్‌నుంచి ఉదహరించారు. ఆ విశేష పురుషుడు తన మరణందాకా, ప్రతి సంవత్సరమూ యావద్భారత పర్యటన చేశేవాడు. ఉపన్యాసాలే గాని వ్రాసినవి చాల స్వల్పము. ఆ ఉపన్యాసాలను సమీకరించి 'బంచ్ ఆఫ్ థాట్స్' అనే పేరుతో 1966లో ప్రచురించారు. అందులో 'అంతర్గత ప్రమాదాలు' అన్న ప్రకరణంలో 'కమ్యూనిష్టుల'ను గురించి ఒక భాగముంది. దానిని తెలుగులో 'సామ్యవాదులు' అన్న పేరుతో అనువదించారు.

ఆ 'సామ్యవాదులు' అన్నదాంట్లో శ్రీ జ్వాలాముఖి ఉదహరించినది 'ప్రతిక్రియాత్మక దృష్టివలన ప్రమాదం' అన్న భాగంలో ఉంది. మీరీ విధంగా చెయ్యకపోతే కమ్యూనిస్టు లొస్తారు అని ప్రజలను బెదరగొట్టటం మంచిది కాదంటూ, అది సామ్యవాదానికి పరోక్షమైన ఆమోదముద్రే అంటూ ఇలా వ్రాయబడింది: ''అంతే గాక, తమ స్వలాభంకోసమని ఆరంభించే అటువంటి ఉద్యమాలన్నీ ఏదో మొక్కుబడి కోసమనీ, దగా అనీ సామాన్య ప్రజలు అనుమానిస్తారు. ''ఈనాడు సామ్యవాదులు ముందడుగు వేస్తున్నారు కాబట్టి మీరు ఇటువంటి సంస్కరణల వాగ్దానాలతో ముందుకు రావాలని కోరుతున్నారు. మోమోట మెరుగని సామ్యవాదులే మాకు కావాలి. ఎందుకంటే కనీసం వారిలో నిజాయితీ, ధైర్యమూ ఉన్నాయి. తాము చెప్పేదాన్ని వారెంతో దృఢవిశ్వాసంతో చేస్తారు. అట్టివారిని మేము నమ్మవచ్చును'' అని కూడా ప్రజలు అనవచ్చును. ఆ విధంగా ఈ ఉద్యమం సామ్యవాదానికే దారితీయవచ్చు. నిజానికి సామ్యవాదాన్ని అడ్డుకోవాలనే ఒకే ఆలోచనతో పనిచేయుటం ఎప్పటికైనా ప్రమాదమే అవుతుంది. సత్యమూ, నిర్మాణాత్మకమూనైన విశ్వాసాన్ని అలవరుచుట ఒక్కటే, సామాన్య ప్రజానీకాన్ని సామ్యవాదంయొక్క నీచ ప్రభావాన్నుంచి బయట పడవేయగలదు'' ('పాంచజన్యం' 1974 ఫిబ్రవరి ప్రచురణ–232వ పేజీ–గుర్తుంపునాది.)

దురదృష్టమేమిటంటే, వాక్యాన్నిగూడాపూర్తిగాఇవ్వకుండా, 'సామాన్య ప్రజానీకాన్ని సామ్యవాదంయొక్క నీచప్రభావంనుంచి బయట పడవెయ్యాలి' అంటూ తనకు కావలసినదాన్నే ఈయటం శ్రీ జ్వాలాముఖికే తగుతుందేమో! 'బంచ్ ఆఫ్ థాట్స్'లో ఈ 'ది కమ్యూనిస్టు' అన్నది ఏడు పేజీలయితే, 'పాంచజన్యం'లో పది పేజీలుంది. దానినంతా చదివితే శ్రీ గోల్వాల్కర్ ధోరణి తెలుస్తుంది అనేక విషయాలను వివరించి 'It is only the inculcation of a right and positive faith that can make the masses rise above the base appeal of communism' అన్నారు. అందులోని 'బేస్' అన్న మాటకు అనువాదకుడు 'నీచ' అని వాడాడు. దానికీ జ్వాలాముఖి తతంగమంతా.

ఇంతకూ శ్రీ గోల్వాల్కర్ వ్యక్తిత్వ మెలాంటిది? ఒకసారి ఒక పత్రికావిలేఖరి ఆయనచేత ఏద్నైనాసరే కమ్యూనిష్టులకు వ్యతిరేకంగా చెప్పిద్దామని వారి అరుణపతాకం సంగతి ఎత్తాడు. కాని వారు దాని కంగీకరించలేదు. ''అరుణ పతాకమా? దాంట్లో తప్పేముంది? మన హనుమంతుని పతాకంకూడా ఎరుపే' అన్నారు వారు.[10]

ఇంతకూ ఇప్పటి ఆర్. యస్. యస్ అధినేత శ్రీ బాలా సాహెబ్‌దేవరస్ ఏమన్నారు? దేశ స్వాతంత్ర్యం కోసం, పౌరస్వాతంత్ర్యాల కోసం పోరాడిన ఒక రాజకీయ పక్షం, అదే పౌరస్వాతంత్ర్యాలను అణచటానికి వ్యక్తులను చిత్ర హింసలపాలు చేయటం నీచమనీ, ఈ విషయంలో తానెప్పుడూ ఆర్. యస్. యస్‌ను, నక్సలైట్లను భిన్న దృష్టితో చూడలేదనీ, నక్సలైట్లను విచారణ లేకుండా నిర్బంధించడం పనికి రాదనీ స్పష్టంగా చెప్పారు. [11]

## నా "వైదికవ్యవస్థ-"

''శ్రీ పిరాట్లవారు మొదలే నిర్ణయించుకొన్న అభిప్రాయాల ప్రకారం పోషలిష్టు వాస్తవికతను కాదంటున్నారు. అందుకు వారి ప్రేరణ 'వైదికవ్యవస్థ'లో ఉంది. ఆ చాతుర్వర్ణ్య వ్యవస్థను ఆధునీకం చేసి 'భారతీయ సంస్కృతి'ని పునరుజ్జీవింప చేయాలని మతోన్మాదుల భావన.''

నా మీద పక్కని అభాండమే వేశారు నా 1978 జనవరి వ్యాసంలో మతం కనపడిందా? నాకూ అభిప్రాయాలున్నాయి, కాని ''మొదలే నిర్ణయించుకున్న'' అభిప్రాయాలు లేవు. నేను ఎదిగే మానవుణ్ణి. నా నిరంతర సత్యాన్వేషణలో, నాశక్తిని బట్టి, నా అవగాహన కొలది, కొన్ని అభిప్రాయా లేర్పడ్డాయి, కొన్ని భావాలు రూపురేఖలు దిద్దుకొన్నాయి, కొన్ని సంస్కారాలు లభ్యమయ్యాయి. వాటన్నిటి ఫలితమే ఈనాటి నేను.

ఎవరవునన్న కాదన్నా మనది వైదికవ్యవస్థే అంటే వేద కాలం నుంచీ నేటి వరకూ 'కంటెన్యువస్'గా వస్తున్న వ్యవస్థ. సుమారు మూడు నాలుగు వేల సంవత్సరాల గతాన్ని కాదనలేం, నీవు అన్న ఎవ్వరూ ఒప్పకోరు. అదంతా మంచిదా, చెడ్డదా–మంచి ఎక్కువ చెడ్డ తక్కువా లేక చెడ్డ ఎక్కువ మంచి తక్కువా–కాదు ఇప్పటి చర్చనీయాంశము. వేదాలు మధ్య ఆశియా వారివి, దక్షిణ దేశం ద్రావిడ సంస్కృతి మూలకంగా వేరే అవుతుంది, బౌతిక దృక్పథానికి తావులేని భారతీయ సంస్కృతి ఆవిటిది–ఇవ్వన్నీ కలగాపులగంగా విడిచిన బాణాలు మాత్రమే. ఏ విషయం మీదన్న వివరంగా వ్రాస్తే, నా ఓపిక కొలదీ సమాధాన మీయటానికి ప్రయత్నిస్తాను.

కాని ఒకటి మట్టుకు చెప్పగలను. నా 'భారతీయ వ్యవస్థ' మీరనుకునేటట్లుగా 'చాతుర్వర్ణ్య వ్యవస్థను' ఆధునీకరణం చేయటానికి మాత్రమే ప్రయత్నించదు. మీరుదహరించిన స్వామి వివేకానందుని, 'కాస్ట్' కల్చర్, సోషలిజం' నుంచే అది ఏమి చేయదలుచుకుందీ చెప్పేందుకు ప్రయత్నిస్తాను.

వివేకానందుని దృష్టిలో భారతీయాదర్శమైన ఆధ్యాత్మిక సంపూర్ణతను, పాశ్చాత్య భావనయైన సాంఘిక పురోభివృద్ధితో సమన్వయింపచేసి నడిపేదే ఆదర్శమైన సమాజం. [12] ఈ దేశం తన స్వీయ ప్రకృతి ప్రకారమే పరిణామం చెందాలి. భారతీయ జీవన కేంద్రం ఆధ్యాత్మికత, జాతీయ పునర్నిర్మాణానికి మీరువేసే ఏ పథకమూ దీనిని కాదన కూడదు. ఇతరుల నుంచి తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది, కాని తెలుసుకోవట మంటే, భావాలను స్వతంత్రంగా ఆకళింపు చేసుకోగలగటం, అంతేగాని కేవల అనుకరణ కాదు......వివేకానందుని ధోరణి ప్రకారం, అటువంటి అనుకరణ

మన దేశానికి అనూహ్యం. ఆత్మ విస్మృతి పొందిన మన దేశీయులను ఆయన "ఈ హిందూ జాతిని రష్యనైజ్ చేయటం సంభవమా" అని అడుగుతాడు. 13

"మన పరిష్కార మార్గం పైనున్న వారిని క్రిందకు లాగటంలో లేదు, క్రింది వారిని కూడా పైవారి స్థాయికి తీసుకుపోవటంలో ఉంది." 14 మన ఆదర్శం ఆధ్యాత్మిక సంస్కృతితోనూ, త్యాగభావనతోనూ ఉండే బ్రాహ్మణుడు. నా దృష్టిలో బ్రహ్మణ ధర్మం అంటే ఏమిటి ? ప్రాపంచిక వాసనలు లేకుండా, నిజమైన జ్ఞానాన్ని సమృద్ధిగా కలిగినదే ఆదర్శమైన బ్రాహ్మణత్వము. ఇదే హిందూజాతి ఆదర్శము."

"బ్రాహ్మణ కులము, బ్రాహ్మణ లక్షణాలు రెండూ రెండు భిన్నమైన విషయాలు."15

కేవలం చాతుర్వర్ణ్య వ్యవస్థను గురించి చెప్పేందుకే వీటిని ఉదహరించాను సుమా ! 'ప్రాపంచిక వాసనలు లేకుండా' అనే మాట పట్టుకుని, వివేకానందులు కూడా 'భౌతిక దృక్పధానికి తావులేని సంస్కృతి'ని బోధించాడని అనవద్దు. సరియైన భౌతిక దృక్పధానికి ఆధ్యాత్మిక పునాది కావాలనేదే వివేకానందుని ధోరణి అని ఎవరికైనా తెలుసు.

నా 'వైదిక సంస్కృతి' నాకేగాదు, సరిగ్గా అర్ధంచేసుకునే ఎవరికైనా జ్ఞానచక్షువును ప్రసాదిస్తుంది, నిరంతరాభివృద్ధిని కాంక్షిస్తుంది. ఆ చక్షువు ప్రసాదించిన జ్ఞానతేజంతో ఆ 'వైదిక వ్యవస్థ'నే కూలంకషంగా పరిశీలించి, అందులోని నింద్యాలను నిర్దాక్షిణ్యంగా ఖండిస్తాను, అనుసరణీయాలను ఆమోదిస్తాను. పిరాట్ల సంస్కృతిలో శంకరులు, రామానుజులే కాకుండా బౌద్ధమూ ఉంటుంది. విదేశీ వనితలు, క్రైస్తవులు అయిన సోదరి నివేదిత, అనిబిసెంటు, మదర్‌లూ ఉంటారు. కాయస్థుడైన వివేకానందుడే కాకుండా, హరిజనుడైన అంబేద్కర్ ఉంటాడు. ఈ ఆలోచనల వారసత్వమే, అవగాహనే పిరాట్ల సంస్కృతి అవుతుంది.

ఇంకో విషయం. మావో ఆలోచనలు కూడా నాకు ఆలోచనీయాంశాలే, అందులో ఆచరణీయాలుగా తోచినవి నాకు శిరోధార్యాలు. విచిత్రంగా ధ్వనిస్తుందా ? విద్యావిధానంలో "అవసరమైతే మనం చైనా ఉదాహరణని అనుసరింపవచ్చు కళాశాలలనూ, విద్యాలయాలనూ మూసివేసి విద్యార్థులను గ్రామాలకు, పట్టణాలలోని మురికివాడలకూ పంపి, వాళ్ల ద్వారా ప్రతి పౌరునికీ, వయస్సుతో నిమిత్తం లేకుండా, విద్యలో ప్రాథమిక జ్ఞానాన్ని కలుగజేయాలి." ఎక్కడదీ భావం? సాక్షాత్ జె.పి. ది, 1977 ఏప్రిల్ 13 న జాతి నుద్దేశించి చేసిన రేడియో ప్రసంగ భాగం సుమా !

అలాగే ఈ క్రింది మావో వాక్యాలను గురించి కూడా పదేపదే ఆలోచించాలనిపిస్తుంది. అయితే అంధానుకరణ నాకు వద్దు.

"Take the ideas of the masses and concentrate them, then go to the masses, persevere in the ideas and carry them through, so as to form correct ideas of leadership-such is the basic method of leader-ship." (1943.)

"We should go to the masses and learn from them, synthesize their experience into better, articulated principles and methods, then do propoganda among the masses, and call upon them to put these principles and methods into practice so as to solve their problems and help them achive liberation and happiness." (1943.)

(మావో రెడ్‌బుక్, 1968 రెండవ ఎడిషన్ పేజీలు 128-129)

యావత్ప్రపంచంలోని భావాలను, వీలయినంతవరకు, తన శక్తి కొలది అధ్యయనం చేసి, ఆకళింపు చేసుకోవటానికి ప్రయత్నిస్తాడు పిరాట్ల. అంతేగాదు, దానితో తన భావాలను ఎప్పటికప్పుడు పోల్చుకుంటూ ముందుకు పోవటానికి ప్రయత్నం చేయాలన్నదే నా ఆకాంక్ష. సత్యాన్వేషణే పరమాశయమయినపుడు సంకుచితత్వానికి స్థానం ఉండగూడదు కదా !

కాని మార్క్సిస్టుల జ్ఞానచక్షువు, మార్క్సిజం మీదనే ప్రసరింపచేయటానికి పనికిరాదు. ఆ దృష్టికి సోషలిస్టు, కమ్యూనిస్టు వ్యవస్థలలో తప్పులే ఉండవు, ఆచరణలో లోపాన్ని ఎంచావా కొంత భరిస్తాం, మూలాన్నే ప్రశ్నించావా — ఖబడ్దార్, ఇదీ వరస.

చిట్టెం కట్టిన మనస్తత్వం కాదు కాబట్టే కమ్యూనిజం, మార్క్సిజం ఈ దేశానికి వర్తించదని చెప్పిన డా॥ సుబ్రమణ్యస్వామి చైనా సందర్శించి వచ్చాడు, సంభాషణలు జరిపాడు. ఇది ఆయన "వర్గ స్వభావాన్ని", "ఆ వరసలోనే" నిలుచున్న పిరాట్ల వర్గ స్వభావాన్ని "బట్టబయలు చేస్తుంది." నిజమే మరి.

ఇంతకూ వివేకానందులు, అంబేద్కర్, లోహియాలు జ్వాలాముఖి వర్గవిభజనలో ఏ వర్గంలోకి వస్తారో, ప్రజాశత్రువులు, భూస్వామ్య వర్గ ప్రతినిధులేనా ?

## 'నూత్న మానవ' సృష్టి

నిజమే. ఈనాడు జనచైనా నూతన ప్రపంచంలో నూతన మానవులను సృష్టిస్తున్నది, నూతన పరిస్థితులను కూడా సృష్టిస్తున్నది. నా వ్యాసంలో స్పష్టంగా, మావో 'రెడ్‌బుక్' నుంచి ఉదహరించాను. కొంత మంది విప్లవ ప్రతికూలవాదులకు (సర్టెన్ కవుంటర్ రివల్యూషనరీస్) ఎలా ఓటుహక్కు, వాక్స్వాతంత్ర్యము తీసివేయబడేది, ఎలా కొంతమంది ప్రజా "శత్రువు"లను

శ్రామిక శిబిరాలకు తోలి, తద్వారా వారిని 'నూత్న మానవు' లుగా (ట్రాన్స్‌ఫార్మ్ ఇంటూ న్యూమెన్) తయారు చేసేదీ వివరించాను. దానికి సమాధానం లేదు.

"...దోపిడీ రాజ్యం కూలుతుంది కాబట్టి శ్రీ పిరాట్ల ఇబ్బంది పడదలుచుకుంటే అది వారి వర్గస్వభావాన్ని బట్టబయలు చేస్తుంది..."

"...ఆచరణలోని లోపాలు ఆచరణ ద్వారానే పోవాలి. సోషలిజం పక్షాన నిలిచి సోషలిజం అమలును విమర్శించవచ్చు కాని, సోషలిజంను వ్యతిరేకించే ధోరణిలో విమర్శించే వారితో రాజీలేదు. వారే తమ ఉనికిని ప్రజాశత్రువుల్లో భద్రపరుచుకొన్నారు..."

"...ఈ విధంగా 'నూత్న మానవులు'గా తయారవడం, వర్గ ప్రయోజనాల రీత్యానే శ్రీ పిరాట్ల 'ఆచరణ లోపాల' పేరిట ప్రతిఘటిస్తున్నారు..."

ఇంతకూ నా తోపం — వాస్తవాలను ఉదహరించటం, ప్రశ్నించటం, మీరనుకునే సోషలిజాన్నే ప్రశ్నించటం, కాబట్టి ప్రజాశత్రువు, దోపిడీ వర్గానికి చెందిన వాడు.

నిజమే. శ్రీ జ్వాలాముఖి అదృష్టవంతుడు.

'తుపాకీ గొట్టం ద్వారానే రాజ్యాధికార మొస్తుంది' అని చెప్పుకుంటూ తిరగడానికి స్వాతంత్ర్యమున్న వ్యవస్థలో బ్రతుకుతున్నాడు. 1974 లోనే వి. ర. సం నుంచి రాజీనామా చేసినా, 1978 దాకా ఉండి జనసాహితీ సాంస్కృతిక సమాఖ్యను పెట్ట గలిగిన వ్యవస్థలో ఉన్నాడు. తార్కుండే కమిటీలనూ, ఓ.పి.డి.ఆర్. బహిరంగసభలనూ చూడగలుగుతున్నాడు.

సూటిగా, స్పష్టంగా చెప్పుకోవాలంటే — శ్రీ జ్వాలాముఖి ఆశించే సమాజంలో 'భారతి' బోటి పత్రికలుండవు. పిరాట్ల ఎలాగో ఉండడు, కాని శ్రీ జ్వాలాముఖి బోటివారే, అధికార ధోరణిని వ్యతిరేకిస్తే, 'కౌంటర్ రెవల్యూషనరీస్' 'ప్రజాశత్రువు' లవుతారు. శ్రామిక శిబిరాలలో కాయకల్ప చికిత్సకు లోనై 'నూత్న మానవులు'గా బయటికొస్తారు

ఒక విధంగా శ్రీ జ్వాలాముఖి వ్యాసంతో పాటే — జులై 1978 'భారతి' లోనే ప్రచురింపబడ్డ, డాక్టరు. మురళీధర్‌గారి 'కమ్యూనిస్టు రష్యాలో సాహితీ ప్రతిభటన' శ్రీ జ్వాలాముఖికి ఒక విధమైన సమాధానం.

ఇలాంటి సమాజాన్ని మహత్తర సమాజంగా చిత్రించటం ఎంతవరకు భావ్యమో పాఠకులే ఆలోచించుకోగలరు. ఏం — దీనిని 'నీచ' ప్రభావంగా చిత్రిస్తే తప్పా?

## మనవి - ముగింపు

నా వ్యాసంతో శ్రీ జ్వాలాముఖి నాతో రాజీ కొస్తాడని ఊహించేటంత మూర్ఖత్వం నాలో లేదు. కావలసింది అవగాహన కాని రాజీ కాదు, కనీసం అది కూడా అవసరం లేదు, పనికిరాదు అంటుంటే, యిక దీనిమీద తర్జన భర్జనలు, వాదోప వాదాలు అనవసరమే.

నా ఆలోచన శ్రీ జ్వాలాముఖికి అసలు అవసరమేలేదు, నేను వారి దృష్టిలో 'అస్పృశ్యుడిని' కాని వారి ఆలోచనను నేను అర్థం చేసుకో ప్రయత్నించాను, ప్రయత్నిస్తున్నాను.

నిజంగా నేను దురదృష్టవంతుణ్ణి.

నన్ను ప్రజాద్రోహిగా, వర్గ శత్రువుగా భావించి శ్రామిక శిబిరంలో తోసేందుకు తహతహలాడే వారికి వాక్స్వాతంత్ర్యము, భావ స్వాతంత్ర్యము, సక్రమ విచారణలు కావాలని గొంతు చించుకుంటున్నాను. నా ప్రజాస్వామ్యం నాకే ఎదురవుతుందేమో వేచి చూడాల్సిందే.

1978 జనవరి 'భారతి' లోని ముగింపే దీనికీ ముగింపు అవటం యెంతో సముచితమనిపిస్తుంది. "దురదృష్టవశాత్తు ఇంకా కొన్ని కటువైన వాస్తవాలున్నాయి. 1967 నుంచీ మన దేశంలో జరిగిన దానిని కొండంతలుగా ప్రచారం చేసిందీ చైనాగా, 1969లో జరిగిన తమ తొమ్మిదవ కాంగ్రెసుకు ప్రజల సాయుధ పోరాటం జరుగుతున్న దేశాలలో భారత దేశాన్నొక దానినిగా తమ రాజకీయనివేదికలో చూపిందీ చైనా నాయకులే, 1972 జులైలో చారు ముజుందార్ మరణిస్తే దానిని గురించి ఒక్కముక్కా తమ పత్రికలలో వేయందీ చైనానాయకులే, 1973 ఆగష్టులో జరిగిన తమ పదవ కాంగ్రెసు రాజకీయ నివేదికలో సాయుధసమరం జరుగుతున్న దేశంగా పేర్కొన్నదీ చైనా నాయకులే. కాకపోతే 1969 కాంగ్రెసులో మహా నాయకుడుగా రాజకీయ నివేదికను సమర్పించిన లిన్—పి—యావో, 1971 లో మరణించినా, 1973 లో రివిజనిష్టు అయ్యాడు, చౌ ఎన్ లాయ్ ఆ నివేదికను సమర్పించాడు."

ఇంతకూ శ్రీ జ్వాలాముఖి యొక్క "సాహిత్యంలో వాస్తవికత" లేకపోతే, నా "సోషలిష్టు వాస్తవికత" ఉండేది కాదేమో!

'ఫాక్ట్స్ ఆర్ సేక్రెడ్, కామెంటు ఈజ్ ఫ్రీ' మిస్టర్ 'జ్వాలాముఖీ' —

## అధోజ్ఞాపికలు

1 'An Introduction to The Study of Indian History' by D. D. Kosambi (Popular Book Depot, Bombay, Dec 1956.) pages 10, 11,

2 'The Rape of Bangladesh' Anthony Mascarenhas. (Vikas Publications, Newdelhi, 1971.) page 118.

3, 4, 5, 6, 'Midnight Massacre in Decca' Sukhranjan Dasgupta. (Vikas Publications 1978) pages 13, 19, 33 to 36 and 45.

7 "...The foreign powers, Pakisthan, China and U.S.A. are very eager to gain something form this trouble. The more the crisis is deepenning the more their intentions being revealed ... during the liberation struggle China was the ally of Pakisthan for two reasons, it could not tolerate the fact that a whole nation unarmed, and under the leadership of the middle class, could undertake a freedom struggle. Secondly, China would not desert Pakisthan for political and military reasons also. China was getting inside information of both India and USSR through Pakisthan.

China not only supplied Pakisthan with arms and equipment during the liberation struggle but according to the evidence gathered by the British Historian Hasten Lamb, she was at one time thinking of entering the play herslef. China justified herself by claining that the struggle going on in Bangladesh was not a freedom struggle at all. The recessionists under the instigation of Russia and India were creating disturbance. The same China recognized Bangladesh within a week of the assassination of Mujib.

Five weeks afterwards they agreed to an exchange of envoys,a thing which Mujib could not make them agree in four years ......

The leadership of Bangladesh is not important to any of these three countries. Theyare only interested in keeping out Indian and pro-Russian forces Consequently these foreign powers will support communal fanatics." (pages 92 and 93.) (ibid)

(గుర్తింపు నాది) సుఖరంజన్‌దాస్ గుప్తా "ఆనంద బజారు" పత్రిక విలేఖరిగా బంగ్లా యుద్ధాన్ని చూచి, తరువాత అదే పత్రిక ప్రధాన విలేఖరిగా ఢక్కాలో మూడు సంవత్సరాలున్నాడు.

8 'Caste, Culture and Socialism' Vivekananda. (Adwita Ashram – First Impression, 1975 )

"Thus his motto seems to have been, "From Caste to Socialism through Culture." In the Golden age, or the socialistic Age of Swami Vivekananda's conception, all would be Brahmanas in the ideal sense of the term," (Preface VII)

9 Mayavathi Edition, Vol VI (6th Edition, 1956) Epistles (pages 378 to 382) ఈభాగం 381 మరియు 382 పేజీలలో ఉంది.

10 "Understanding R. S. S." by Kamal in 'Organiser' Delhi Weekly dated 21-11-77.

11 "It was really most henious that a party which fought for the independence of the country and civil liberties should have indulged in such monstrous violation of civil liberties. As for torture, it is certainly most condemnable. They had invented various kinds of indescribable and in human form of tortures, like roller torture, aeroplane torture which had been inflicted on Naxalites and the R. S. S. They were not given food for days together in the lock up. They were made to drink their urine.

Incidentally I would like to make it clear that I have not made any discrimination between Naxalites and the R. S. S. I have always pleaded that no Naxalite should be detained without trial. Try them in court collect evidence and punish them if they are found guilty "

Sri Balasaheb Deoras, R. S. S. Chief in an interview with 'Blitz'weekly dated 18-6-77.

12 'Caste, Culture and Socialism' Preface X

13 IBID XII

14 Ibid page 8,

15 Ibid page 10.

# దేశానికి వెన్నెముక గ్రామం......

నేటికీ, ఎన్నటికీ, దేశానికి గ్రామమే వెన్నెముక. గ్రామ సౌభాగ్యమే దేశ సౌభాగ్యం. త్వరలోనే ఆంధ్రప్రదేశ్‌లోని పల్లెప్రాంతాలకు విరివిగా రహదారి సౌకర్యాలు కల్పించి వాటిని మిగతా ప్రపంచానికి సమీపంగా తీసుకు రావలసివుంది.

అందుకే రాష్ట్రంలోని మారుమూల గ్రామాలను కలుపుతూ రోడ్లు వేసేందుకు **1978-79** బడ్జెట్‌లో రు. **11** కోట్ల నిధులను కేటాయించడం జరిగింది.

అంతేకాదు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ పల్లెపల్లెకు బస్సులు నడిపేందుకు శాయశక్తులా కృషిచేస్తుంది. ప్రైవేటు బస్సు యజమానులకుకూడా ఈ కార్య క్రమంలో ఇతోధిక ప్రోత్సాహం లభిస్తుంది. ఆంధ్ర ప్రదేశ్‌లోని మారుమూల గ్రామాలు సైతం నాగరికతా ప్రపంచానికి త్వరగా దగ్గరవాలనేదే ప్రభుత్వ లక్ష్యం.

*సమాచార, పౌరసంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాదు.*

23/78-79



# కవితో పనేమిటి?

శ్రీ దేశపతి గోపాలకృష్ణ

దినమంతా పనిచేసి
అలసి, శోషపడి
కార్లో ఇంటికి
తిరిగి వచ్చాను
సోఫాలో కూర్చున్నా
ఉషా ఫ్యాను గాలి తాకుతూనే వుంది
కుళ్లిపోయిన ఆత్మతో
కళ్లు మూసికొన్నాను
విశ్రాంతి కోసం
ఆలోచించాను కొంచం
ఆఫీసులో హడావుడి
అనవరతం ఫైళ్ల రైళ్ల కూతలూ
దడ దడ ధ్వనులూ
కేసుల రైఫిళ్ల గుళ్ల మోతలూ!
ఆ ధ్వనులు కొంచం తక్కువైపోయాయి
ఇక పర్వాలేదు! అనుకున్నా!
ఎంత కంటగింపు గాలి అది
డబ్బు కోసం గులామీ
ఊబిలో దిగపడి పోవడం తప్పదు
ఏం జీవితం!
నవ వధువులా అలంకరించబడ్డ ఈ
వాంగ్రడాయింగురూం హిందూ సాంప్రదాయానుసారం
తిలకం పెట్టుకొనట్లు మృత్యువులా, జడంగా
నిశ్శబ్దంగా వుంది.
అబ్బబ్బా! ఆ ఆఫీసులో మనిషికి మనిషే
శత్రువు—ఎన్ని స్పర్ధలు—పరోపకార హీనం
స్వార్ధపూరం — లంచాలు — పచ్చి మోసం
దేశ ద్రోహం - ఆత్మవంచనా — డబ్బుకోసం
అంతా చేయాలి! ఛీ ఛీ!
There is no humanitarian
and fellow feeling అని ఆంగ్లం
కూడా పలికాను. ఆంగ్లేయులు మన కిచ్చిన
వారసత్వ భాషలో
అదంతా జానేదేవొ
ఒక కవితా సంపుటి తెఱచాను
రసస్రావం ప్రారంభమయింది
హాయి! హాయి! మనోవికసనం
నవ స్ఫూర్తియుత చైతన్యం
నవజీవన నవోల్లాసంతో
పులకాకులమైపోయాను.
ఆహా! ఎంత మంచి కవిత్వం
అని మెచ్చుకోని వానినయినా
మెచ్చుకోగలిగాను.
అలాంటిదా కవిత, కనుక.

★ ★ ★

కవిగా రప్పడే జ్ఞాపకం వచ్చారు.
నల్లగా వుంటారు. తాళవృక్షం కంటే
తక్కువ ఎత్తు! ఒరిగిలా చిక్కిన దేహం
చిందర వందర క్రాపు — చిక్కిన దవడలు!
ఆబిడ్సు పుస్తకాల షాపుల్లో
ఫుట్‌పాత్ మీది పత్రికలు చూస్తూ
గ్రంధాలయాల్లో రెస్టారెంట్లలో
తృష్ణాపూరిత నేత్రాలతో
ఖాళీ పర్సు, ఖాళీ సిగరెట్కేసుతో
కనిపిస్తాడు! స్నేహితుల కోసం
నిరీక్షిస్తూ, ఒత్తిడులకూ
ఆర్థిక దాస్యాలకు గురి అయిన మహా
మనీషి — ఎంత నిరీహుడు!
గమ్య మెరుగని విచారాలను
నవ రసాలతో మేళవించి
కథనం చేస్తున్నాడు కమ్మగా
కనువిందుగా
కవితో మనకేమిటి?
కవితతో పనిగదా!

(మిగతా 56వ పేజీలో)

డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి

# శాతవాహనుల రాజధాని, శాఖానగరములు

— రచన

ఇక శాతవాహనుల రాజధాని. ఇదొక ఉత్థాపిత సమస్య.

అసలు శాతవాహనుల రాజధాని ప్రతిష్ఠానపురమని ప్రథమతః అందిచ్చినవారు ఆర్. జి. భండార్కర్‌గారు.[1] తదుపరి శ్రీకాకుళమని నందిచ్చినవారు వి. ఎ. స్మిత్‌గారు,[2] కొమర్రాజు లక్ష్మణరావుగారూను.[3] ఆమీద ధాన్యకటకమని అందిచినవారు చిలుకూరి వీరభద్రరావుగారు;[4] డాక్టర్ డి. ఆర్ భండార్కర్ గారూను [5] అటుపై తొలి రాజధాని శ్రీకాకుళము, మలి రాజధాని ధాన్యకటకము, మఱొక రాజధాని ప్రతిష్ఠానపురము అని ఊహాగానము. మహారాష్ట్ర చరిత్రకారులకు మహారాష్ట్ర మమకారము, ఆంధ్రచరిత్రకారులకు ఆంధ్రాభిమానము ఉండవచ్చును. నిర్మమకారము, నిరభిమానముతోడి నిశిత పరిశీలనమే సత్యసాక్షాత్కారమునకు సాధనము.

కృష్ణామండలములోని శ్రీకాకుళమున ఆంధ్రవిష్ణువు దేవాలయము కలదు. ఒకానొక రాజు విష్ణ్వంశమున అచట పుట్టెననియు, అతని పేరనే ఆ దేవాలయము నిర్మింపఁబడెననియు జనశ్రుతి కలదు. అంతేకాదు. బ్రహ్మాండపురాణమున మఱొక విశేషము కలదు.

'శ్రీశైల భీమ కాళేశ మహేన్ద్రగిరి సంయుతం
ప్రాకారంతు మహత్కృత్వా త్రీణి ద్వారాణిచాకరోత్
త్రిలోచనో మహేశస్తు త్రిశూలంచ కరే వహన్
త్రిలిఙ్గ రూపీ వ్యవసద్ త్రిద్వారేషు గణైర్వృతః
ఆన్ధ్రవిష్ణు స్సురయుతో దనుజేన నిశుంభునా
యుధ్వా త్రయోదశయుగాన్ హత్వాతుం రాక్షసోత్తమం
అవసత్తత్ర ఋషిభిర్యుతో గోదావరీతటే
తత్కాలప్రభృతి క్షేత్రం త్రిలిఙ్గ మితి విశ్రుతం'

ఇందు శ్రీశైల భీమేశ్వర కాళేశ్వర క్షేత్రములను మహేంద్రగిరితో కూడునట్లు ప్రాకారమును నిర్మించి, ఆ మూడిటిని ద్వారములుగ జేసెననియు, ఆ మూడు ద్వారములందును శివుడు త్రిశూలధారియై, ప్రమథగణ పరివృతుడై ఉండెననియు, ఆంధ్రవిష్ణువు సురయుతుడై, రాక్షసోత్తముడైన నిశుంభునితో పదమూడు యుగములు యుద్ధము చేసి, వానిని చంపి, గోదావరీతటమున నందలి ఋష్యాశ్రమములతోపాటు వాని నివాసమును కైవసము చేసికొనెననియు స్పష్టము ఈ పురాణగాథ 'ఆంధ్రకౌముది' అను గ్రంథమున మఱొక విశేషమును మలచినది.

'ఆన్ధ్రనాథో మహావిష్ణుర్నిశంభు దనుజాపహో
పురా స్వాయంభువమనోః కాలే కలియుగే హరిః
కాకులే రాజవర్యస్య సుచన్ద్రస్య తనూభవః
అభవత్సర్వదేవైశ్చ వేష్టితో లోకపూజితః'

ఇందు ఆంధ్రనాథుడు, నిశంభుదనుజారి అయిన మహావిష్ణువు కలియుగమున స్వాయంభువ మనువుకాలమున, కాకులమున రాజశ్రేష్ఠుడైన సుచంద్రుని తనూభవుడై, సర్వదేవపరివేష్టితుడై లోకపూజితుడు అయ్యెనని స్పష్టము. కాకుల మనగా శ్రీకాకుళము కావచ్చును. కనుక రాజశ్రేష్ఠుడైన సుచంద్రుని కొడుకు మహావిష్ణువు ఆంధ్రరాజనియు, అతని రాజధాని శ్రీకాకుళ మనియు, అతడే కాలక్రమమున ఆంధ్రవిష్ణువను దైవ మయ్యెననియు చారిత్రికుల సంభావనము. అంతేకాదు శ్రీకాకుళము సమీపమున 'జైనులో, బౌద్ధులో పరిపాలనము చేసిరని తెలుపు చిహ్నము లిప్పటికి ... కానవచ్చుచున్నవి' కనుక, శ్రీకృష్ణదేవరాయలు శ్రీకాకుళమును సందర్శించెను కనుక, శ్రీకాకుళము శాతవాహనుల తొలి రాజధాని అని చారిత్రకుల అయోజనము

ఇదియెల్ల పురాణగాథ పునాదిమీద వెలసిన అద్దాల మేడ. శ్రీకాకుళమున బౌద్ధ జైన చిహ్నము లున్నంత మాత్రమున అది రాజధాని కావలసిన ఆవశ్యకము లేదు. అదిగాక, శాతవాహనులు బౌద్ధులు, జైనులు కారు. బౌద్ధమత సహనము కల బ్రాహ్మణ మతస్థులు. చారిత్రికవ్యక్తి అయిన సుచంద్రుని కొడుకు పురాణపురుషుడైనను అతడు శాతవాహనుడు అనుటకు ఎట్టి ఆధారమును లేదు. అతడు చారిత్రిక వ్యక్తి అన్నట్లు 'ఆంధ్రకౌముది' యందు కలదు గాని, 'బ్రహ్మాండ పురాణమున' లేదు బ్రహ్మాండ పురాణములోని ఆంధ్రవిష్ణువు ఆంధ్రుల దైవమైన విష్ణువు కావచ్చును. కానిచో సురయుతుడై రాక్షస సంహారము చేయుట సంభవము కాదు. అంతేకాదు. ఏతన్నిమిత్తమైన త్రిలింగశబ్ద నిరుక్తిలోని మహేంద్రగిరి ప్రసక్తి అసంగతము. కారణము మహేంద్రపర్వతము కళింగ దేశములోనిది. త్రిలింగదేశము కంటె పృథగ్భూతమైనది కళింగదేశము కళింగదేశములోని మహేంద్రగిరి త్రిలింగదేశమున అంతర్గతమగుట అసంభవము. అసలు త్రిలింగ

సంజ్ఞ అర్వాచీనకాలికము. అది కాకతీయుల కాలమునందు మాత్రమే శాసనములందు, శాస్త్రగ్రంథములందు ప్రయుక్తము.[6] కాబట్టి తదనంతర కాలమున త్రిలింగ విషయము బ్రహ్మాండ పురాణమున ప్రక్షిప్తమైనట్లు ప్రతీయమానము.[7] ఆంధ్రకౌముది తదనంతర కాలికము. ఆ యీ గ్రంథములనుబట్టి జనశ్రుతి అవతరించుట సంభవము. శ్రీ కృష్ణదేవరాయలు శ్రీకాకుళమును దర్శించుట తీర్థయాత్రా విషయము కాని, దండయాత్రా విశేషము కాదు.[8] కాబట్టి శ్రీకాకుళము శాతవాహనుల తొలి రాజధాని అగుట నిరవకాశము

ఇక ధాన్యకటకము. ఇది చరిత్రప్రసిద్ధము. అంతేకాదు, జగత్ప్రసిద్ధము. ఈనాడు ధరణికోట అనబడునదియే ధాన్య కటకము. అందలి భాగమే అమరావతి. అమరావతిలోని బౌద్ధ స్తూపము అత్యంత ప్రసిద్ధము. అది క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దిలో నిర్మింపబడినట్లు బర్గెస్ సూచనము.[9] కాని అంతకంటె అర్ధశతాబ్ది పూర్వమే అశోకుడు నిర్మింపజేసినట్లు అద్యతనముగ లభించిన అశోకుని అమరావతీ స్తంభశాసన భాగమును బట్టి డా॥ డి. సి. సర్కార్ సమన్వయము[10] అనగా అమరావతిలోని బౌద్ధ స్తూపము క్రీస్తుపూర్వము 250 వ సంవత్సరము నుండి, అనగా క్రీస్తు పూర్వము మూడవ శతాబ్ది మధ్య భాగము నుండి కలదని గ్రాహ్యము. ఆట శాతవాహనుల అర్వాచీన శాసనములు రెండు లభించినవి. అవి ధాన్యకటకము శాతవాహనుల అసలు రాజధాని అనుటకు గాని, మలిరాజధాని అనుటకుగాని సాధనములు కావు. కాబట్టి ధాన్య కటకము శాతవాహనుల రాజధాని అగుట నిరాధారము

అసలు శాతవాహనులకు సంబంధించిన అన్ని శాసనము లందును రాజధాని ప్రసక్తి లేదు. కాని, కళింగాధిపతి ఖారవేలుని హాథీగుంఫ శాసనమున సూచన కలదు.[11] ఖారవేలుడు తన రెండవ రాజ్య సంవత్సరమున శాతకర్ణిని లెక్కచేయకుండ అతనిమీదికి తన రథ గజ తురగ పదాతిదళములను పశ్చిమదిశకు పంపినట్లు కలదు.[12]

## ప్రాకృతము

'దితియే చ వసే అచితయితా సాతకంనిం పచ్ఛిమదిసం
హయ గజ నర రధ బహులం దండం పఠాపయతి'

## సంస్కృతచ్ఛాయ

'ద్వితీయేచ వర్షే అచిన్తయిత్వా శాతకర్ణిం పశ్చిమదిశం
హయగజనర రథబహులం దణ్డం ప్రస్థాపయతి'

ఇందు శాతకర్ణి మీదికి ఖారవేలుడు తన సైన్యమును పశ్చిమదిశకు పంపినట్లు స్పష్టము. అనగా ఖారవేలునికి పశ్చిమ దిశను శాతకర్ణి కలడని అవగాహకము. సైన్యమును పంపుటకు హేతువు రాజ్యసంపాదనకాంక్ష. అందుకు రాజధానిని ముట్టడించుట అవశ్యకర్తవ్యము. కాబట్టి శాతకర్ణి రాజధాని ఖారవేలుని రాజధానికి పశ్చిమదిశను కలదని ఫలితార్థము. ఖారవేలుని రాజ్యము దక్షిణ కోసలము.[13] అనగా గంజాము, పూరి, కటక్ మండలములతోపాటు వింధ్యోపాంతాంధ్ర ప్రాంతము.[14] ఆ రాజ్యమునకు శ్రీకాకుళము, ధాన్యకటకము, దక్షిణదిశను కలవు. అవి పశ్చిమదిశను కలవనుట అసమంజసము. శ్రీకాకుళము కాని, ధాన్యకటకము కాని శాతవాహనుల రాజధాని అయిన, ఖారవేలుడు దండయాత్రకు సైన్యమును పంపవలసినది దక్షిణదిశకు కాని పశ్చిమదిశకు కాదు. కాబట్టి ఖారవేలుని కాలమున శ్రీకాకుళము కాని, ధాన్యకటకము కాని శాతవాహనుల రాజధాని కాదని నిర్ధారకము అంతేకాదు. ఖారవేలుని రాజ్యమునకు ప్రతిష్ఠానపురము పశ్చిమదిశను కలదు. కాబట్టి ఖారవేలుని కాలమున శాతవాహనుల రాజధాని ప్రతిష్ఠాన పురమని నిర్ధారకము. శాతవాహనుల రాజధాని ప్రతిష్ఠానపుర మనుటకు ఖారవేలుని హాథీగుంఫ శాసనము దిక్సూచి.

ఇక గ్రీకు భూగోళ శాస్త్రవేత్త టాలెమీ తెలిపిన సమకాలిక సమాచారము కలదు.[15] అది శ్రీ పులుమావి ప్రతిష్ఠాన పురమును పాలించుట

'Baithana (the royal seat) of [siro]
ptolemaios or polemaios...117° -18° 30° '

ఇందు గ్రీకు రూపమైన బైథాన గీర్వాణ రూపమైన ప్రతిష్ఠానపురము. గ్రీకు రూపమైన సిరోప్టోలిమాయియస్ లేక సిరోపోలిమాయియస్ గీర్వాణ రూపమైన శ్రీ పులుమావి. ఇది శ్రీ పులుమావి రాజధాని ప్రతిష్ఠానపుర మనుటకు నిర్ధారక సాధనము. కాబట్టి శ్రీ పులుమావి కాలమున శాతవాహనుల రాజధాని ప్రతిష్ఠాన పురమని నిర్ధారకము

మఱి శాతవాహనరాజు ఆస్థానకవి గుణాఢ్యుడు అందజేసిన సమాచారము కలదు గుణాఢ్యుడు పైశాచీ ప్రాకృత భాషలో రచించిన కృతి బృహత్కథ. అది కొంత అప్పుడే దగ్ధమయినట్లు కథ. కొంత మిగిలినది. అది నేడు అనుపలబ్ధము. ఉపలబ్ధమైన కాలమున అది సంస్కృతీకరింపబడినది. అందు మొదటిది బుధస్వామి అనువాదమైన బృహత్కథాశ్లోక సంగ్రహము. నేపాళ దేశములోని సంస్కృతీకరణము. రెండవది క్షేమేంద్రుని బృహత్కథా మంజరి. మూడవది సోమదేవభట్టు కథాసరిత్సాగరము. ఈరెండును కాశ్మీరదేశములోని సంస్కృతీకరణములు. క్షేమేంద్రుని బృహత్కథామంజరి యందు గుణాఢ్యుని జన్మస్థలము గోదావరీ నదీతటము నందలి ప్రతిష్ఠానమని కలదు.[16] సోమదేవభట్టు కథా సరిత్సాగరమున ప్రతిష్ఠానములోని సుప్రతిష్ఠిత నగరమని కలదు.

'ప్రతిష్ఠానేఽస్తి నగరం సుప్రతిష్ఠిత సంజ్ఞకమ్
తత్రాభూత్సోమశర్మాఖ్యః కోఽపి బ్రాహ్మణసత్తమః
వత్సశ్చ గుల్మకశ్చాపి తస్య ద్వౌ తనయౌ సఖే
జాయేతేస్మ తృతీయాచ శృతార్థా నామ కన్యకా
... ... ... ...

్రశుతార్థాయాః సుతోజాతస్త్వంహి జానీహిమాం సఖే
గణావతారో జాతో యం గుణాఢ్యో నామ బ్రాహ్మణః'
—శ్లో॥లు 8, 9, 19, 20; 6 తరం.1 /క. పీ /లంబ.

ఇందు ప్రతిష్ఠానము నందు సుప్రతిష్ఠిత మను నగరము కలదని, అందు సోమశర్మ అను బ్రాహ్మణుడు జన్మించెననియు, అతనికి వత్సుడు, గుల్మకుడు అను ఇద్దఱు పుత్రులు, శ్రుతార్థ అను ఒక పుత్రిక జన్మించిరనియు, శ్రుతార్థకు గుణాఢ్యుడు జన్మించెననియు స్పష్టము

'స్వయంచ గత్వా తత్రైవ ప్రతిష్ఠానపురాద్బహిః
కృత సంకేత ఉద్యానే తస్థౌ దేవీ వినిర్మితే'
— శ్లో. 12, తరం. 8, లంబ. 1.

ఇందు గుణాఢ్యుడును స్వయముగ వెళ్లి, ప్రతిష్ఠానపురము వెలుపల దేవీనిర్మితమైన ఉద్యానవనమున సంకేతమును ఏర్పఱచుకొని ఉండెనని కలదు. అనగా ప్రతిష్ఠానపురము ఒక మహానగరమనియు, అందు సుప్రతిష్ఠితము ఒక ఉపనగర మనియు సుద్యోతకము. అంతేకాదు' గుణాఢ్యునికి సంబంధించిన శాతవాహన రాజు ప్రతిష్ఠానపురములోని సుప్రతిష్ఠిత నగరము నందే రత్నసింహాసనా సీనుడైనట్లును కథాసరిత్సాగరమున కలదు.

'ఏవం ప్రాయాణ్యహం పశ్యన్ కౌతుకాని పదేపదే
ప్రాప్తవాన్ రాజభవనం మాహేన్ద్ర సదనోపమమ్
తతశ్చాన్తః ప్రవిష్టో హం శిష్యై రగ్రే నివేదితః
అస్థానస్థిత మద్రాక్షం రాజానాం సాతవాహనమ్
శర్వవర్మ ప్రభృతిభిర్మన్త్రిభిః పరివారితమ్
రత్నసింహాసనాసీన మమర్త్యై రివ వాసవమ్'
శ్లో॥లు 65-67, తరం 6, లంబ. 1.

ఇందు గుణాఢ్యుడు శిష్యసమేతముగ రాజభవనమునకు వెళ్లి, శర్వవర్మ ప్రభృతులతోను, మంత్రులతోను పరివేష్టితుడైన, రత్నసింహాసనాసీనుడైన, శాతవాహన రాజను దర్శించెనని సవివరముగ కలదు. రాజులు రత్న సింహాసనాసీను లగునది రాజధాని యందే కదా! కాబట్టి బృహత్కథాసంబంధి శాతవాహనరాజు రాజధాని ప్రతిష్ఠానపురమని కథాసరిత్సాగరమునుబట్టి కరతలామలకము.

కథాసరిత్సాగరము బృహత్కథాశేషమునకు సంస్కృతీకరణము. అది పదునొకండవ శతాబ్ది సంస్కృత కావ్యమైనను యథామూలకమని కవి కంఠోక్తి.

'యథామూలం తథైవైతన్న మనాగప్యతిక్రమః
గ్రన్థవిస్తర సంక్షేపమాత్రం భాషాచ భిద్యతే'
—శ్లో. 10. తరం. 1. లంబ 1.

ఇందు సోమదేవభట్టు కథాసరిత్సాగరమును యథామూలకముగ, ఏపాటి మూలాతిక్రమణమును లేకుండ సంతరించెననియు,

సంస్కృతభాషలో గ్రంథవిస్తర సంగ్రహ మాత్రమును సంఘటించెననియు స్పష్టము. కథాసరిత్సాగరములోని కథాపీఠలంబకము గుణాఢ్యుని శిష్యులు రచించినది. అనగా కథాసరిత్సాగరములోని అంశములెల్ల బృహత్కథోప బృంహణములని అర్థము. కాబట్టి బృహత్కథా సంబంధి శాతవాహనరాజు రాజధాని ప్రతిష్ఠానపురమని నిర్ధారకము.

కుతూహలుడు మహారాష్ట్రీ ప్రాకృతభాషలో రచించిన లీలావఈ (లీలావతీ) అను కావ్యమున సాతవాహనుని రాజ్యము అశ్మకరాజ్యమని, అతని రాజధాని ప్రతిష్ఠానపురమని[17] కలదు.

ఇక జైన గ్రంథములందు శాతవాహనుల రాజధాని ప్రతిష్ఠానపురమని బహుధా కలదు. శాతవాహనుల కాలములోని ఆవశ్యక సూత్రమున ఇట్లు కలదు :[18]

'భరుయచ్ఛే జిణదేవో భయంతమిచ్ఛే కులాణభిక్ఖూయ
పఇఠాణ సాలవాహన గుగ్గులు భగవం చ ణహవాణేః'.

ఇందు 'పఇఠాణ'ము ప్రతిష్ఠానము. ప్రతిష్ఠాన శాలివాహనుడు అనగా ప్రతిష్ఠాన రాజధాని పాలకుడు అయిన శాతవాహనుడని అర్థము. ఇదే గాథ ఇంచుక భేదమున అభిదాన రాజేంద్రమున కలదు.[19]

'భరు అచ్ఛే జిణదేవో భయంతమిత్తో కుణాలభిక్ఖూ అ
ప ఇఠ్ఠాణ సాలవాహణ గుగ్గులు భగవంచ నహవాణే'

ఇందు ఆవశ్యక సూత్రములోని అంశమే కలదు అంతేకాదు. అభిధానరాజేంద్రమున ఇంతకంటె స్పష్టమైన సందర్భము కలదు.

'ఇతః ప్రతిష్ఠానపురే పార్థివః శాలవాహనః
బలేనాపి సమృద్ధః స రురోధ నరవాహనం'

ఇందు ప్రతిష్ఠానపురమునరాజు శాలివాహనుడని స్పష్టముగ కలదు. ఇట్లు శాతవాహనుల రాజధాని ప్రతిష్ఠానపురమని ఆవశ్యక సూత్రము నందు, అభిధాన రాజేంద్రము నందు మాత్రమే కాదు; నిశీతచూర్ణి యందును కలదు.[20]

'Nisitha refers to Arya Kalaka, a contemporary of King Salivahana of paittana, who proceed to Persia (parasakula) and returned with ninty kings (Saha) to take revenge on King Gaddabhilla of Ujjeni, who is said to have abducted Kalaka's sister and kept her in his harem'.

ఇందు ప్రతిష్ఠానపురమున రాజైన శాలివాహనునకు కాలకాచార్యుడు సమకాలికుడని స్పష్టము. కాలకాచార్యుడు ప్రతిష్ఠాన శాలివాహన రాజునకు సమకాలికుడు మాత్రమే కాదు; శాతవాహన రాజు కోరికమీదట పజ్జూసణతిథిని (పర్యూషణతిథిని) పంచమి నుండి చతుర్థికి మార్చిన చరితార్థుడు.[21]

'Kalakacharya, who was a contemporary of king Satavahana, is particularly remembered in connection with changing the date of pujjusana (an annual feast) (Nisita curni 10, pp. 571 ff). It was at the request of Salivahana that Kalika charged the day of panchami to caturthi for pajjusana (also see caturvinsati, p. 15, p 136 ff, Prabandha cintamani 1, p. 17)

ఇందు 'శాతవాహన రాజు కోరికమీద కాలకాచార్యుడు పర్యూషణ తిథిని మార్చుట స్పష్టము. కాబట్టి శాతవాహనుల రాజధాని ప్రతిష్ఠానపురమని నిర్ధారకము

ఒక పూర్వ గ్రంథమునందైన, ఒక శాతవాహన రాజు రాజధాని అయిన, శ్రీకాకుళమని కాని, ధాన్యకటకమని కాని మచ్చునకైన కానరాదు. అట్టిది శ్రీకాకుళము తొలి రాజధాని, ధాన్యకటకము మలి రాజధాని అని మన ఆంధ్ర చరిత్రకారులు అనుట ఆంధ్రాభిమానమునకు నిదర్శన మగునేమో గాని, సత్యాన్వేషణకు సహకారి కాదు. కాబట్టి ఖారవేలుని హాథీగుంఫ శాసనములోని సూచనమును బట్టి, టాలెమీ తెలిపిన సమకాలిక సమాచారమును బట్టి, సోమదేవభట్టు యథామూలక కథాసరిత్సాగరమును బట్టి, కుతూహలుని లీలావఈ కావ్యమును బట్టి జైన గ్రంథములు ఆవశ్యక సూత్రము, అభిధాన రాజేంద్రము, నిశీతచూర్ణి మొదలైన వానినిబట్టి శాతవాహనుల రాజధాని ప్రతిష్ఠానపురమని నిర్ధారకము. ఇది భవిష్యోత్తర పురాణమును సంవదించునది.

'సేనాధ్యక్షస్తు కాణ్వానాంసాతవాహన వంశజః
సింహకస్వాతి కర్ణాఖ్యః శిముకో వృషలో బలీ
సమానీతైః ప్రతిష్ఠానా దన్ధ్రవంశ్యైః స్వసైనికైః
కాణ్వాయనం సుశర్మాణం నిహత్య స్వామినం నిజం
శుఙ్గా నాంచైవ యచ్ఛేషం క్షపయిత్వా తదవ్యసౌ
ఆన్ధ్రవంశ ప్రతిష్ఠాతా భవిష్యతి తతోనృపః'

ఇందు కాణ్వుల సేనాధ్యక్షుడు, శాతవాహన వంశజుడు, వృషలుడు, బలవంతుడు అయిన, సింహకస్వాతి కర్ణుడు అనుపేరు కల శిముకుడు ఆంధ్రవంశీయులైన తన సైనికులను ప్రతిష్ఠానము నుండి తీసి కొనిపోయి, తన స్వామి అయిన, కాణ్వాయన సుశర్మను వధించి, శుంగుల శేషమును నాశనము చేసి, ఆంధ్రవంశ ప్రతిష్ఠాత అగునని స్పష్టముగ కలదు. ఇది వాయు మత్స్య, విష్ణు, బ్రహ్మాండ, భాగవత పురాణము లందు బీజప్రాయముగ ఉన్న చరిత్రాంశమునకు పుష్పితవల్లి. ఇనాలోకయోగమున ప్రకాశించు పేటికాంతర్గత రత్నము. ఇందు శాతవాహనులు ఆంధ్రవంశజులని కలదు, వారు సైనికులని కలదు అందు శిముకుడు సేనాధిపతి అని కలదు. కాణ్వభృత్యుడని కలదు. నిజస్వామి అయిన సుశర్మను ఎట్లు వధించినదియు కలదు. శిముకుని పేరు సింహకస్వాతి కర్ణుడు అని కలదు. సింహక శబ్దము ప్రాకృతమున శిముక శబ్దమగుట సంగతము. అంతేకాదు. సింహక శబ్దము వాయు, బ్రహ్మాండ పురాణము లందు సింధుక శబ్ద మగుటయు సంభవము. భాగవతమున బలి అగుట బాహాటము. సింహక శబ్దము విష్ణు పురాణమున పుచ్ఛమును చేర్చుటకు పోషకము. కథా సరిత్సాగరములోని దీపకర్ణి వృత్తాంతమునకు స్ఫోరకము. బహువిషయభాసమానము. అనేక సంశయ నిరాకరణచణము. అంతేకాదు. శిముక శాత

వాహనుని సైనికస్థావరము ప్రతిష్ఠాన పురమున కలదని ప్రస్ఫుటము. అతడు స్థాపించిన శాతావాహన రాజ్యమునకు ప్రతిష్ఠాన పురము రాజధాని అగుట రాజ మార్గము. కాబట్టి భవిష్యోత్తర పురాణమును బట్టి కూడా శాతావాహనుల రాజధాని ప్రతిష్ఠాన పురమని నిర్ధారకము. ఇది స్థితి స్థాపనము.

ఆంధ్రులైన శాతావాహనుల రాజ్యము ఆంధ్రదేశ పరిమితము కాదు. దక్షిణా పథ పరివ్యాప్తము. నాగనిక నానాఘాట్ శాసనమున శ్రీ శాతకర్ణి దక్షిణా పథపతి అని కలదు [22]

## ప్రాకృతము

'[వ] రస సూరస అప్రతిహతచకస దఖి[నప]థ [పతినో]'

## సంస్కృత ఛాయ

'వీరస్య శూరస్య అప్రతిహతచక్రస్య దక్షిణాపథపతే'

ఇందు శ్రీశాతకర్ణి దక్షిణాపథపతి అని స్పష్టము అంతేకాదు· రుద్రదాముని జునాగడ్ శాసనమున సాతకర్ణి దక్షిణాపథపతి అని కలదు.[2]

'దక్షిణాపథపతే స్సాతకర్ణేః'

ఇందు సాతకర్ణి దక్షిణాపథపతి అని సుస్పష్టము· కాబట్టి ఆంధ్రులైన శాతవాహన రాజులు దక్షిణాపథపతులని నిర్ధారకము· దక్షిణాపథ మనగా నర్మదానదికి దక్షిణదిశనున్న భారతదేశము· అందు మహారాష్ట్రదేశము, విదర్భదేశము, కర్ణాటదేశము, ఆంధ్ర దేశము కనీసము శాతవాహనుల దక్షిణాపథరాజ్యమున అంతర్గతము. అంత విస్తృతమైన శాతవాహన రాజ్యమునకు ప్రతిష్ఠానపురము రాజధాని అగుట సంగతము· అంతేకాదు. రాజధానితోపాటు శాఖా నగరములును ఉండుట సహజము· అట్టి వ్యవస్థ అంతకుముందే మౌర్యసామ్రాజ్యమున కలదు· అర్వాచీనకాలమున ఆంధ్ర సామ్రాజ్య మున కలదు· శాతవాహన రాజ్యమునకును శాఖానగరములు కలవను టకు సాధనసంపత్తి కలదు·

శాతవాహనులకు సంబంధించిన శాసనములందు నాసికలో తొమ్మిది, నానాఘాట్‌లో రెండు, కార్లేలో మూడు, కన్హేరీలో మూడు మొత్తము పదునేడు శాసనములు మహారాష్ట్రదేశము లోని ప్రతిష్ఠానపురమునకు సమీపమున లభించినవి· సమీపమున లభించుట మాత్రమే కాదు; అందలి సమాచారమెల్ల ఆ ప్రాంతము నకు సంబంధించినది. కాబట్టి శాసనోపలబ్ధి మాత్రమేకాక, శాసనస్థవిషయమును శాతవాహనుల రాజధాని ప్రతిష్ఠానపురమను టకు సాధకము.

మరి అమరావతిలో రెండు, చినగంజాములో ఒకటి, పిఠా పురము దగ్గరి కొడవలిలో ఒకటి మొత్తము నాలుగు శాసనములు ఆంధ్రదేశములోని ధాన్యకటకమునకు సమీపమున లభించినవి. సమీపమున లభించుటమాత్రమే కాదు; అందలి సమాచారమెల్ల ఆ ప్రాంతమునకు సంబంధించినది· కాబట్టి శాసనోపలబ్ధిమాత్రమే కాక, శాసనస్థవిషయమును శాతవాహనుల ఒక శాఖానగరము ధాన్యకటక మనుటకు ఉపబలకము. అంతేకాదు· శాతవాహనులు అనగా ధాన్యము పండించువారని పూర్వోక్తము. కాబట్టి ధాన్య కటకసంజ్ఞ శాతవాహన సంబంధమునకు జ్ఞాపిక·

ఇక శాతవాహనుల శాసనము ఒకటి మేకదోనిలో లభించినది. అది బళ్ళారిమండలములోనిది. అనగా కర్ణాటదేశములోనిది. అది కర్ణాటదేశమున లభించుట మాత్రమే కాదు; అందలి సమాచార మెల్ల ఆ ప్రాంతమునకు సంబంధించినది· కాబట్టి శాసనోపలబ్ధి మాత్రమేకాక, శాసనస్థవిషయమును కర్ణాటదేశమున ఒక శాఖా నగరము కలదనుటకు ప్రోద్బలకము. మేకదోని శాసనమున మహా సేనాపతి ఖందనాగుని జనపదమునందు ప్రసక్తమైన సాతవాహని హారము శాఖానగరము కావచ్చును. అంతేకాదు; పురాణ రాజనామా వళియందు కుంతలశాతకర్ణి అని ఒకడు కలడు. కుంతలశబ్దము కుంతలదేశవాచకము. కర్ణాటదేశమే కుంతలదేశము· కుంతలదేశ మున శాఖానగరాధిపతి అయిన శాతకర్ణి కుంతల శాతకర్ణి అగుట నిరాఘాటము. అంతేకాదు. కుంతలదేశమున శాతవాహనరాజు పరి పాలించినట్లు రాజశేఖరుని కావ్యమీమాంసయందు కలదు.

'శ్రూయతే హి కున్తలేషు సాతవాహనోనామరాజా
తేన ప్రాకృతభాషాత్మక మన్తః పురమేవేతి'

ఇందు కుంతల (దేశ)ము నందు సాతవాహను డను రాజు ఉండెనని, అతని అంతఃపురము ప్రాకృతభాషామయమని స్పష్టము కాబట్టి కుంతలదేశమున శాతవాహనుల శాఖానగరముండుట నిర్ధారకము·

మరి గౌతమీపుత్త్రశాతకర్ణి నాసికశాసనమున అతను బేనా కటకస్వామి అని కలదు.[24] బేనా సమీపమున కల నగరము బేనా కటకము. బేనా అనునది ఒక నది ఉపనది. అది పెనగంగ లేక వైన్‌గంగ కాక మరొకటి కాదని డా॥ డి. సి. సర్కార్ నిర్ణ యము.[25] పెనగంగ, వైన్‌గంగ రెండును గోదావరీనదికి ఉప నదులు. తత్పరీవాహప్రదేశము విదర్భదేశము. పెనగంగి కంటె వైన్ గంగ బేనా అగుట సహజము. అనగా బేనా కటకము విదర్భదేశము నందలి నగరము· బేనాకటకస్వామి అనగా బేనాకటకస్థితస్వామి అని డాక్టర్ డి. సి. సర్కార్ సమన్వయము.[26] ఇది క్లిష్టార్థకల్పనము గౌతమీపుత్త్రశాతకర్ణి బేనాకటకస్వామి అని కల నాసిక శాసనము అచటి మంత్రి అయిన విష్ణుపాలితునికి గౌతమీపుత్త్ర శాతకర్ణి ఆజ్ఞప్తి. గౌతమీపుత్త్రశాతకర్ణి అక్కడే ఉన్నచో, మంత్రికి ఆజ్ఞప్తిని శాసన రూపముగ ప్రకటింపవలసిన ఆవశ్యకము లేదు. అంతేకాదు, బేనాకటకస్వామి అనగా బేనా కటకమునకు అధిపతి అనియే అర్థము. ఇది స్పష్టార్థప్రతిపత్తి కలది ఈ శాసనము బేనాకటకమున మంత్రి కలడనుటకు మాత్రమే సాధకము. బేనా కటకమున మంత్రి కలడనగా అచట రాజు కలడనియే అర్థము. ఆ రాజు గౌతమీపుత్త్రశాతకర్ణియే కానక్కరలేదు శాఖానగరాధిపతి కావచ్చును. శాఖానగరాధిపతి ఉన్నను ప్రధానరాజ్యాధిపతి రాజ ధాన్యధిపతియే. కాబటి విదర్భదేశమున బేనాకటకము శాఖానగరము కావచ్చును.

అసలు శాతవాహనులు అనగా ధాన్యము పండించువారని అర్థము. తదుపరి, వాసిష్ఠీపుత్త్ర పులుమావి నాసిక శాసనము అనుమాన ప్రమాణముగను, భాగవతభవిష్యోత్తర పురాణములు ప్రత్యక్ష ప్రమాణములుగను శాతవాహనులు శూద్రులు. కృషీవల కుటుంబులైన శూద్రులు సేనలో చేరుట సహజము. సేనాధిపతులు అగుట సమంజసము. సేనలో చేరిన ఆంధ్రవంశీయులైన శాతవాహనులు, కాణ్వభృత్యులు అనగా కాణ్వుల సేనాధ్యక్షులగుట సంభవము. కాణ్వుల రాజ్యము మగధ సామ్రాజ్యము. దానికి రాజధాని పాటలీపుత్రము అది ఉత్తరాపథమున గంగానదీతటమున కలదు. కనుక దక్షిణాపథమున గోదావరీతటమున ప్రతిష్ఠానపురము కాణ్వుల శాఖానగరము కావచ్చును. కానిచో కాణ్వుల సేనాధ్యక్షుడు ప్రతిష్ఠానపురమున ఉండుట పొసగదు. కాణ్వుల శాఖానగరమైన ప్రతిష్ఠానపురమున సేనాధ్యక్షుడుగ ఉన్న శిముకశాతవాహనుడు పాటలీపుత్రములోని 'నిజస్వామి' సుశర్మను వధించుట సుసంగతము. అతడు దక్షిణాపథ రాజ్యమును — అనగా ఆంధ్రరాజ్యమును — అనగా శాతవాహన రాజ్యమును స్థాపించుట, శాఖానగరమైన ప్రతిష్ఠానపురమును రాజధానిని చేయుట సుసంభవము. అమరావతిలోని అనామకవ్యక్తి మగధసామ్రాజ్యముమీద దండయాత్రచేయుటకంటె, ప్రతిష్ఠానపురములోని సేనాధ్యక్షుడు పాటలీపుత్రములోని నిజస్వామి సుశర్మను వధించుట, దక్షిణాపథ రాజ్యమును స్థాపించుట సులభము. ఇంతకంటె ఆంధ్రుడైన శిముకశాతవాహనుడు కాణ్వుడైన సుశర్మను చంపి, దక్షిణాపథ రాజ్యమును స్థాపించుటకు సమంజసమైన సమన్వయము దుర్లభము. కాబట్టి భవిష్యోత్తర పురాణములోని 'ప్రతిష్ఠానాత్' అను పద ప్రయోగమునుబట్టి మాత్రమే గాక, ప్రకరణమునుబట్టి సహితము దక్షిణాపథపతులైన శాతవాహనుల రాజధాని మహారాష్ట్ర ప్రాంతములోని ప్రతిష్ఠానపురము అని, ఇతర సాధన సంపత్తినిబట్టి విదర్భ ప్రాంతములోని బేనా కటకము, కర్ణాట ప్రాంతములోని సాతవాహనిహారము, ఆంధ్ర ప్రాంతములోని ధాన్యకటకము శాఖానగరములని నిర్ధారకము.

సమష్టిపై శాతవాహనుల రాజధాని ప్రతిష్ఠానపురమని; ధాన్యకటకము, బేనాకటకము, శాతవాహనహారము శాఖానగరములని సిద్ధాంతము.

## అధోజ్ఞాపికలు

1. Early History of the Deccan, P-23
2. Early History of the Andhra Country, P-5
3. హిందూమహాయుగము, పు. 187
4. ఆంధ్రుల చరిత్ర, పూర్వభాగము, పు. 132
5. Early History of the Andhra Country, P 5
6. లక్ష్మణరాయ వ్యాసావళి, పుటలు 122–126
7. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సం. 28, సం. 4. పుటలు 224–241
8. ఆముక్తమాల్యద, 11 వచ., అ. 1.
9. Epigraphia Indica, Vol. XXXV, 1963-64, PP 40–43
10. Epigraphia Indica, vol. xxxv, 1963 – 64, PP. 40–43
11. ఇది డా|| వి. యస్. సూక్తాంకర్ సూచించిన విషయము (ABi, 1,21, ff; The Early History of Deccan, parts I–IV, Ed. by G. Yazdani, p. 73) అది సరికాదని డా|| మారేమండ రామారావు గారి అభిప్రాయము. (సాతవాహన సంచిక, పుటలు 36,37)
12. select Inscriptions, PP. 206–213
13. New aspects of History of Orissa, PP. 10–12
14. A History of India, P. 102
15. Ancient India as described by ptolemy, PP. 173–177
16. History of classical Sanskrit Literature, P.417,
17. సాతవాహన సంచిక, పు. 222
18. JBORS, Vol. xvi, PP. 200–201& సాతవాహన సంచిక అను. , పు. 52
19. JBORS, Vol. xvi, PP. 291–92& సాతవాహన సంచిక అను. , పు. 53
20. Life in ancient India as depicted in the Jain cannons, P. 41
21. Life in ancient India as depicted in the Jain cannons, PP. 29 & 397.
22. Select Inscriptions, P. 189
23. Ibid, P. 172
24. Select Inscriptions, P 191
25. Select Inscriptions, F. N. 4
26. Ibid. బేనా కటకమునకు ధనకట పాఠకల్పనము. ధనకట మనగా ధాన్యకటక మను సమన్వయము కలవు గాని అవి సమంజసములు కావు (సాతవాహన సంచిక, పు. 33.)

## కవితో పనేమిటి?

( 50వ పేజీ తరువాయి )

చాలు అది ఆకర్షణీయం
పద గుంఫన !
భావౌన్నత్యం
శైలీ లాలిత్యం
అమోఘం
అద్భుతం
అనిర్వచనీయం
కవితో ఏం పనీ...పూర్ ఫెలో !

శ్రీ చందు సుబ్బారావు

# హస్తిమశకాంతరం

'మహారాజరాజశ్రీ రాజమాన్య రాజపూజితులు, అత్యంత గౌరవనీయులు, మిక్కిలి ఘనవంతులూ అయిన శ్రీరామచంద్రరావు గారి దివ్య సముఖమునకు' — అనిరాసి, ఒక గంటసేపు ఆలోచించిన తర్వాత ఆ వాక్యం కొట్టివేసాడు సూర్యనారాయణ.

'ప్రియమైన రామచంద్రరావుకు' అని ప్రారంభించాడు.

నీ స్నేహితుడు సూర్యనారాయణ వ్రాయునది ఇంతటి గొప్పవాడవు మహారాజువి అయిన నిన్ను సంబోధించి ఈ ఉత్తరం వ్రాయటానికే భయపడుతున్నాను. ఇది ఎంత అపచారమో ఊహించలేకున్నాను. కాని నిన్ను అత్యంత గౌరవంగా సంబోధించి వ్రాస్తే, అసలు నేనెవరో కూడా గుర్తించలేక నీ సహాయాన్ని, కరుణా కటాక్షాన్ని నిత్యం కోరే కోటానుకోట్ల ప్రజల్లో ఒకడిగా ఉత్తరం నీ కార్యదర్శులు అవతల పారేస్తారని శంకించి మాత్రమే ఇలా వ్రాస్తున్నాను.

నా ఈ దోషానికి ఏ దండనకైనా సంసిద్ధుడను నువ్వు నా శిరస్సు ఖండించమని ఆజ్ఞాపిస్తే అదిచాలు, ఈ జన్మ తరించటానికి. నీ పేరు ఉచ్ఛరిస్తూ కడసారి శ్వాస వదుల్తాను.

మా బ్రతుకులొక బ్రతుకులా రామచంద్రా. నీబోటి శ్రీరామచంద్రుల పాద ధూళి ఏరుకుని మా శిరస్సుల మీద జల్లుకుంటే పది జన్మలకు ముక్తి. రక్తి. సూక్ష్మజీవులమై పుట్టి, నికృష్ట జీవులుగా గిట్టే నాబోటి వాళ్ళకు స్నేహితుడవని చెప్పుకోవడం కూడా నీకు అవమానం కాదా 'రామం'.

చూసారా 'రామం' అంటున్నాను అంటాను. నేటికి యాభై ఏళ్ళనాడు మారేడుపల్లి జిల్లా బోర్డు హైస్కూల్‌లో నాతో పాటు ఆరేళ్ళు కలిసి చదువుకున్న నేరానికి ఇలా అవమానిస్తున్నాను. అలనాడు కుచేలుడు 'కృష్ణ' అన్నాడు. కాని ఆయన పరమ భక్తుడు. భాగవతోత్తముడు. నిత్యం తన స్నేహితుణ్ణి హృదయంలో పూజించిన వ్యక్తి. మరి నే నంతటి వాణ్ణా.

లేదు రామం. లేదు. అహంకారిని. సిగ్గుమాలిన వాణ్ణి. అప్పట్లో నిన్ను ఆశ్రయించి సహాయం కోరమని నా భార్య సతపోరినా అభిమానం అడ్డొచ్చి ససేమిరా వీల్లేదన్నాను. ఈ వేళయినా వచ్చి నీ కాళ్ళమీద పడకుండా ఉత్తరం వ్రాస్తున్నాను. ఉత్తరాలు, వర్తమానాలు పంపటానికి నీ సామంతరాజునా రామం. కనీసం సమహోదాకల్గిన వాణ్ణయినా కానే. ఎంతకు సాహసిస్తున్నానో తలుచుకుంటే గుండె ఆగిపోచేటట్లుంది.

రిటైర్డైన గుమస్తా పీనుగును. కొడుకులు వదిలేసి వెళ్ళిపోతే, పింఛనుతో బ్రతకలేక అయినవాళ్ళ కానివాళ్ళ పంచల్లో తల దాచుకుంటున్న వాణ్ణి. ఈ దేశానికి రాజు నా స్నేహితుడంటే ఎవరయినా నమ్ముతారా రామం.

ఎవరూ నమ్మక్కర్లేదు. నువ్వు నమ్మితే చాలు. నువ్వు నన్ను గుర్తుపడితే చాలు. అలనాడు మారేడుపల్లిలో దొంగతనంగా చెరుకులు కోసుకుని చెరి ఒకవైపు కొరుక్కుతిన్నామని —

చెరువులో ఈతలువేసి రుద్రయ్య పంతులుగారి చేత ఒకే బెత్తంతో దెబ్బలు తిన్నామని,

తాటికాయంత అక్షరాల్తో 'కమల' పేరు హైస్కూలు గోడల మీద వ్రాసి హెడ్మాస్టరుతో చివాట్లు తిన్నామనీ గుర్తుందా కమలమ్మ తల్లి నిన్ను చేబట్టి కల్యాణమాడినందున, నువ్వు చేసిన అల్లరి మర్చిపోయుంటుంది. కాని ఆ అల్లరిలో భాగం పంచుకున్న ఈ దౌర్భాగ్యుణ్ణి క్షమించిందో లేదో. పాల సముద్రం వంట కమలమ్మ హృదయాన్ని ఆనాడు గాయపరిచిన పాపమేనేమో రామచంద్రా — ఇంట్లో ఇల్లాలితో ఒక్క మంచి మాటకూ, మనశ్శాంతికీ నోచుకోలేదు. నాలుగు దశాబ్దాల కాపురంలో పడి కాలిపోయినా చావని శరీరం ఇది. ఎందుకడుగుతావులే రామచంద్రా...

స్కూల్ ఫైనల్ పరీక్షల్లో నిద్రలేకుండా చదివి, మరునాడు నువ్వు పరీక్ష హాల్లో పడిపోతే మోసుకొచ్చింది ఈ సూరిగాడేనని గుర్తుందా రామం. ఆనాడు మనిద్దరికీ ఆప్తమిత్రుళ్ళా ఉండే వెంకటయ్య, బక్కపలచగా చామనచాయిలో ఉండే మనిషి మొన్నే గుంటూరు జనరల్ ఆసుపత్రిలో కన్నుమూసాడు. కడకు శవాన్ని పుచ్చుకునే వాళ్ళు కూడా లేక, వైద్యులే స్వాధీనపరుచుకున్నారట. బ్రతికుండే రోజుల్లో నేనూ వెంకటయ్య కలిసినపుడు నీ పేరు తప్ప మరో స్మరణ లేదు రామయ్యా.

నిన్ను చూడకపోయినా రోజూ నీ కంఠం వింటూనే వున్నాను. చిరునవ్వు చిందించే నీ స్ఫురద్రూపం చూస్తూనే వున్నాను.

రాజ్యాలు తిరుగుతున్నట్టు, రాజులు వస్తున్నట్టు, పోతున్నట్టు, విందులు విలాసాలతో కులాసాగా కబుర్లు చెబుతున్నట్టు చూస్తూనే వున్నాను.

ఇంకా నా రామానికి నేను గుర్తుండకపోతే ఏం ?

రామేశ్వరం పోయిన తర్వాత కూడా ఈ శనీశ్వరుడు నీకు దాపురించకపోతే నష్టమేమీ లేదు కదా.

అసలు నీ తప్పంటూ ఏమీ లేదు. తప్పంతానాదే జిల్లాబోర్డు ప్రెశిడెంటుగా ఉంటున్నప్పుడు అనేక మార్లు మా ఆఫీసుకు పని గట్టుకుని వచ్చి, కౌగలించుకుని మాట్లాడేవాడివి. అప్పుడు అది నా అర్హత అనుకున్నాను కాని నీ 'మంచితనం' అని భావించలేదు.

నువ్వు రాష్ట్రంలో మంత్రి అయిన తర్వాత ఒకసారి గుంటూరులో ప్రభుత్వ కళాశాల ప్రారంభోత్సవాని కొచ్చినప్పుడు నన్నుచూసి 'హలో' అని వెళ్ళిపోయావు. అహం దెబ్బతిన్నవాణ్ణాయి నిష్ఠూరం పెంచుకున్నానే కాని, నీ కాలం ఎంత విలువైనదో నువ్వు నా లాంటి ఎన్ని లక్షల మందిని రోజుకు 'హలో' అని పలకరించాలో గ్రహించలేక పోయాను.

తర్వాత పదేళ్ళకు అరవై అయిదులో కామోసు. నువ్వు భారతదేశం యావత్తుకూ మంత్రివై విజయవాడ విచ్చేసినప్పుడు నేను పనిగట్టుకొచ్చి నీ కళ్ళకు కనిపించాను. అప్పటికే నా నెత్తి మీద జుట్టంతా పోయింది. బుగ్గలు చొట్టలు పడ్డాయి. ఉన్నకాస్త జుట్టూ నెరిసిపోయింది. నువ్వు గుర్తుపట్టలేదు. కాలం కఠిన హృదయానికి మన స్నేహం బలయిపోయిందని ఆ క్షణంలోనే గుర్తించాను రామా. నన్ను చూసిన నీ కళ్ళు కదిలిపోతుంటే, మణిమాణిక్యాలు జారిపోతున్నట్లూ, నా సామ్రాజ్యం కాలిపోతు న్నట్టూ అనిపించింది. నా 'అహం' పూర్తిగా చచ్చిపోయింది. సూటిగా ని దగ్గరకొచ్చి చాటుగా తీసుకువెళ్ళి కౌగలించుకోవాలని పించింది.

తెలిసిన వాళ్ళంతా నిన్ను కలుసుకోమని ఎన్నోసార్లు హెచ్చరించారు. పెద్దవాడి ఉద్యోగం సందర్భంలోనూ, రెండోవాడి ట్రాన్స్‌ఫర్ కోసరమూ, నా ప్రమోషన్ విషయంలోనూ నిన్ను ఆశ్రయించమన్నారు. అహం చచ్చిపోయిన నన్ను సిగ్గు వెంటాడింది.

అప్పులు తీర్చటానికి అడ్డమైన వాళ్ళ కాళ్ళూ పట్టుకున్న ఈ చేతులు నీకు ఒక్కసారి నమస్కరించలేకపోయాయి. ఆఖరికి రిటైరయినప్పుడు పించను గొడవల్లో పడి ఏడాదిపాటు రాకపోతే ముసలి వాళ్ళిద్దరమూ, పెళ్ళికాని కడగొట్టు ఆడపిల్లా అర్ధ భోజనా లనుభవిస్తూ కూడా 'రామా' అనలేకపోయాను.

నేను క్రిందికి దిగజారే కొద్దీ నువ్వు దూరమైపోయావు. అందని పండవైపోయావు రామం. ఏళ్ళు గడచిపోయాయి. ఊళ్ళు నగరాలైపోయాయి. బళ్ళు ఓడలైపోయాయి నా రామం ఈ దేశానికి రాజుగా ఎన్నికయ్యాడన్న వార్త విని...

రామా...సుగుణాభి రామా ... మా హృదయాభి రామా ... అనుకుంటూ పార్కులో వెర్రిగా తిరిగాను. నా స్నేహితు లిద్దరు ముగ్గురికి కాఫీ లిప్పించాను. కనిపించినవాళ్ళకల్లా చెప్పాను. 'నాకు ఆయన బాగా తెలుసుననీ...చిన్ననాటి స్నేహితుడనీ' చెబితే 'అప వయ్యా హరి కథలు' అన్నారు రామం. పరిహాసం చేసారు. కుర్ర వాళ్ళు ఫక్కున నవ్వారు.

మన పరిచయానికి సాక్ష్యంగా మిగిలిన ఒకే ఒక్క వస్తువు మన స్కూల్ ఫైనల్ ఫొటో — తీసుకువెళ్ళి చూపిద్దును కాని — నా దరిద్రానికి చిహ్నంగా అదెప్పుడో చెదల పాలయ్యింది. పోతే పోయింది. నా గుండెల్లో బొమ్మలేదూ, అది చెరిగి పోతుందా— నా దరిద్రం దాన్ని కరిగించేయ కలదా.

ఈ నా సొదకేంగాని రామచంద్రయ్యా ..

నువ్వు రోజూ ముప్పయి కూరల్తో భోంచేస్తావటగా. నీ భవంతిలో మూడు వందలమంది బంట్రోతు లుంటారటగా నీ ఇంటి చుట్టూ తోట మన మారేడుపల్లి అంత ఉంటుందా. ఒక్క సారి నువ్వు ఇతర దేశ నాయకుడికి విందుచేస్తే లక్ష రూపాయ లవుతాయటగా రామా. లక్ష రూపాయలు! నా బోటివాడు మూడు జన్మ లెత్తినా లక్ష రూపాయల ఖరీదు చెయ్యడు కదూ.

రామం —

ప్రతి వస్తువుకీ ధరలిలామండిపోతున్నాయ్. ప్రజలు అలమ టిస్తున్నారు. ఉన్నవాడిది రాజ్యమైపోయింది. జనం ఇల్లూ వాకిలీ అమరక అల్లాడిపోతున్నారు. నువ్వొక్క కలం గీటుతో మార్చెయ్య లేవా రామచంద్రా ...

పిచ్చిగా వ్రాస్తున్నాననుకో. నీ ఇబ్బందులు నీ కుంటాయి. కాని రామచంద్రా .. అంతా నీ క్రిందవాళ్ళేనట గదా. కనీసం ఈ ముసలి పింఛనుదార్లకయినా సకాలంలో పింఛనిప్పించే ఏర్పాటు చెయ్యలేవూ. పీనుగులమీద పిశాచాల్లా ఈ అరవై రూపాయల్లోనే లంచమడిగేవాళ్ళను కొరత వేయించలేవూ.

ఇవన్నీ నీకు కూర్చోబెట్టి చెబుదామనుంది. మళ్ళీ నీకు తెలియకుండా ఉంటాయా. పత్రికలు, రేడియో, గూఢచార్లు చెబు తారు కదా అనిపిస్తుంది.

రామం. నమ్మూ, నమ్మకపో. పదవిలో ఉన్నావు కనుక భక్తి ఒలకబోస్తున్నాననుకున్నా సరే నువ్వు విమానంలో వచ్చి నట్టు, వందల మంది పోలీసులు బందోబస్తు చేసినట్లు, ఊరంతా తిరిగి మా యింటి కొచ్చి నాతో భోంచేసినట్లు గంటలు గంటలు మాట్లాడినట్టు కలలొస్తాయి ఎందుకో. ఈ అల్పుడికా కోర్కె మనస్సులో ఉండిపోయి అలా వస్తున్నాయేమో అనుకుంటాను.

చచ్చిపోయేముందు నిన్ను చూడాలని వుంది. నీ భార్యామణి కమలమ్మను కళ్ళారాచూసి ఆనందించాలని వుంది. నాకు ఏ సహా యమూ వద్దు. నీ దగ్గరకుపోయి చేయి చాచి ఏదైనా అడగమం టారు వీళ్ళు. నా భార్య అయితే వెళ్ళొద్దనే అంటుంది!

'వయసున్నప్పుడు ఒక్కసారిపోయి ప్రాధేయపడమంటే వెళ్ళ లేదు. ఈ ముసలితొక్కు ఆయనకు గుర్తా, పాడా. ఢిల్లీకి కాదు వల్లకాటికి పో' అని శాపనార్థాలు పెడుతుంది.

అయినా నీ వైభవం, ఠీవి, రాజరికం చూసిన తర్వాత ఈ కళ్ళు కదలవు. ఈ గుండె ఆడదు ఈ చెయ్యి లేవదు. పార్వతీ పరమేశ్వరులవంటి మీ యిద్దర్నీ చూసిన తర్వాత కూడా ఈ పాపిష్టి నోరు మాట్లాడుతుందనుకోను.

మొన్న మా వూరు మీదుగా నువ్వూ, నీ బలగమూ బందరు దివిసీమకు వెళుతున్నావని తెలిసి నీ దర్శనంకోసం ఎండలో నాలుగ్గంటలు నిలుచున్నాను. ముందు ముప్ఫయి కార్లు, వెనక ముప్ఫయి కార్లు - మధ్యలో మహరాజులా నిలబడ్డ నిన్ను చూద్దామనుకుని ముందు కదుగు వెయ్యబొయ్యేంతలో వెనక్కు నెట్టేసారు పోలీసులు. కళ్ళజోడు పడిపోయింది.

క్రిందికి వంగి కళ్ళజోడు తడుముకునేంతలో శ్రీరాముడు వెళ్ళిపోయాడు. కన్నుమూసి తెరిచేంతలో కనుమరుగై వెళ్ళిపోయాడు.

మళ్ళీ చూస్తానో లేదో, ఈ జన్మకు అనిపించింది.

అందుకని తెగించి ఈ జాబు వ్రాస్తున్నాను. నాకు ఆ ఢిల్లీ ముక్కూ మొహం తెలియదు రామచంద్రా. రాజభవంతికి చేరతానో లేదో, అనుమతి లభిస్తుందో లేదో, నా మనస్సు గ్రహించి లోనికి రప్పిస్తావు కదూ. కమలమ్మను చూపిస్తావు కదూ.

నీ పాదరేణువుకు తులతూగే
నీ చిన్ననాటి స్నేహితుడు.
కె సూర్యనారాయణ వ్రాలు

ఉత్తరం ముగించి, కాగితాలు మడిచి కవరు కొనటానికి డబ్బులకై జేబులో వెదికాడు సూర్యనారాయణ. లేవు.

పెట్టె అడుగున ఏదైనా పావలా బిళ్ళ దొరుకుతుందేమో అని ట్రంకుపెట్టె తెరిచాడు. పెట్టెమోత పెట్టేసింది భార్య కాంతమ్మ.

'ఏంటి, వెతుకుతున్నావ్' వంటింట్లోంచి కేకవేసింది. సూర్యనారాయణ తటపటాయించాడు.

'నిన్నే అడుగుతుంట పెట్టెతో పనేమొచ్చిందంటున్న' కాంతమ్మ గొంతులో అదిలింపు ధ్వనించింది.

'రామచంద్రయ్యకు ఉత్తరం వ్రాద్దామని...డబ్బులేవైనా ఉంటే కవరొకటి కొనుక్కొద్దామని ..' భయపడుతూ సూర్యనారాయణ గొణిగాడు...'ఏం మాటలు వినబోతున్నానో' అనుకుంటూ...మాటలు పూర్తి కాకుండానే కాంతమ్మ లేచొచ్చి,

'ఓసి నీ ముసలాడు చావ. ఈ పిచ్చి ఒదల్దు కదా ఈయనకి రామచంద్రయ్యట రామచంద్రయ్య. ఈయన పిన్నత్త కొడుకులాగా. ఢిల్లీ పోతాడంట మొహం. ఏనిగలొచ్చి దండేసి ఎక్కిచ్చి కెళతాయి. పింఛను గుమ్మాన్కొస్తే ఒచ్చాడని...ఇటియ్యదసలు...' ఉత్తరం లాక్కుని చించి కాలే కాలే పొయ్యిలో పారేసింది.

'ఢిల్లీ పోతాడంట. పోలీసోడు లాటీతో డొక్కలో పొడిస్తే గుటుక్కుమంటావు. నా మొహానికి ముండరాత కూడాను. దమ్మిడీ తేటం చేతకాదు...పొద్దున్నుంచి కూచుని చిట్టారాసాడు చూడూ...'

మంటల్లోని అక్షరాల్ని చూస్తూ 'సెలవు' అని దణ్ణం పెట్టాడు సూర్యనారాయణ!

# ఆంధ్రపత్రిక
# సిద్ధార్థి నామ సంవత్సరాది సంచిక

## మనవి

ఎప్పటిలాగే ఆంధ్రపత్రిక ఉగాది సంచిక (సిద్ధార్థి నామ సంవత్సరాది సంచిక) కి తమ రచనలు పంపవలసిందిగా రచయిత (త్రు) లకి మనవి చేసుకుంటున్నాము.

రచనలు జనవరి ఆఖరిలోగా మాకు చేరేట్లు పంపాలని కోరుకుంటున్నాము.

కవరుమీద, వ్రాతప్రతిమీదకూడా స్పష్టంగా "ఉగాది సంచిక"కి అని రాయాలని మనవి చేసుకుంటున్నాము.

సంపాదకుడు.

## ప్రాంతీయ భాగములు - సంఖ్యలు

శాసనములు ఆసక్తిదాయకములైన సమస్యలను రేకెత్తించును. ఇట్టి సమస్యలలో కొన్ని శాసనము లందు ప్రాంతీయ విభాగములతో పాటు పేర్కొనబడిన సంఖ్యలు గ్రామ సముదాయములా, జనాభాయా, లేక గ్రామాదాయాములా అని నేటివరకు అపరిష్కృతముగా నిలిచిపోయినవి.

తెలుగు, కన్నడ దేశములందు లభ్యమైన శాసనములలోని ప్రాంతీయ విభాగముల వెనువెంటనే పొందుపరచబడిన సంఖ్యలు క్రింది పట్టికలో వివరింపబడినవి.

| వరుస సంఖ్య | ప్రాంతీయ విభాగము | నంబరు | | రెఫరెన్సు, (ఆధారముల) |
|---|---|---|---|---|
| 1 | ఆదవాని | 500 | | S. I. I Vol. IX – 1 Nos. 226 & 240 |
| 2 | ఆంధ్రదేశము | 16, 000 | చూడు | S. I. I Vol. X – 177. |
| 3 | అత్తిలినాడు విషయ | 70 | ,, | Annual report 1937 – 38. No. 5. |
| 4 | అయిజే | 300 | ,, | S. I. I Vol IX – 1 No. 134. |
| 5 | అయ్యనవాడి | 300 | , | S. I. I Vol IX – No. 122. |
| 6 | బల్లకుండె | 3, 000 | ,, | S. I. I Vol IX – No. 101, 107. |
| 7 | ,, | 300 | ,, | S. I. I Vol IX – Nos. 80, 88, 98, 99, 104, 109, 128, 131 & 267. |
| 8 | బంగి చెరువు | 30 | ,, | S. I. I Vol IX – 1 No 208. |
| 9 | బనవాసి | 12, 000 | ,, | S. I. I Vol IX – 1 Nos. 233, 229 & 330. |
| 10 | బేంగి | 12, 000 | ,, | S. I. I Vol IX - 1 No. 313. |
| 11 | బెళుహుగె | 70 | ,, | S. II. Vol IX – 1 No. 389. |
| 12 | బన్నెకల్లు | 12 | ,, | S. I. I Vol IX – 1 No. 343. |
| 13 | బెన్ననూరు | 12 | ,, | S. I. I Vol IX – 1 Nos. 105, 389. |
| 14 | బెన్ననూరు | 12 | ,, | S. I. I Vol IX – 1 No. 373. |
| 15 | బిక్కిగ | 70 | ,, | S. I. I Vol IX – 1 No. 215. |
| 16 | ఇడడోర్ | 2, 000 | ,, | S. I. I Vol IX – 1 No. 80. |
| 17 | ఎనమదల | 6,000 | ,, | S. I. I Vol IX – 1 No. 213. |
| 18 | గంగవాడి | 96, 000 | ,, | S. I. I Vol IX – 1 Nos. 80, 229. |
| 19 | గురిజె | 70 | ,, | S. I. I Vol IX – 1 No. 226. |
| 20 | హొమ్మహటి | 90 | ,, | Annual report 1937 - 38 - No. 226. |
| 21 | హుళిగెరె | 300 | ,, | S. I. I Vol IX – 1 329, 330. |
| 22 | కదంబళిగె | 1000 | ,, | S. I. I Vol IX – 1 Nos. 80, 87, 88, 94, 99, 101, 104, 107, 109, 125, 128, 267, 293. |
| 23 | కందిపరవి | 70 | ,, | S. I. I Vol IX – 1 No. 80. |
| 24 | కందుకూరు | 24 | ,, | S. II Vol IX – 1 No. 294. |
| 25 | కణియకల్లు | 300 | ,, | S. II Vol IX - 1 No 99, 122, 146, 208, 209. |
| 26 | కన్నె | 300 | ,, | S. I. I Vol IX – 1 Nos. 147, 402. |
| 27 | కరివిడి | 30 | ,, | S. II Vol IX – 1 No. 80. |
| 28 | కపటక | 12 | ,, | S. I. I Vol IX - 1 No. 250. |
| 29 | కోగళి | 500 | ,, | S. I. I Vol IX – 1 Nos. 57, 58, 59, 64, 66, 77. 80, 87, 88, 94, 96, 99, 101, 104, 107, 109, 129, 215, 248, 251, 264, 267, 276, 293 & 332. |

| వరుస సంఖ్య | ప్రాంతీయ విభాగము | నంబరు | | రెఫరెన్సు, (ఆధారములు) |
|---|---|---|---|---|
| 30 | కొతుర | 12 | చూడు | S. I. I Vol IX – 1 No. 264. |
| 31 | కుడిహార | 70 | ,, | S. I. I Vol IX – 1 No. 80. |
| 32 | కుడికల్లు | 24 | ,, | S. I. I Vol IX – 1 No. 279. |
| 33 | కుడియహారవి | 70 | ,, | S. II Vol IX – 1 Nos. 88, 104. |
| 34 | కుడియపె | 40 | ,, | S. I. I Vol IX – 1 No. 221. |
| 35 | కుక్కనూరు | 30 | ,, | S. I. I Vol IX – 1 No. 66. |
| 36 | ఆరువేల దేశప్రభువు | 6000 | ,, | S. I. I Vol X – 191, 197. |
| 37 | మల్లగ్రామ | 30 | ,, | Annual report 1934–35 No. 22. |
| 38 | మంచలు | 36 | ,, | S. I. I Vol. IX – 1 No. 240. |
| 39 | మాసివాడి | 100 | ,, | S. II Vol IX – 1 No. 66. (66) |
| 40 | మాసెనవాడి | 140 | ,, | S. I. I Vol IX – 1 Nos. 57, 58, 59, 61, 64, 80 & 93. |
| 41 | ములికి | 300 | ,, | Annual report 1937 – 38 No. 226. |
| | | | ,, | S. I. I Vol IX – 1 No. 227. |
| 42 | ములికి | 500 | ,, | Annual report 1937 – 38 No. 235. |
| 43 | ముల్తగె | 30 | ,, | S. I. I Vol IX – 1 No. 129. |
| 44 | నరవాడి | 500 | ,, | S. I. I Vol IX – 1 No. 147. |
| 45 | నొళంబవాడి | 32, 000 | ,, | S. I. I Vol IX – 1 Nos. 80, 87, 101, 104, 126, 129, 133, 201, 203, 206, 211, 215, 216, 245, 248, 251, 255, 257, 260, 261, 276, 329 & 330. |
| 46 | పాకనాడు | 21, 000 | ,, | S. I. I Vol IV No. 935. and Vol. VI No. 628. |
| 47 | పలియాండ | 4, 000 | ,, | S. I. I Vol IX – 1 No. 108. |
| 48 | పెదకాలు | 800 | ,, | S. I. I Vol IX – 1 No. 147. |
| 49 | పెద్దకల్లు | 800 | | Annual report 1938 – 39 No. 226. |
| 50 | పొంబిగె | 70 | ,, | S. I. I Vol IX – 1 202. |
| 51 | పొత్తపినాడు | 300 | ,, | Annual report for the year 1937–38, C. P. C 26 & J. A. H. R. S. Vol. No. 11 P. P 80. |
| 52 | రేనాడు | 70 | , | S. I. I Vol No IX – 1 No. 402. |
| 53 | రొడ్డ | 300 | ,, | S. II. Vol IX – No. 146. |
| 54 | సిందవాడి | 1000 | ,, | S. II. Vol IX – 1 Nos. 58, 60, 105, 107, 121, 123, 157, 190, 202, 218, 226, 228 250, 279, 295 & 364. |
| 55 | సులియనూరు | 70 | ,, | S. I. I Vol VI – No. 150. |
| 56 | సుందరవట్టి | 12 | ,, | S. II Vol IX – 1 No. 77. |
| 57 | తలాండి | 12 | ,, | S. I. I Vol IX – I Nos. 702, 707. |
| 58 | వప్పంగి | 30 | ,, | S. I. I Vol IX – 1 Nos. 124, 339. |
| 59 | వడుగవళ్ళి | 12 | ,, | S. I. I IX – 1 No. 5. |
| 60 | వెలనాడు | 6000 | ,, | S. I. I Vol X No. 171. |
| 61 | వేంగి | 6000 | ,, | S. I. I Vol IV No. 935. |
| 62 | వేంగి | 14, 000 | ,, | S. I. I Vol IX – 1 No. 198. |
| 63 | వేంగినాడు | 12, 000 | ,, | Bharathi Vol I Part, 1924. |

పై పట్టికలోని ప్రాంతములతో పొందుపరచిన సంఖ్యలు సమస్యా పూరణములు. ఆ సంఖ్యలు వాటి విలువ వేనిని వివరించునో అనునదే ఈ వ్యాసమందలి ఉద్దేశ్యము.

డా॥ ఫ్లీటు "ఆ సంఖ్యలు ఆ రాజకీయ విభాగములోని గ్రామములు" అని తన అభిప్రాయమును వెలువరించెను. ఈ అభిప్రాయము సరియైనది కాదు. ఏలనన పై పట్టికలో "ఆంధ్రదేశ"–16,000 సంఖ్యను కలిగియున్నది. డా॥ ఫ్లీటు అభిప్రాయము ననుసరించి 16,000 గ్రామములు అని చెప్పుకొనవలెను. కాని అదే ఆంధ్రదేశ విభాగములైన పాకనాడు, వేంగి, 21,000, 14,000 సంఖ్యలను కలిగియున్నవి. అన్ని గ్రామములు ఉండుట అసంభవము. 21,000 14,000సంఖ్యలుగాని, లేక 16,000 గ్రామములుగాని పొరబాటుగా నుండనగును ఇదేవిధముగా నొనంబవాడి, గంగవాడి, బనవాసి, సిందవాడి, క్రమముగా 32,000, 96,000, 12,000, మరియు 1000 సంఖ్యలు కలిగియున్నవి. ఆ ప్రాంతముల విస్తీర్ణములు చిన్నవి. అంత చిన్న విస్తీర్ణములో అన్ని గ్రామములు ఉండుట విస్తీర్ణము నధిగమించుచున్నవి. కనుక ఆ సంఖ్యలు గ్రామ సముదాయమును సూచించుటలేదు. మరియు ఒకే పరిపాలన కాలములో రెండు శాసనములలో వేంగికి భిన్న సంఖ్య లివ్వబడినవి! 14,000, 12,000. ఈ భేదమును ఏ విధముగా పరిశీలింపవలయునో కదా?

మరికొందరు చరిత్రకారులు వేరొక సిద్ధాంతమును ప్రతిపాదించిరి. వారి అభిప్రాయము ననుసరించి ఆ సంఖ్యలు గ్రామాదాయముగా నిర్వచింపబడినవి. ఈ నిర్వచనము ననుసరించి 96,000, 16,000, 32,000 గల సంఖ్యలు ఆ వాదమును బలపరచుచున్నవి. కాని 70, 30, 24, 98, 12, మొదలగు చిన్న సంఖ్యలు గలవు. అంత చిన్న ఆదాయము అత్యల్పముగా తోచును. కనుక ఈ సూచన కూడ సరియైనదికాదు.

ఇంకొక కోణములో కొందరు చరిత్రకారులు ఆ సంఖ్యలను ఆ గ్రామ జనాభాగా నిర్ణయించిరి. తరచి చూచిన ఈ వాదనకూడ సమంజసముగా తోచుటలేదు. ఏలనన పెద్ద సంఖ్యలుగల ప్రాంతముల కిది వర్తించును. చిన్న సంఖ్యలుగల ప్రాంతముల కిది ఆపాదించుట సరియైనది కాదు. ఉదాహరణకు మల్లగ్రామము '30' సంఖ్య గలిగిఉన్నది. 24, 70, మరికొన్ని ప్రాంతములు కలిగి ఉన్నవి. ఇంత తక్కువ జనాభా ఒక రాజకీయ కీలక విభాగ ప్రాంతము కలిగియుండెననుట సబబుగా తోచుటలేదు.

పై వాదనలన్నియు పరిశీలించగా ఈ సంఖ్యలు ఆ ప్రాంతీయ విభాగములలోని లేదా భాగములలోని కుటుంబ సంఖ్య యనుట సముచిత నిర్ణయముగా తోచుచున్నది. రాజు ఒక దానము చేయునపుడు ఆ ప్రాంతములోని కుటుంబము లన్నింటిని దృష్టిలోనుంచుకొని చెప్పి యుండుననుటలో ఎట్టి సందేహములేదు. కాబట్టి కుటుంబముల సంఖ్య ప్రతి రాజ్యకలాపములకు ముఖ్యముగా వాడియుండనోపును. కుటుంబము కనిష్ట పరిమాణముగా నుండెడిది. కాబట్టి ప్రతి రాజ్య విభాగములోపల అందలి కుటుంబముల సంఖ్య చేర్చబడియుండును.

*శ్రీమతి ఆర్. జగదీశ్వరి*

# మరలా గొరిల్లా

జూను 1978 'భారతి'లో నేను శ్రీ శేషేంద్రశర్మ "గొరిల్లా" పైని ఆర్వీయన్ సుందరంగారి సమీక్షను విమర్శించిన తర్వాత, నా విమర్శపై రెండు ప్రతి విమర్శలు వచ్చినాయి. ఒకటి జూలై 'భారతి'లో ఆర్వీయన్ గారే వ్రాసింది. రెండవది ఆగస్టు 'భారతి'లో శ్రీ శాస్త్రిగారు వ్రాసింది. వాటి సామంజస్యాల్ని పరిశీలిస్తాము.

"ప్రతీకలకు అసలు వస్తువుకు ఉండే అన్నీ గుణాలూ ఉండాలను కోవడం దురాశ" అని చమత్కరిస్తారు ఆర్వీయన్‌గారు. ప్రతీకలకు అసలు వస్తువుకు వుండే ప్రధాన గుణమైనా సూచన ప్రాయంగానైనా ఉండాలనడం దురాశ అనుకోను. ఆమె ముఖం చంద్ర బింబం అనడంలో చంద్రబింబం యొక్క తెల్లదనం, గుండ్రని తనం వుంటాయని సూచన. గొరిల్లా అనే ప్రతీకలో మనిషి అనే అసలు వస్తువుకుండే గుణాలు ఏ మున్నాయి? మనిషి పరిపక్వ బుద్ధి, గొరిల్లా అపరిపక్వ బుద్ధి. మనిషి దేహం చిన్నది. గొరిల్లా దేహం కొంచెం పెద్దది. ఇవి ఆర్వీయన్‌గారు చెప్పినవే. మనిషికి తక్కువ బలం, గొరిల్లా కెక్కువ బలం వున్నాయి. గొరిల్లా వికారి (మనిషి దృష్టిలోలెండి) మనిషంత వికారికాదు (మనిషి దృష్టిలోలెండి). మనిషికి బుద్ధి, నిండావుంది. గొరిల్లా మందబుద్ధి. గొరిల్లాకు చాలా వెంట్రుక లుంటాయి. మనిషికన్ని వెంట్రుక లుండవు. గొరిల్లా బద్ధకపు జీవి. మనిషికి క్రియాశక్తి వుంది. ఏ యొక్క పాయింటులోనూ సాదృశ్యం లేనిచోట ప్రతీకలోని సారస్యమేమీ అంటాను. మనిషి సాధారణంగా వున్నప్పుడు కాదయ్యా, అతనికి తిక్కరేగినప్పుడు గొరిల్లా ప్రతీక అవుతుందంటారా? అదెట్లా అవుతుందంటాను. గొరిల్లా సిగ్గరి (Shy) అనీ, తనకు సరిపోక పోతే ఎదకొట్టు కొంటూ అటనుండి పారిపోయే స్వభావం గల జంతువును తిక్కరేగిన మనిషితో పోల్చడం, ఆ యమాయక జీవిని అవమాన పర్చడమే అవుతుంది. ఈ విషయం తుదిలో మరలా తడువుతాను.

మురికిలో పొర్లాడుతూ, అసహ్యంగా తిరిగే పంది విష్ణువు అవతారాలలో ఒకటై భూమినే మోస్తున్నప్పుడూ, కోతిని ఆంజనేయుడిగా చేసి సముద్రాలు దాటింపిస్తే మెచ్చుకొనే రసికులు గొరిల్లాను క్రియాశక్తికి ప్రతీకగా చేస్తే మెచ్చలేకపోవడం శోచనీయం అని నొచ్చుకుంటూన్నారు ఆర్వీయన్ గారు. మనిషికి గొరిల్లాను ప్రతీక చేయడానికి కాదు నా ఆక్షేపణ. గొరిల్లాకు క్రియాశక్తి లేదండీ అనే నా ఆక్షేపణ. అటువంటప్పుడు క్రియాశక్తికి గొరిల్లా ఎట్లా ప్రతీక అవుతుంది అనే నా ప్రశ్న. గొరిల్లాయే మనిషి నుండి క్రియాశక్తి పెంపొందించు కొనవలసి వుంటుంది.

ఉదాహరణకు, జూలై 16వ తేది The Hindu పత్రిక చూడండి. స్టాన్‌ఫర్డు (అమెరికా) విశ్వవిద్యాలయంలో 'పెన్నీ' అనే జీవశాస్త్ర పరిశోధకురాలు ఒక గొరిల్లాకు కష్టపడి(క్రియాశక్తి) 200 మాటలు నేర్పించిన వార్త మరియు చిత్రం పడినాయి. పాపం! గొరిల్లా కూడా మాటలు నేర్వడంలో క్రియాశక్తి కనబర చింది. వరాహావతారం, ఆంజనేయుడు సాదృశ్యాలు అనుచితాలు, అప్రస్తుతాలు. ఇవి పురాణేతిహాసప్రోక్తాలు. మన మతంలో పూజ నీయ వస్తువులు. మనం చర్చిస్తూ వుండేది కావ్యం. లౌకిక సాహిత్యం. బురదలో ఇరుక్కుపోయిన మట్టిని ముట్టెతో కోరాడి పైకెత్తే శక్తి ఒక్క పందికే వుంటుంది కాబట్టి సముద్రంలో దాచబడిన భూగోళాన్ని పైకి ఉద్ధరించేందుకు విష్ణువు వరాహావ తారం కావలసి వచ్చింది. ఆర్వీయస్ గారు బెజవాడాది పట్టణాల్లో తిరిగే ఊర పందినే మనసులో పెట్టుకొని వ్రాసినట్లున్నారు. వరా హావతారం అడవి పంది. ఇది చాలా నీటుగా ఉంటుంది సుమండీ! మిట్టాలు, పల్లాలు, కాల్వలు చెంగు చెంగున దూకే శక్తి వానరానికే ఉంది కాబట్టి, ఆంజనేయుడు కోతి అయినాడు. ఆంజ నేయుడు కోతి, వికారపు ఆకారం అనుకోరాదు. అతనికి 'సుందరు డనే' బిరుదున్నది. సుందరకాండపై ప్రత్యేక పరిశోధన చేసిన శ్రీ శేషేంద్రశర్మ గారు కూడా ఈ విషయంలో ఆర్వీయస్ గారితో కాక, నాతో ఏకీభవిస్తారనుకొంటాను. సహృదయత ఉంటే అన్నీ సరిపోతాయి కదా అని ఆర్వీయస్ గారన్నారు. సహృదయత అంటే మంచి గ్రంథాలు చదువుతూ వుండగా మనస్సు తోమిన అద్దం వలె ఉండడం సహృదయత అని వెనుక ఎవరో అన్నారు. అంతేకాని సహృదయత అంటే వచ్చిన పుస్తకాలనంతా అవిమర్శకంగా మెచ్చుకోవడం కాదు. నేను మాత్రం శ్రీ శేషేంద్రశర్మగారి "గొరిల్లా" కావ్యం బాగాలేదన్నానా? విమర్శ నీయమైన అంశాన్నే విమర్శిస్తున్నాను. విమర్శ అనే సుత్తి పెట్టులకు కమ్మచ్చులా సాగేది బంగారు కవిత. అసమర్థనీయాం శాన్ని సమర్థించడం కవి కూడా ఒప్పుకోడని నా విశ్వాసం.

ఇక శ్రీ శాస్త్రిగారి సమర్థన చూద్దాం. గొరిల్లా వర్ణనాన్ని వారిట్లా ఇచ్చినారు :

"Large powerful ferocious arboreal anthropoid"

పెద్దది, శక్తివంతం అనేవి తరతమ భేదాలే కాబట్టి వానిని వదలి వేద్దాం. ఇంక ferocious అనే పదం వుంది. నా జూను వ్యాసంలో గొరిల్లా క్రూరం కాదని వ్రాసినాను. మళ్లీ వ్రాస్తాను.

Much has been written about the ferocity of the gorilla, but studies indicate that it is an unaggressive, even shy animal unless unduly disturbed."

శ్రీ శాస్త్రిగారిచ్చింది Readers Digest Encyclopaedie Dictionary నుంచి. నేనిచ్చింది Encyclopaedia Brittanica నుంచి. వారిచ్చిన రిఫరెన్సు కంటే నేనిచ్చిన విజ్ఞాన సర్వస్వం ప్రమాణతరం. ఇంకొక విషయం ఏమంటే బ్రిటానికా వాక్యంలోని Much has been written about the ferocity of gorilla, but studies indicate బట్టి అది రీడర్స్ డైజెస్టు వాక్యం తర్వాత జరిగిన పరిశోధనా ఫలితం అనేది స్పష్టం. శాస్త్రంలో ఉత్తరోత్తరమే ప్రామాణికం. శ్రీ శాస్త్రిగారు ప్రతిపాదించినట్లు "wildman" (అడవి మనుష్యుడు)గా స్వీకరించడానికీ వీలులేదు క్రియా శక్తి విజృంభించినపుడు నిద్రాణ మానవుడు జాగృతుడై wildman గా అవుతాడనడం తనను తానోడించుకోవడమే. మానవుడింకా ఉత్తమ స్థాయిలోకి పోతాడనడం సరిగాని, అడవి మనుష్యునిగా మారుతాడనడంలో ఔచిత్యం ఏముంది ? వెనుక జంపన చంద్రశేఖరరావుగారు "వాలిసుగ్రీవ" అనే సినిమా తీసి నారు అందులో వాలి సుగ్రీవులు సాధారణ సమయాల్లో మనలాగే వుంటారు. రోషం రేగి కొట్లాడేటప్పుడు కోతిరూపాలు దాల్చు తారు. అట్టిదేమైన ప్రతిపాదించినారా శ్రీ శేషేంద్రశర్మగారు ? మానవ – భిన్న గుణాలు ప్రకోపించిన సందర్భాల్లో మానవుని గొరిల్లా వంటి వ్యూన జంతువుతో పోల్చడం సబబుకానీ, ఉత్త మోద్యమాల వైపు సాగే మానవునికి గొరిల్లాను ప్రతీక చేయడం reverse gear లో మోటారును నడపడం వంటిది· మానవోద్య మాల్ని నడిపిన గాంధి, లెనిన్, క్రాంవెల్, కొస్సుత్, సన్యత్ సేనులు Wildman లా? మన క్రియా శక్తికి, జాగృతికి గొరిల్లా ప్రతికనా ? అయ్యో మానవుడా సృష్టిలో (Evolution) తిరుగు మొగం పట్టితివి గదయ్యా !

— శ్రీ సర్దేశాయి తిరుమలరావు

# పద్యవిద్య : ఛందస్సు

'భారతి'–జూలై 1978–73పేజి–రావి రంగారావుగారి లేఖమీద నా అభిప్రాయం :

1. రచయిత వ్రాసినవి (పద్యకవితలు) పొరపాట్లు అయినా, ఛందస్సు పొరపాట్లు లేకుండాచూసి ప్రచురించే బాధ్యత సంపాదకులు పెట్టుకోక పోవడమే మంచిది. ఈ సందర్భంగా 'భారతి'ని అభినందిస్తున్నాను.

2. అచ్చు తప్పులను ఛందో దోషాలుగా పరిగణించనక్కరలేదు. 'తథా లిఖిత పారకుడు' అధముడని పెద్దలంటారు.

3 రేఫ సంయుక్తానికి పూర్వాక్షరం వైకల్పికంగా లఘువవుతుంది. (సిద్ధ సమాసంలో). అంటే గురువుగా గూడ పఠించ వచ్చునన్నమాట. ఈ వివరం అప్పకవి చెప్పలేదుగాని 'బాల బోధచ్ఛందస్సు'లో పేర్కొనబడింది. ఈ సందర్భంగా వజ్ఝలవారి 'ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వం' గూడ చూడవచ్చు. విశ్వనాథవారి ''చిద్గదన ప్రాలేయాంశు''పై వచ్చిన చర్చ రావుగారు ఎరగరేమొ?

ఉ. కావునఁ గామ క్రోధముల...  భార. శాంతి.

ఇక్కడ రేఫ సంయుక్తంవల్ల 'మ'కారం గురువు కాలేదు.

4. అంతేగాక 'చిద్రుహ'వంటి లఘు ద్విత్వములు గూడ ఊటి పలకబడే సందర్భాలున్నాయి.

(1) జిగి నిరసించు భిన్నమది చిద్రుహయోపటలంబు...
రత్నపరీక్ష–59 (ఇచట చి గురువు)

(2) చిద్రుహలు నేరు తత్సతుల సేతులు......
ఉ. హరి. IV, 109. (ఇచట చి లఘువు)

5. ఏప్రిల్ 78 'భారతి'లో మల్లినాథ సూరిపై వచ్చిన శ్రీ ముత్యంపేట సాంబారాధ్యశాస్త్రి శ్లోకాలలో మొదటిది మత్తేభవృత్తమని పడ్డది. అది 22వ ఛందంలోని త–భ–య–జ–స–ర న–గ అనే గణాలలో నడిచే వృత్తం. మత్తేభం కానేకాదు.* అందులోనే 13వ శ్లోకం–శార్దూలమ్–పంచపాదిగా అచ్చు తప్పుతో ముద్రితమైంది.

---

[కాళిదాసకృతంగా 'దేవీప్రణవశ్లోకి' అని 12 వృత్తాలున్నాయి. అవి యీ ఛందస్సులోనే నడుస్తాయి. 'చేటీ భవన్నిఖిల ఖేటీ కదంబవన వాటీషు నాకిపటలీ' అని నడిచే దీన్ని 'అశ్వధాటి' వృత్తమని చెప్తారు.]*

---

6. డిసెంబరు 77 'భారతి' (62 పుట)లో 'ఉత్సాహ వృత్తము' అని పేర్కొనబడింది. ఉత్సాహము, జాతిపద్యమే గాని వృత్తంకాదు. శాస్త్రీయంగా దాన్ని వృత్తమనడం తప్పు కాని పద్యసామాన్య వాచకంగా వాడుతున్నారు.

పద్య విద్యలో గూడ కాలక్రమాన వస్తున్న మార్పుల్ని సహృదయతతో స్వీకరించడం అవసరమే అట్లని పొరపాట్లను సూచించడం, సవరించడం తప్పని భావించనక్కరలేదు.

*శ్రీ బండి నాగరాజు*

కలగూరగంపలో శ్రీ సర్దేశాయి తిరుమలరావుగారు రాసింది చదివిన తరువాత కొంత వ్యాఖ్య చెయ్యబుద్దేస్తోంది. [స్కూలు రోజులలో కన్యాశుల్కం చదవటం మొదలుపెట్టి పెద్దవాడి నయ్యాక అవకాశం వచ్చినప్పుడు ''గిరీశం బ్లోట్ల''ని విజయ నగరంలో చూసివచ్చిన వాడిని కాబట్టి !]

గురజాడ అప్పారావుగారు అసలయిన సిసలయిన విక్టోరియన్ అని నా నమ్మకం – విక్టోరియన్‌లలో ఎందరు గొప్పవాళ్లు లేరు? మిల్, షాఫ్ట్‌స్‌బరీ, ఓవెన్, ఎల్లిన్ వగయిరాలు.

బూతులు మాట్లాడటానికి సందేహించే వాళ్లకి 'సెక్సు' ని గురించి 'ఉదార' మయిన అభిప్రాయాలు ఉండవచ్చు. బాగ బూతులు పలికే వాళ్లలో 'సంయమనం' (ఇతరంగా), 'సంకుచిత' మయిన అభిప్రాయాలూ ఉండవచ్చు.

మధ్య తరగతి నీతి అంటే ఏమిటి ? దీనిమీద చాలా 'సర్వే' లు జరిగాయి గాని బెర్నార్డ్ షా అన్నట్లు రోడ్‌మీద గుర్రాలు బెదరని పని ఏది జరిగినా ఫరవాలేదనుకోవటమే మధ్య తరగని నీతి అనవచ్చునా ?

ఈ పట్టింపు బాగా పాతవాళ్లకి ఉన్నట్లు తోచదు. వ్యాసుడు, కాళిదాసు, ఇంకా ఎందరో గొప్పవాళ్ళు (ఇప్పుడు కాక పోయినా కొంత కాలం కింద) బూతుగా చెలామణి అయ్యే వాటిని వాడటానికి వెనుదియ్యలేదనిపిస్తుంది. [ఇంగ్లీషులో 'బౌడ్‌లర్' సంగతి ఎవరికి తెలీదు ?] ఇప్పుడు మళ్లీ పద్ధతులు మారుతున్నాయి. ఏ పుస్తకాల షాపులోనయినా ఇంగ్లీషులో ''నాలుగక్షరాల'' మాటలు ఉండే పుస్తకాలు కోకొల్లలు. అసలు ''సభ్యత'' కి సంబంధించిన గొడవ ఇది కాదనుకుంటాను. మొత్తం మీద ''వల్గారిటీ'' ఉండవచ్చు కదా ? ఆ విధంగా చూస్తే నాకూ కన్యాశుల్కంలో అసభ్యత కనిపించనే లేదు. [సత్యనారాయణ గారి పుస్తకాలు కొన్నిటిలో కనిపిస్తుంది ]

కాని, సౌజన్యారావు పంతులుని చూస్తే నేను చదివిన నా పఠ్నాలుగవ ఏట నుంచీ నాకు తలనొప్పే! ఆయన పట్టి ''ప్రిగ్'' ఏమోనని నా అనుమానం. [ఆ కాలంలో కొందరు ''పెద్ద మనుషులు'' ఉంపుడుకత్తెలని ఉంచుకొనటం ఒక గొప్ప కదా ?]

ఏడెనిమిది ఏళ్ల కింద నేను ఒక వయసు మళ్లిన ఆయనని కలుసుకున్నాను. ఆయన ఎప్పుడూ జమీందారులతో తిరిగిన వాడు.

మంచి ''స్పోర్ట్స్ మన్'' (ఒక ఆటలో) గా పేరు పొందాడు కూడా. ఆయనకి నాతో అంత పరిచయం లేకపోయినా అమాంతంగా ఒక కథ చెప్పాడు. తాను చిన్నప్పుడు మొదటి సారిగా ఒక వేశ్య ఇంటికి ఎవరితోనో వెళ్లాడు ఆవిడ ఈయన ఎవరో తెలుసుకుని ఫలాన ఆయనతో తనకి సంబంధం ఉంది కాబట్టి ఈయన కొడుకు లాంటి వాడని మందలించి కాఫీ, టిఫిన్‌లు (!) పెట్టి పంపించి వేసింది ...

విక్టోరియన్ నాటకాలలో ''గుడ్‌నేచర్డ్ ప్రాస్టిట్యూట్‌లు'' కనిపించడం అరుదు కాదు.

మధురవాణి ఎంత ''బలహీన వర్గ'' నికి చెందిన వ్యక్తో వసంతసేన కూడా అంతే. ఆ మాటకి వస్తే ద్రౌపదికి, సీతకి మాత్రం ప్రమాదాలు రాలేదా ?

కన్యాశుల్కం నాటకం కాదు నవల అని నా అభిప్రాయం. కొంతవరకు అప్పారావుగారి రచనలు డికెన్స్ ఛాయలు కనిపిస్తాయి. కాని అప్పారావుగారిలో (థాకోర్‌లో లాగే వాడి కొంత ఉందేమోనని అనిపిస్తూ ఉంటుంది.

ఎందరో అన్నట్లు డికెన్స్ స్థాయేవేరు. ఏ భాషలోనూ అతనికన్నా గొప్ప నవలా రచయిత లేడనిపిస్తుంది—స్కామ్లెట్ కంటే కూడా అతనే గొప్పవాడేమో !

తుది మాట : కన్యాశుల్కం చదివినప్పటి నుంచీ నేటిదాకా నాకు లుబ్ధావధానులు, అగ్నిహోత్రావధానులు అంటే ఎంతో జాలి. గిరీశం అంటే చెప్పలేనంత ఇష్టం, అభిమానం. ''ఆంధ్రుల అభిమాన సాహిత్య పాత్ర'' (ఇంగ్లీషు ముక్కలకి అనువాదం అని వేరే చెప్పాలా :) ఎవరయినా ఉంటే అతనే.

— సూ ం

# " ఆ రెండు కందాలు " నిస్సందేహంగా ప్రక్షిప్తాలే !

''క॥ పది యారగు పర్వంబై
విదితంబగు మౌసలంబు విరచితముగనా
సదమల చిత్తులకు మహా
హ్లాదయములు ప్రసన్న మహిమనొసగెన్ ప్రీతిన్.''

''క॥ పదియేడగు పర్వంబన
నదియు మహా ప్రస్థానికంబన బరగెసభన్
వదలక సన్నుతినొప్పెగ
ముదయంబగు నధికమైన మనోరథ సిద్ధుల్.''

(క్రీగీతలు వ్యాస కర్తవి)

''నన్నయ భారతంలో వెలుగుచూడని రెండు కంద పద్యాలు'' అనే శీర్షికతో శ్రీ బంగొరె—11.10.78 నాటి ఆంధ్రజ్యోతి దిన పత్రికలో ఒక చిన్న వ్యాసాన్ని ప్రకటించాడు. దానిలో పై రెండు పద్యాలను ఉటంకించి, అవి 1842–43 లో బ్రౌన్—''సుదీర్ఘ సంశోధన తరువాత పెక్కు తాళ పత్రప్రతుల్ని పరిశీలించి'' తొలుత ఆదిపర్వం వరకు ప్రచురించాడని, గణయతి దోషాలు ఉన్నప్పటికి అవి నన్నయ వ్రాసినవేనని ఆ వ్యాస సారాంశం. అంతేకాక, తాను ''అయిదేళ్ల నుంచి చెబుతున్నా'' మన పండితు లెవ్వరు ఆయన మాటల్ని పట్టించుకోలేదని వాపోతూ, తన సహజ ధోరణిలో శ్రీ వావిళ్ల వారిని, సంశోధిత ఆంధ్ర మహాభారత పరిష్కర్తలను ఎత్తిపొడిచి, ఎగతాళి చెయ్యటం కూడ జరిగిపోయింది.

ఇవే కాకుండ, ఇంకా ఎన్నో వాస్తవ విరుద్ధము, విపరీతము అయిన అంశాలు అందులో చోటు చేసుకొన్నాయి. వాటిని సోపపత్తికంగా నిరూపించి, నిజాన్ని నిర్ధరించి చెప్పటమే ఈ వ్యాసోద్దేశం.

శ్రీ బంగొరె తన ''సాహిత్య పురావస్తు ద్రవ్యాలలో (సమాసం దుష్టం) యాదృచ్ఛికంగా బయట బడ్డవని'' చెప్పి కొన్న అపురూపమైన ఆ కంద పద్యాల ఉదంతాన్ని పరికించినట్లయితే, అయిదేళ్లుగా శ్రీ బంగొరె చెబుతున్నా, మన పండితులు వాటిని పట్టించుకోక పోవటం సముచితమే ననిపిస్తున్నది. అట్లాకాక, ఆయన మాటల్ని మన పండితులు లెక్కలోకి తీసుకొని ఉన్నట్లయితే, నన్నయ ప్రామాణికత్వానికి, పరిష్కర్తల ప్రామాణికత్వానికి మాయని మచ్చ వచ్చి ఉండేది. ఆ ప్రమాదాన్నుండి తాము తప్పుకోవడమే కాకుండ, నన్నయను తప్పించారు. అందుకు ఉస్మానియా పండితులను అగ్గించాలే కాని తగ్గించ పనిలేదు.

బంగొరెగారు '' వెలుగులోకి '' తెచ్చిన రెండు కందాలు నన్నయ వ్రాసినవికావు—అని నిరూపించే ముందు ఆయన చెప్పిన కొన్ని విపరీత విషయాలను గూర్చి ముచ్చటించుకొందాం.

బ్రౌన్ ప్రకటించిన ఆదిపర్వంలో ''బండిరాలు అరసున్నలు మచ్చుకు కూడ'' లేవట. అంటే ఏమిటి? వాటిని గూర్చిన పరిజ్ఞానం పరిష్కర్తకు బొత్తిగా లేదన్నమాట; అంతేకాదు—ప్రాచీన కావ్యాలను పరిష్కరించే సందర్భంలో, వాటిని తొలగిస్తే ఎదురయ్యే చిక్కులు పరిష్కర్తకు తెలియవని కూడ చెప్పక తప్పదు. ఇంకొక విశేషం ఏమిటంటే—పరిష్కరణం కవి అభిమతాను సారంగా కాకుండా, పరిష్కర్త ఇష్టానిష్టాలను బట్టి జరిగిందన్నమాట. ఈ పద్ధతి శాస్త్రీయమైనదేనా?.

''ఏఱు'' అనే మాటను తీసుకొందాం— అలఘురేఫంతో కూడి ఉండేనది అనే అర్థాన్ని, లఘురేఫయుతమై ఉంటే ''నాగలి'' అనే అర్థాన్ని ఇస్తుంది. ఇట్లాంటివి ఎన్నో ఉన్నాయి. అక్షర భేదాన్ని పాటించనట్లయితే జిజ్ఞాసువు అయినవాడు గందరగోళంలో పడిపోతాడు.

అరసున్న రెండు రకాలు—ఆవయవికమైనది కటి; వ్యాకరణాను సారియై ఆగమంగా వచ్చేది ఇంకొకటి. వీటి స్వరూపం ఒక్కటే అయినా స్వభావాలు వేరు. మొదటి దానిని తొలగిస్తే అర్థ

భేదమునే కాకుండ, శబ్దభేదాన్ని కూడ తెలుసుకోవడం కష్టం. ''ద్వాపర ద్వాపుర'' శబ్దాలు నిర్బిందుకాలైనప్పుడు ఒక అర్థాన్నీ, సబిందుకాలైనప్పుడు వేరొక అర్థాన్ని బోధిస్తాయి అట్లాగే ''ఆకర'' శబ్దము నిర్బిందుకమైతే సంస్కృతం—సబిందుకమైతే అచ్చికం. మచ్చుకు మాత్రమే ఇవి. ప్రాచీన సారస్వతాన్ని చదువుతూంటే ఇలాంటివి ఎన్నో తారసిల్లుతాయి. ఇక వ్యాకరణం వల్ల వచ్చి చేరే అరసున్నను విస్మరిస్తే కారకం కొన్ని చోట్ల కుదరదు. అందువల్ల అన్వయక్లేశం ఎదురౌతుంది. కాబట్టి ప్రాచీన కావ్యాల నుండి వీటిని తొలగించటంచేతగాక వాతలేసుకోవడం. దీన్ని ఒక గుణంగా గొప్పలు చెప్పకోవడం అజ్ఞత.

నన్నయ పర్వ సంగ్రహంలో పర్వానికొకటి చొప్పన కంద పద్యాన్నే చెప్పినాడనటం కూడ సత్యదూరం. శల్య—అశ్వమేధ పర్వాలకు ఆట వెలది, తేటగీతులను చెప్పటం గమనార్హం. దీనివల్ల నన్నయ ప్రతిపర్వానికి ఒక పద్యాన్ని చెప్పించాలని, కాని, అది కంద పద్యమే అయి ఉండాలని కాని, ఒక నియమం పెట్టుకోలేదనేది స్పష్టం. కాబట్టి నన్నపార్యుని పర్వ సంగ్రహ రచనా ప్రణాళిక శ్రీ బంగోరె ఊహించినట్లుగా—పర్వానికొక కందం చొప్పన—లేదని తేట తెల్లమవుతున్నది.

పర్వ సంగ్రహాన్ని జాగ్రత్తగా పరిశీలించినట్లయితే ఆయన పెట్టుకొన్న నియమం ఎట్లాంటిదో మనకు బాగా వెల్లడికాగలదు. పర్వ సంగ్రహంలో ప్రతిగద్యానికి తర్వాత ఒక పద్యం చెప్పాలను కొన్నాడు. ఈ నియమాన్ని ఆయన ఆద్యంతం—తు.చ. తప్పకుండ పాటించాడు కూడ.

బంగోరెగారు అన్నట్లు, నన్నయ మౌసల మహా ప్రస్థానిక పర్వాలకే కాకుండ, స్వర్గారోహణ పర్వాన్ని కూడ వాటితో చేర్చి, మూడింటికి కలసి ఒక గద్యాన్ని చెప్పి, దాని తర్వాత 18 పర్వాలకు కలసి వచ్చేటట్లు—'' అమితాఖ్యాన శాఖలంబొలిచి...... '' అనే మత్తేభాన్ని చెప్పి తన ప్రణాళికకు ఎటువంటి భంగం లేకుండ పర్వ సంగ్రహాన్ని ముగించాడు. కబట్టి—తాను చూపించిన రెండు కందాలు లేనందువల్ల నన్నయ రచనా ప్రణాళిక భంగమై పోయిందన్న బంగోరెగారి వాదం పరాస్తమై పోతున్నది. అయితే ''కందమే ఎందుకు వ్రాయలేదు?'' అన్న ప్రశ్న విజ్ఞులు అడగవలసింది కాదు. అటువంటి ఛందోనియమాన్ని ఆయన విధించుకోలేదని ముందే నిరూపించాను. కాగా, ఎక్కడ పద్యం చెప్పాలి, ఎక్కడ గద్యం వాడాలి, పద్యమే చెబితే ఏ ఛందస్సులో చెప్పాలి—అనేది కవి చిత్త వృత్తికి సంబంధించిన విషయం.

15 పర్వాలకు గద్యం తర్వాత పద్యం చెప్పిన నన్నయ చివరి మూడింటిని కలిపి ఒకే గద్యంలో ముగించటం సంక్షిప్తతాపేక్షతో కావచ్చును. ఇతర పర్వాలకు చెప్పిన పద్యాలలో వాటి విశేష గుణాలను ఉగ్గడించినట్లే ఈ పర్వత్రితీయ విశేష గుణాన్ని ''అమితాఖ్యాన శాఖలం ... '' అనే పద్యంలో సూక్ష్మంగా సూచించి ఉండటం గమనించదగ్గ విశేషం. ఇట్లా అవసరమనిపించినచోట ఇంచుక పెంచుకొంటూ, అక్కర లేదనుకొన్నతావుల కుదించుకొంటూ రచన సాగించటం నన్నయ అనువాద పద్ధతిలోని ప్రధానగుణం కూడ.

ఇదంతా గమనించకుండానే బ్రౌన్ మౌసల మహాప్రస్థానిక పర్వాలకు ప్రత్యేకంగా పద్యాలు చెప్పలేదని భ్రమించి ఆ రెండింటికి రెండు కందాలు లక్షణ విరుద్ధంగా రాసి చొప్పించి ఉంటాడని చెప్పక తప్పటంలేదు.

శ్రీ బంగోరె వెలుగులోకి తెచ్చిన ఈ కందాలు నిజానికి వెలుగు చూడ తగినవికావు. అవి నన్నయ రాసినవి అంతకన్నా కావు. నన్నయ పరమ ప్రామాణికుడైన కవి; పైగా లాక్షణికుడు కూడ. అటువంటి నన్నపార్యుడు వ్యర్థపదాలతో నిండి, అర్థరహితాలై వెలవెలబోతున్న ఆ రెండు కందాలను రాశాడంటే ఎవరు నమ్ముతారు? ఎట్లా నమ్ముతారు? ఈ క్రింది ఉపపత్తులు అవి నన్నయ పద్యాలు కావని నిర్ద్వంద్వంగా నిరూపిస్తాయి

1. నన్నయ 18 పర్వాలలోని 15 నింటికి గద్యమూ, తర్వాత పద్యము చెప్పినాడు ఆ పద్యాలన్నింటిలోను నన్నయ పర్వ నామానికి తర్వాత అనివార్యంగా ''పర్వ'' శబ్దాన్ని వాడి ఉన్నాడు. ''ఆదిపర్వంబది వినగా ... ఉద్యోగ పర్వమిమ్మగు సభలన్'' ఈ విధంగా సాగింది ఆ పద్యాల రచన. బంగోరె చూపిన రెండు కందాలలో ''మౌసలంబు మహాప్రస్థానికంబు'' అనే గాని అవి ''పర్వ'' శబ్ద పరాలుగా ప్రయుక్తం కాలేదు.

2. పర్వ సంగ్రహం యావత్తు ఒక క్రమబద్ధమైన ప్రణాళికానుసారంగా—గద్యం ఆ తర్వాత పద్యం—నిర్వహించబడింది. అదనపు పద్యాల ప్రసక్తి అధిక ప్రసంగం.

3. నన్నయ ప్రతిపర్వానికి చెప్పిన పద్యాలలో, ఆయా పర్వాల విశేష గుణాన్ని, లేదా దానిని గూర్చి తన అభిప్రాయాన్ని వ్యక్తంచేస్తూ వచ్చాడు. ఆదిపర్వం ''మనఃప్రీతిదము'' అన్నాడు. సభాపర్వం ''పండితచేతో నిర్వృతి'' కలిగించేది అన్నాడు. మరి స్త్రీపర్వం ''కృపాయిత''మని పల్కినాడ. ఇట్లా 15 నింటిని గూర్చిన తన అభిప్రాయాలను వెల్లడించాడు. బంగోరెగారి పద్యాలలో ఈ పద్ధతికి బదులు ఫలశ్రుతులు చోటు చేసుకోవటం గమనార్హం

4 యతిప్రాసలను పట్టించుకోనేవాళ్ళు మతిలేని వాళ్ళని బంగోరెగారి అభిప్రాయం. కాని ప్రాచీనిక కవుల కావ్యాలను పరిష్కరించేటప్పుడు సాధు పాఠ నిర్ణయానికి అక్కరకువచ్చే సాధనాలలో యతిప్రాసలు అతి ముఖ్యమైనవి. అటువంటి సందర్భాలలో వాటిని పట్టించుకోకపోవటమనేది మతిలేనివాళ్ళు చేసేపని. మతి ఉన్న వాళ్లందరు యతిప్రాసలను గణనలోకి తీసుకొనే గుణనిర్ణయం చేస్తారు.

మొదటి పద్యంలో మాత్రమే యతిభంగము, రెండవ పద్యంలో ''రెండవ లైను''లో గణభంగం జరిగిందని శ్రీ బంగోరె

అభిప్రాయం. పైగా ఇదేదో చాల స్వల్పవిషయమైనట్టు నిర్లక్ష్యం చేస్తున్నాడు కూడ. నిజానికి రెండవ పద్యం నాల్గవపాదంలో కూడ యతి వైరం స్పష్టంగా కనబడుతున్నది.

''ఉదయంబగు నధికమై మనోరథసిద్ధుల్.''

అన్నచోట ఉకారానికి యతిస్థానంలో ఉన్న ''నో''కు యతిచెల్లదు. ఈ గణ యతి దోషాలన్నీ నన్నయే చేసి ఉంటాడనటం దుర్మార్గం. ఛందశ్శాస్త్రంలో ఏ కొద్దిపాటి ప్రవేశం ఉన్నవాడైనా, ఇలాంటి దోషాలు చెయ్యడు. ఎందుకంటే ఆ యతిస్థానాలలో సులభతర గ్రాహ్యాలైన స్వరవళులకే ప్రసక్తి.

5. దీనికి పైపెచ్చు అన్నట్లుగా, ఇటువంటి లక్షణ విరుద్ధము, అన్వయము, అర్థము బొత్తిగా కుదరని చీకిరి మాకిరి పద్యాలను పట్టుకొని ''పద్యాల నడకలో నన్నయరీతి దెబ్బతిన్నదన డానికి వీలులేకుండావుంది'' అంటూ ఒక సర్టిఫికెట్టు గూడ ఇచ్చేశాడు శ్రీ బంగోరె. అర్హతను ఆపాదించుకొని సర్టిఫికెట్టు ఇచ్చే సంబరంలో కాబోలు—తానిచ్చే సర్టిఫికెట్టే తనకు ఛందశ్శాస్త్రంలో ఉన్న పాండిత్యాన్ని పట్టి బహిరంగంగా ప్రదర్శిస్తుందన్న సంగతి మరచిపోయాడు. ఒక సర్టిఫికెట్టు సరిపోతుందా? ఎక్కడ, ఏవిధంగా అవి నన్నయ పద్యాలతో సరిపోలుతున్నాయో వివరించి చెబితే పండితులు సంతోషిస్తారు. ఓటిపలుకులకు విలువెక్కడ? ఇదిగో పర్వ సంగ్రహంలోనిదే—నన్నయ వ్రాసిన కందాన్ని ఒక దాన్ని ఇక్కడ ఉటంకిస్తున్నాను; పరికించండి—

''జంబూషండ నిర్మా
ణం బాదిగ హృదయ రోచనములగు నేన్ప
ర్వంబులను భీష్మపర్వను
పంబి విను బొలుచు షష్ఠ పర్వంబగుచున్ ''

ఈ పద్యంతో, బంగోరెగారు లోడి బయటకు లాగిన రెండు పద్యాలు ఎందులో సరితూగుతాయి? శయ్యలోనా? శైలిలోనా? పాకంలోనా? ప్రౌఢిలోనా? నక్క ఎక్కడ? నాక లోకమెక్కడ?

గణభంగాలు, ఘోరమైన యతిదోషాలు—ఇవి చాలవో అన్నట్లు అన్వయం కుదరక, అర్థరహితమై, శబ్దాల పొహళింపు కొరవడి కేవలం జల్లిమాటలతో అల్లబడిన ఆ రెండు కందాలు నన్నయ పద్యాలతో సరితూగు తున్నాయని పద్య విద్య తెలిసిన వాడెవ్వడూ అనడు.

6. నన్నయ పద్యాలు హృద్యాతి హృద్యాలు. వాటి గమకం శ్రవణపేయం. ఆయన శైలి ''ప్రసన్న'' మధురం. దూరాన్వయాలు, దురన్వయాలు, క్లిష్టదుష్టాన్వయాలు ఆయన పద్యాలలో కలికానికైనా కనిపించవు. అటువంటి మహాకవికి, చేతా వాతా గాని వాడు రాసి, గుట్టు చప్పుడు కాకుండ ప్రక్షిప్తంచేసిన కొక్కిరి బిక్కిరి పద్యాలను అంటగట్టాలనుకోవడం అపచారం. శ్రీ బంగోరె తానే ''అవక తవక చరిత్రను'' తవ్వి తట్టల కెత్తుతూ, అన్యులను నిందించటం గురివిందగింజ లక్షణం. దూరం ఆలోచించకుండ, తొందరపాటు నిర్ణయాలకు వచ్చి ప్రామాణికులైన పండితులు చేసిన పరిశ్రమను పరిహసించటం అవిమృశ్య కారిత్వం.

''విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్
నహివంధ్యా విజానాతి ప్రసవ వేదనమ్''

ఇంకొక్కమాట చెప్పి ముగిస్తాను. ''బ్రౌన్ ఆదిపర్వ అచ్చు ప్రతిని జాగ్రత్తగా పరిశీలిస్తే ఇంకా అదనపు పద్యాలు బయట బడ వచ్చు''నట. నిజమే. ఇప్పటికి శ్రీ బంగోరె పుణ్యాన వెలుగుచూచిన ఈరెండు కందాలు ఎంత దేదీప్యమానంగా వెలిగిపోతున్నాయో చూచి అందరం తరించాం. తక్కిన అదనపు పద్యాలు దక్కితే మరెన్ని సోయగాలు, సొగసులు ఒలకబోస్తాయో?! వేచి చూడవలసిందేమరి.

**శ్రీ పాకాల వెంకటకృష్ణయ్య.**

## గ్రంథవిమర్శల్లో శ్రీ రెడ్డిగారి పోకడ

1978 అక్టోబరు నెల 'భారతి'లో శ్రీ మరుపూరు కోదండరామరెడ్డిగారి గ్రంథవిమర్శలు ఏకపక్షంగానూ,అభ్యుదయాన్ని సహించలేనిదిగానూ వున్నాయని తెలియజేయడానికి చింతిస్తున్నాను. వీరి విమర్శల్లో కమ్యూనిస్టు వ్యతిరేకత, విప్లవ రచయితలపై ద్వేషం, కొత్తపట్ల అసహనం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

'విభావరి' కవితా ఖండిక విమర్శలో (సమీక్షకాదు) 'శ్రీమంతులు కుడిచే మృష్టాన్నం ప్రతిముద్దా అన్నార్తుల చూపులతో మన పడినదే'' అన్న భావం 'కారగ్గవట'. 'పాకీవాడికి పన్నీటి స్నానం, పట్టువస్త్రాలు అందించాలనే నైసర్గిక న్యాయాని కింకా నాలుక మొలవలేదు' — ఇది శ్రీ రెడ్డిగారు కమ్యూనిస్టు ప్రచారమనుకొన్నట్టుంది. అందుకే 'రష్యా పాకీవారికి గొజ్జగి పన్నీటి తిరుమంజనం చేయిస్తున్నదా? అంటూ తామేదో గొప్ప సవాలు చేస్తున్నట్టు భావించారు.

కమ్యూనిజం ప్రతివాడికీ పని, కూడు, గుడ్డ, నీడ సమకూర్చగల వ్యవస్థ కావాలంటుంది. రచయిత భావంలో కమ్యూనిజం వుందో లేదో తెలియదు కానీ, రచయిత భావం వున్నతమైంది విమర్శకులకు మాత్రం 'పాకి వాడికి పట్టువస్త్రాలనే'సరికి చాల బాధకలిగింది. పట్టువస్త్రాలు శ్రీ రెడ్డిగారి వూహలో కేవలం ఉన్నత కులాల వారికి, మేధావులకు, శ్రీమంతులకే పరిమితం కావాలని, పాకీపని చేసేవాడికి వాటిని పొందే అర్హత వుండకూడదని కాబోలు.

'అభ్యుదయ తోరణాలు'ను విమర్శిస్తూ శ్రీ రెడ్డిగారు 'ఒక్క భూస్వామిని నాగలి పట్టమను' అన్న రచయిత వాక్యాన్ని వుటంకించి ఈ రచయిత లైబ్రేరియన్ పదవి వదలి ప్యూన్ పని చేస్తాడా? అని ప్రశ్నిస్తూ 'కర్మ విభాగమేగదా సంఘరథానికి దాని గతికి మూలము' అంటూ తీర్పు చెప్పారు

ఎంత గొప్ప సత్యాన్ని చెప్పారు రెడ్డిగారూ! వందలమంది శ్రమ శక్తిని దోపిడీ చేసి, ఏనాడూ భూమి పండటానికి శ్రమించక, దౌర్జన్యాలకు, పెత్తనాలకు గ్రామాల్లో నాయకత్వం వహిస్తూ రైతు కూలీల ప్రాణాల్ని, వారి ఆడాళ్ళని వారి కుటుంబాల్ని తమ స్వంత సుఖాలకోసం వాడుకొనే భూస్వాములను 'నాగలి పట్ట మంటే, కర్మవిభాగమేగదా సంఘరథానికి దాని గతికి మూలము' అంటూ భూస్వామ్య వ్యవస్థను సమర్థించాడు.

లైబ్రేరియన్ పనిచేసే రచయితను ప్యూన్ పని చేయ మనడం విమర్శకుడి సంకుచిత దృష్టిని వెల్లడిస్తూ సమస్యను వక్రీకరించి, పాఠకుల్ని తప్పుదోవ పట్టించేదిగా వుంది.

'సరిగమలు' విమర్శిస్తూ 'అహెడ్'కు 'ఎహెడ్' వాడారని, 'ఫ్రెండు'కు 'ఫ్రండ్' అన్నారని చమత్కారంగా 'ఎక్కడి నాటు ప్రొనన్సియేషన్' అయ్యా? అంటూ ఆవేదన పడ్డారు.

ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కో వుచ్చారణ వుంటుంది. రాయల సీమ ప్రాంతంలో 'Paper'ను 'పేపర్' అంటే ఆంధ్రలో 'ప్యావర్' అంటారు. అలాగే 'అహెడ్'ను 'ఎహెడ్' అనడం, 'ఫ్రెండ్'ను 'ఫ్రండు' అనడం కూడా కద్దు. ఇవన్నీ కేవలం గ్రంథంలోని లొసుగుల్ని ఎత్తిచూపడానికి రంధ్రాన్వేషణ చేసి, తప్పులెన్నడం తప్పించి మరేంకాదు.

శ్రీ రెడ్డిగారు యికపై తమ పాండిత్యాన్ని సద్విమర్శలు చేయడానికి మాత్రమే వినియోగించగలరని ఆశిస్తున్నా.

*— శ్రీ ముదార వేణు*

శ్రీనాథుని జన్మస్థలము ''పాకలే'' అని 'భారతి' సెప్టెంబరు నెల సంచికలో ఒకలేఖయున్నది. మత్తేభ వృత్తము కనుక ''కనకక్ష్మాధరధీరు వారిధి తటీ కాల్పట్టణాధీశు...'' అనియే యుండవలెను. కాని పాఠాంతరములో ''కనకక్ష్మా ధరధీరు వార్ధితట పాకలే పట్టణాధీశ్వరు...'' అని యుండుటలో గణభంగమున్నది కనుక ఆ పాఠాంతరము Interpolation అని స్పష్టము.

ఒక్క విషయము. ''పాక నాటింటి వా డవు బాంధవుండవు'' అని బెండపూడి అన్నమంత్రి భీమేశ్వర పురాణములో చెప్పుటచే శ్రీనాథుడు పాకనాటి వాడని స్పష్టము. అయితే పాకనాటి వారందఱును పాకనాటి జన్మలే అని ఊహింపవలయునా?

విజ్ఞులింకను పరిశోధింతురని ప్రార్థన.

ప్రౌఢ యౌవన కౌమారముల దెక్కడ నివసింపవలసి వచ్చినను వార్ధక్యము వచ్చుసరికి ప్రతి మనుజుడు స్వస్థలమునకుం జేరుట సహజము. శ్రీనాథుడు అవసానదశలో బొడ్డుపల్లెకు జేరెను.

తే గీ బొడ్డుపల్లెయు గొడ్డేరి! మోసపోతి
కృష్ణవేణమ్మ గొనెపోయె! నింత ఫలము
బిల బిలాక్షులు తినిపోయె! తిలలు పెసలు
ఎట్లు చెల్లింతు టంకంబు! లేదు సూర్న ?

అను పద్యముచే కృష్ణాజిల్లా వాఁడా? పరిశీలించవలసి యున్నది.

*— శ్రీ కె వి రావు*

అక్టోబరు '78 భారతి ఈరోజే చూశాను. శ్రీ మరుపూరు వారుఉద్దండులైన విమర్శకులే కావచ్చు, సారస్వతాన్ని త్రావి త్రేస్పిన అగ్రస్యులే కావచ్చు. కాని వారి గ్రంథ విమర్శలు సహృదయులకు బాధాకరంగా పరిణమిస్తున్నవి. కావ్యాలను విమర్శించే సమయంలో ఆ రచయిత వ్యక్తిగత జీవితంలోకి వెళ్ళడం, కావ్యం సంగతి పక్కకు నెట్టి రచయితపై తమ కేర్పడిన అభిప్రాయాలను తలా తోకా లేకుండా తమ విమర్శలో కుదించడం ఈ మధ్య వారికి పరిపాటియై పోయింది. దిలావర్, 'వెన్నెల కుప్పలు'. సమీక్షలో శ్రీవారి మాటలు చూడండి : 'ఒక ముస్లిం యువకుడు ఈ బడి పంతులు, (దిలావర్), సూఫీవాసనలు కూడా ఒంటబట్టినట్లున్నది, అని సమీక్షకుల ఊహాగానం. రచయిత ముస్లిం కావడం వలన విమర్శకులకు జనించిన ఊహ మాత్రమే యిది. వంగల రంగాచార్యుల; 'అభ్యుదయ తోరణాలు', సమీక్షిస్తూ, ఈ రచయిత లైబ్రేరియన్ పని వదలి ప్యూన్ పని చేస్తాడా? ఆ రచయిత చెత్తనే వ్రాయవచ్చు. ఆ చెత్త పనికిరానిదంటూ ఈ విమర్శకాగ్రేసరులు 'భారతి'లో పేజీల కొలది సమీక్ష వ్రాయవచ్చు కాని పై హేళన ఏమిటి? వారి కలానికి హద్దూపద్దూ లేదా ?

'ముక్తధార' రచయిత బులుసు వెంకటసుబ్బారావు గూర్చి 'ఈ ఇన్‌కంటాక్సు పెద్ద ఆఫీసరు' అని పరిచయం చేశారు. ఆయన కావ్యంలో ఆ ఉద్యోగ సంబంధమైన అంశాలుంటే ఆయన 'లెక్కల రాళ్ళు' ప్రస్తావిస్తే ఔచిత్యవంతంగా వుంటుంది. ఆధ్యాత్మిక చింతనాయత్త చిత్తం' గల కవిని గూర్చి వ్రాస్తూ పై పదం వాడడం దండుగ. (పాఠకులకు ఆ కవి ఉద్యోగ వివరం అవసరం లేదు)

కె ఎస్వీ 'రాత్రి' ని సమీక్షిస్తూ 'తెనుగు నుడికారాన్ని చక్కదిద్దుకోవాల' అన్నారు. శ్రీ రెడ్డిగారి తెలుగు నుడికారం ఎంత హృద్యంగా వుంటుందో, వారి నెల్లూరి సీమ మాండలికాల ప్రయోగం తెలిసిన ద్వా.నా. శాస్త్రి లేఖ (ఇదే సంచికలో) చదవవలసిందే. ఇప్పటికే వీరి విమర్శల గూర్చి అనేక ప్రతి విమర్శలు వచ్చాయి. వానిని వీరు ఖాతరు చేయకపోవచ్చు. 'భారతి'కి ఆస్థాన విమర్శకులైన వారి వైఖరిని గూర్చి మీరైనా మందలింప గూడదా ?

ఏమైన 'భారతి' నుండి మేమాశిస్తున్నది సహృదయ విమర్శ.

*— శ్రీ తిరునగరి*

## సంప్రదాయం

అన్ని సదుపాయాలూ వుండి, వాటిని సద్వినియోగపరుచుకో లేక పోయారేమని అడగడం అక్కసట! ఆహా! ఎంత గొప్పగా రాశారండీ ప్రభాకర్ గారూ!

బ్రాహ్మణత్వమే సంప్రదాయం, కానీ బ్రాహ్మణాధిక్యతకాదు అన్నారు. జూన్ సంచికలో వ్రాసిన 'అసమానతను చాటే వర్ణాశ్రమ ధర్మాలు, అస్పృశ్యత, బ్రాహ్మణాధిక్యత మొదలైనవి సంప్రదాయం పేరుతో సమర్థింపబడుతున్నాయి' అన్న వాక్యం మాటేమిటి? అంటే మొదటి కంటె ఇంకొంచం ముందుకు వెళ్ళారన్న మాట.

వ్యాసుడ్ని, వాల్మీకిని సమాదరించిన, విశాల దృష్టిగల పూర్వులు 'తోటి మానవుల్ని సందుల్లో పందులు' గా పరిగణించడమేమిటి? చిక్కువడిన వేదాలను విడదీసినదే బ్రాహ్మణేతరుడయినప్పుడు, వాటిని చదివిన ఒక వర్గం వారు, వాటిని 'యితరులకు' అందుబాటులో లేకుండా చేయడమేమిటి? యిప్పుడు గురుకులాలు, ఆశ్రమాలు ఎన్ని వున్నాయి? వాటిల్లో చదువుకునే వారెంతమంది?

కొన్ని విషయాల్లో కొంతమంది 'ఆధిక్యత' కలిగి వుండడం సహజమే అలా అందరూ ఒకరి కొకరు సహకరించుకొని గడిపే జాతుల సమూహమే సంఘం. ఇతరులకు నష్టం కలిగించనంత వరకూ 'పోరాడి తమ హక్కులు సాధించుకోడం' ఎవ్వరికీ బాధాకరం కాదు. అందుకోసం యితరుల్ని బలిచెయ్యడం నేరం. అక్కడే బాధంతానూ.

— *శ్రీ ములుమూడి ప్రసాదరావు*

## మానవతా వాదిని గేలి చేసిన మరుపూరు వారి సమీక్ష

ఈనాటి వర్తమాన కవులలో చక్కగా వ్రాయుచున్నవారు కొందరు. ఆ కొందరిలో "మనసుగీసిన చిత్రాలు" కృతికర్త రంగినేని సుబ్రహ్మణ్యం గారు అగ్రశ్రేణిలో ఉన్నారన్న సంగతి బహుశా మరుపూరు వారికితెలియకకాబోలు; సెప్టెంబర్ 78 'భారతి''లో రంగినేని గారి చేవను చెత్తగా ఊహిస్తూ సమీక్షించినారు. అయినా, ఇది సమీక్షా! కాదు—మానవతా వాదిని గేలిచేసిన పెట్టుబడీదారు "రొమ్ము పొగరు"

నేను "మనసుగీసిన చిత్రాల"ను గానీ, రంగినేని సుబ్రహ్మణ్యం గారిని గానీ గుడ్డిగా సమర్థించడానికి ఉపక్రమించి ఈ మాటలు వ్రాయడము లేదు. అసలు సమీక్ష అంటే ఏమిటో మరుపూరు వారికి తెలియనిదికాదు. అయితే ఈ మధ్య ఆశ్రిత పక్షపాత ధోరణిలో మతి పోగొట్టుకొని రీతినీ నీతినీ మరచి ఒక పుస్తకంలోని తప్పులు ఎత్తి చూపించడమే సబబుగా తలచి, ఇదే సమీక్ష—చూసుకోండి నా తడాఖా అంటూ; అమూల్యమైన "భారతి" లాంటి సాహిత్య మాసపత్రిక ముఖాన విసరేయడం సిగ్గు సిగ్గు.

మరుపూరు కోదండ రామారెడ్డి గారు నివసిస్తున్నది "అపర్ణ" మహలులోన. వారికి బీదల దైన్యం ఎలా తెలుసు. నేటి యువకవి కోరుతున్న "ప్రగతి, మానవత, సమత" మొదలైనవి వారి వైపు కండ్లు (గుడ్లు) ఉరిమి చూస్తుంటే పాపం, మరుపూరు వారి "అపర్ణ" వివర్ణమై — కనిపిస్తున్న "ఆశాకిరణాలు" కూడా కరువై మనసు బరువై మంచి కవులనే తిట్టడం ప్రారంభించినారు. భావ వ్యక్తీకరణంలో రంగినేని సుబ్రహ్మణ్యం గారు చూపిన సౌకుమార్యం రసజ్ఞులకు తప్ప కోదండ రామారెడ్డి లాంటి విజ్ఞులకు (వారు అలా అనుకోవడం మామూలే గదా!) ఎలా రుచిస్తుందీ! స్వార్థాన్ని, ద్వేషాన్ని చంపి చీకటి చీల్చి మనిషిని మనీషిగా మార్చునది రంగినేని కవిత.

సహేతుకంగా సహృదయంతో ఆలోచించడం నేర్చుకొంటేనే "భారతి" కి సమీక్ష అనే కర్పూరహారతిని ఇవ్వండి.

—*శ్రీమతి కె. సుజాతాంపరెడ్డి*.

## బావిలో కప్ప

నవంబర్ 78 'భారతి'లో డా. మురళీధర్‌గారు మరుపూరి గారిపై రాయబడిన నా విమర్శనా లేఖను వ్యతిరేకించబోయి తప్ప

టడుగేసి ఊబిలో ఇరుక్కున్నారు. గాజు యిళ్ళలో ఉండేవారు బయటి ప్రపంచాన్ని కొంతవరకైనా చూడగలుగుతారు, కాని బావిలోని కప్పల్లా తను చూచిందే ప్రపంచము, తనకు తెలిసిందే విజ్ఞానమని ముడివేసుక కూర్చునేవాళ్ళు బయటి వాళ్ళపై రాళ్ళు విసరాలని ప్రయత్నిస్తే ఏ మౌతుందో తెలుసనుకుంటా ?

''అహంకారి ఆడది ఇందిర (జనతా పార్టీపై) ఏడుపులా వుంది మీ (మరుపూరు గారి) విప్లవవాదులపై దేబిరింపు'' అన్నంత మాత్రాన మరుపూరు గారు ఆడది ఎలాగౌతారు మురళీధర్ గారూ ? ఇక్కడ ఎవరు తెలిసీ తెలియని విజ్ఞానముతో సంకుచిత మనోభావాల్ని ప్రకటితమొనర్చారో పాఠకులు గుర్తించ గలరనుకుంటా ?

ఇందిరను ''ఆడది''గా ఉచ్చరించడం మీ దృష్టిలో తప్పా మురళీధర్ గారూ? నిజంగా ఇందిర ఆడది కాదా? (ఇంకేదైనా జంతు సంబంధితురాలా ?) అయినా ఏడవడాన్కి, విరుచుక పడడాన్కి తేడా తెలియని మీ గొప్పదనము నలుగురిలో ఉచ్చరింపదగిందే. ఈనాడు మనదేశ రాజకీయ నాయకులందరూ (ముఖ్యంగా ఇందిర) చెప్పేడివి ధర్మశాస్త్రాలు సొచ్చేడిది దొమ్మరిగుడిశెలు ఆ మాత్రం తెలియని మీ రాజకీయ పరిజ్ఞానము వేనోళ్ళ కొనియాడదగిందే.

ముఖ్యంగా మురళీధర్ గారూ ! ఒక వాక్యాన్ని సగాన్కి తుంచి, చదివి, అర్థాల్ని తీయకుండా ఉంటే ఆరోగ్యదాయకమనుకుంటా అసలు మరుపూరు గార్ని గ్రంథవిమర్శ విడనాడమని నే నేనాడూ అనలేదు. అనాల్సిన అవసరము వచ్చినపుడు నేను ప్రధానమంత్రి కానవసరములేదు(ప్రధాని సర్వాధికారి అనుకుంటున్నారేమిటి కొంపముంచి !) భారతీయ శిక్షాస్మృతి ప్రకారం ఇతరుల హక్కులకు అడ్డువచ్చిన ప్రతివాడినీ కోర్టుకు లాగవచ్చు మరపూరు గార్కి నేనిచ్చిన సలహా అర్థం కావ్యవిమర్శ మధ్యలో విప్లవవాదులపై దూకడం మానుకుంటే మంచిదని. అంతే.

— శ్రీ కె అంజయ్య

# లేఖలు

## పొరపాటుకు-సవరణ

1978 సెప్టెంబరు'భారతి'లో 'విద్యారత్న' విమర్శకవిద్యాస్వతంత్ర శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు'' పెద తిరుమలాచార్యుని—భగవద్గీతాను వాదము''ను సమీక్షించుచు—17 శతాబ్దిని 'శత్రు సంహార శతకకర్త' ''అరి తాళ్ళపాక చిన్నన్న రోమములైన. తంబురా దండెకు తంత్రుతానె'' అని చిన్నన్నను నుటంకించినారు. కాని ఇది పొరపాటు. ఈ పద్యము పోలిపెద్ది వేంకటరాయ కవి విరచితమైన 'వేణుగోపాల శతకములోని'ది శ్రీ—వేం. రావుగారు పొరపాటు పడ్డారని తెలియజేయుచున్నాను—గ్రహింపమని మనవి.

శ్రీ కొమాండూరి రామానుజాచార్యులు

## సవరణకు కృతజ్ఞత

అవును. పోలిపెద్ది వేంకటరాయనిదే. కాని నా వ్యాసములోను ఉండవలసిన చరణములు:

''తాళ్ళపాక చిన్నన్న దండెమీటులు గావు
గోమాంస భుదగ్ధనుర్గుణరవములు.''

ఈ చరణములు 'శత్రు సంహార వేంకటా చలవిహార శతకము' లోనివే.

శ్రీ వెంకటరావు

## ''కృతజ్ఞతా ప్రకటనం శూన్యం''

'భారతి' నవంబరు మాసం సంచికలో ''కవికుల చూడామణి'' వఝ్ఝలపల్లి నరకంఠీరవశాస్త్రి గారిని గురించి శ్రీమాన్ కాశీభట్ల సేతువిశ్వనాథ దత్తగారు అందించిన వ్యాసం బహువిధ విషయాభిరామమై అలరారినదనుటలో సందేహమే లేదు.

కాని, యావదాంధ్రమందు నిద్రావిలసిత త్రిలింగ భారతిని జాగృత మొనరించి యొక యుగాపు నూపిన తిరుపతి వేంకట కవులకు శ్రీ నృకంఠీరవులు తర్కవిద్యా గురువులనిన మాట యొకటి శ్రుతపూర్వమై యున్నది. దానినేల నుట్టంకింప మరచిరో శ్రీ దత్తగారు, మా కవగతం కాలేదు. విద్వదగ్రణులైన శతావధానులకే ఆచార్యులైన వారి ప్రతిభ మహత్తరమని పాఠకులు భావింప వీలుండెడిది.

ఇక, శ్రీ దత్తగారు, వ్యాసాంతమున కుండలినిలో కొందరు పండితులకు కృతజ్ఞతాంజలుల సమర్పించుకొన్నారు. ఇక్కడ వారొక విషయం స్మరణకు తెచ్చుకొనుట మంచిది. 'తాము నరకంఠీరవ శాస్త్రి గారి గురించి పరిశోధింప దలచినట్లును, సాహితీప్రియులు, జిజ్ఞాసులు, పరిశోధకులు—తదితరులు శాస్త్రిగారి రచనల గురించి సమాచారమందజేయుడీ' అని పత్రికా ముఖమున ప్రకటించి యుండిరి.

ఆ ప్రకటన జూచియే అస్మన్మిత్రులు కొందరు, శ్రీదత్త గారికి 1931–32 ప్రజోత్పత్తి సంచికకు (పత్రిక) సంబంధించిన 'స్తుతిరత్నములు'ను, 'జ్ఞాన ప్రసూనాంబికా నవరత్నమాల'ను సేకరించి పంపారు. 'నవరత్నమాల' యెందులో ప్రకటితములైనవో తెలుపకయే పంపుట జరిగినది. శ్రీ దత్తగారును, ఊహాకథతో జత పరచి యొక 'అశ్వధాటి' ని తోడుగా నిలిపిరే కాని, అథోజ్ఞాపికలో ఆ 'నవరత్నమాల' యెందు ప్రకటింప బడినదో తెలుపజాలరైరి. కనీసం ఆ 'కృతులు' యెత్తిరాసి పంపిన సాహితీప్రియులకు కృతజ్ఞతలనైనా అందించలేదు. శ్రీ వఝ్ఝలపల్లి నరకంఠీరవశాస్త్రి గారి ఆత్మయే ఇూ 'వ్యాసం' చూచి, అందులో సంభవించిన ఇూ చిన్ని పొరబాటును చూచి క్షోభ చెంది యుండుననుటలో కూడ సందియమంద బనిలేదు. శ్రీ నరకంఠీరవశాస్త్రిగారి 'నవరత్న మాల', 'ఆరాధన' మాసపత్రికలో ప్రకటితమైనది. ; గమనింప

గలరు! ఏ మాస సంచికయు శ్రీ దత్తుగారే పరిశోధించి ప్రకటింప గలరని నా విశ్వాసం.

దినకర్

## పాఠాంతరంలో ఛందో దోషం లేదు

'భారతి' — నవంబరు '78 సంచిక — కలగూర గంపలో విద్వాన్ టి. రామకోటేశ్వరరావుగారు సెప్టెంబరు 'భారతి' కలగూర గంపలోని 'శ్రీనాథుని జన్మ స్థలమన్న' శీర్షిక క్రింది లేఖలో దొర్లిన ముద్రారాక్షసాన్ని గమనించక, ఒక దీర్ఘమైనలేఖ వ్రాశారు. అసలు సంగతి యిది :— సెప్టెంబరు సంచికలో ''పాకల్'' అనుటకు బదులు ''పాకలే'' అని శీర్షికలోను, మరి రెండు చోట్లను ముద్రణ జరిగింది. కీ. శే. వానా లక్ష్మీనారాయణరెడ్డి గారు ''కవి సార్వభౌముడగు శ్రీనాథుని జన్మస్థలం — పాకల'' అను పేరుతో పది పేజీలుగల చిన్న పుస్తకాన్ని ప్రచురించారు. దానిలో వారు ''కనకక్ష్మా ధర ధీరు వార్ధితట పా కల్పట్ట ణాధీశ్వరున్'' అని పాఠాంతరం యిచ్చారు. క్రిమిదష్టమైయున్న ఒకానొక వ్రాత ప్రతిలోని ''కనక క్ష్మాధర ధీరు వా...త...కల్పట్ణణా ధీశ్వరున్'' అనియున్న భాగాన్ని వారు పై రీతిగా పూరించారు. ''పాకల'' వారి స్వగ్రామం. ఆ పాదంలో ఛందో భంగం ఏమీ లేదు. ఇక చర్చ అనవసరం.

కాల్పట్టణమైనా పాకలయినా అది శ్రీనాథుని తాత వుద్యోగం చేసిన వూరన్న మాట మరిచిపోయి, అదే శ్రీనాథుని జన్మస్థలం అని భావించుట అనాలోచితం. అది సరికాదు. ఆ సెప్టెంబరు 'భారతి' కలగూరగంపలోనే విద్వాన్ తుమ్మలవెంకటరత్నముగారు సూచించిన శాసన ప్రమాణాన్ని అంగీకరించి పొన్నపల్లి శ్రీనాథుని జన్మస్థలమని విశ్వసించుట మంచిది.

— శ్రీ టి. శరచ్చంద్ర చౌదరి

## పాఠాంతరము - సవరణ

శ్రీనాథుని జన్మస్థలమును గూర్చిన చర్చలో ఉత్పన్నమైన 'పాకలే' 'పట్టణాధీశ్వరున్' అన్న పాఠము ఛందోభంగమయినదనుట నిర్వివాదాంశము. కనీ ఈ పాఠమును కొంత సవరించి చదివినచో, శ్రీనాథుని జన్మస్థలము 'పాకాల' అయివుండవచ్చు ననే వూహ పొడముచున్నది.

## సవరణ

'వార్ధి తట పాకాల్ పట్టణాధీశ్వరున్'

పై పాఠములోని ''ల్'' అనే హల్లు వ్రాత ప్రతిలో ''లే''గా కనిపించి యుండవచ్చును, లేదా వ్రాత దోషమయినను కావచ్చును. ఇదే వాక్యమును 'రామునితోక — పివరుని' వలె మనవారు 'కాల్ పట్టణాధీశ్వరున్' అనే అప పాఠమును కల్పించి యుండవచ్చునని నా వూహ. పెద్దలు నిర్ణయింపవలె.

— శ్రీ బలిగాడ రఘునాధరావు

## యతి దోషము

పై శీర్షికతో 1978 అక్టోబరు నెల 'భారతి' 'కలగూర గంప' శీర్షికలో శ్రీ పమిడిపాటి వేంకట రంగారావుగారు శ్రీనాథ మహాకవి భీమేశ్వర పురాణమునందలి ''కనక క్ష్మాధర ధీరు వారిధి తటీ పాకలే పట్టణాధీశ్వరున్'' అను పాఠమున ఛందో భంగ దోష మున్న దని వ్రాయుచు ''కనక క్ష్మాధర ధీరు వారిధి తటీ క్రొం బట్టణాధీశ్వరున్'' అను పాఠము గ్రాహ్యమనిరి. ''పాకలే'' అన్న ఆచార్యుల వారి (1978 సెప్టెంబరు భారతి) పాఠము నందలి ఛందో దోషమును, ''క్రొంబట్టణ'' మను పాఠమును వీరు స్వీకరించుచు పరిహరింపబోయిరి. కాని ఈ పాఠ స్వీకృతి వలన యతి దోష మిందు అనివార్యమైనది. ప్రథమాక్షర 'క' కారమునకు చతుర్దశా (14) క్షర ''క్రొం'' వర్ణముతో యతి మైత్రి ఎట్లు పొసగును ? (వీరు) పండిత పరం పరాగత మగు ''క్రాల్పట్టణా ధీశ్వరున్''అను పాఠమును ముద్రారాక్షస మనుట ఎంత సాహసము? చిన్నయసూరి ప్రోతాది సంధి కిదియే లక్ష్యము గావలెనా? (క్రొంబట్టణను) నింత యోచింపుడు. ఉన్న పాఠములను దిద్ది తమకు నచ్చిన స్థలములను శ్రీనాథుని జన్మస్థల మనుట కంటెను శ్రీనాథ మహాకవి రచనలను కుణ్ణముగా చదివి, శాసనముల పరిశోధించి, సమకాలికుల రచనలను, బాంధవుల రచనలను పరికించి కవిసార్వభౌముని జన్మస్థలమును నిర్ణయించుట లెస్స.

— శ్రీ టి. రామకోటేశ్వరరావు

## దోషము తొలగిపోయినది

''శ్రీనాథుని జన్మస్థలము, పాఠాంతరము—ఛందోదోషము'' అన్నశీర్షికతో నవంబరు 'భారతి'లో విద్వాన్ టి. రామకోటేశ్వరరావు గారు వ్రాసిన విమర్శ చదివినాను. అందులో వారు, శ్రీ విద్వాన్ కొమాండూరి రామానుజాచార్యులవారు ఉల్లేఖించిన ''కనకక్ష్మాధర ధీరువార్ధితటపాకలే పట్టణాధీశ్వరున్'' అను పాదమున ఛందో దోష ముందని అభిప్రాయపడినారు.

కొమాండూరివారు చెప్పిన పురాతనమైన వ్రాత ప్రతిలోని పాఠాంతరమును కేవలము ఛందోదోషమున్నదని చెప్పి త్రోసి పుచ్చుట సరికాదు. దానిని ఛందోదోషము లేకుండ మనము భావింప వచ్చును.

''కనకక్ష్మాధర ధీరు వార్ధితట పాకలే పట్టణాధీశ్వరున్'' అనే పాదంలో 'పాకలే' అనుటకు బదులు ''పాకల్'' అని చదువుకోవాలి. ''ల్'' అనునది ఒకోసారి వ్రాత ప్రతులలో ''లే'' వలె భావింపబడుటకు కూడ అవకాశమున్నది. ''ల్'', ''లే'' ఈ రెంటికి అకార భేదమంతగా కానరాదు. అందులో అది కొమాండూరివారన్నట్లు పురాతనమైన వ్రాత ప్రతికదా!

''పాకల పట్టణము'', పద్యం కాబట్టి గణభంగంకాకుండ ''పాకల్ పట్టణ''మని వ్రాయబడియుండును.

| కనక | క్ష్మాధర | ధీరువా | ర్థితట | ప్రాకల్ప్ప | ట్టణాధీ | శ్వరున్ |
|---|---|---|---|---|---|---|
| IIU | UII | UIU | III | UUU | IUU | IU |
| స | భ | ర | న | మ | య | వ |

రామకోటేశ్వరరావుగారు తలపోసిన ఛందోదోషము తొలగి పోయినది.

శ్రీ రావి రంగారావు

డా. దాశరధిగారు, జులై (1977) 'భారతి'లో ''మలయా భాషా స్వభావాలు'' అను తమ వ్యాసములో [పేజి9] ''మలే భాష లోని మరో ప్రత్యేకత ఏమిటంటే—బహువచనానికి ఏకవచన శబ్దాన్నే రెండుసార్లు అంటారు'' అని వ్రాసితిరి. ఇది సరికాదని నా మనవి. ఈ ద్విగుణీకరణము (Reduplication), బహువచన మును సాధించుటలో అపవాదమే (Exception) కాని నిత్య నియ మము (Fixed rule) కాదు.

మెలయు భాషలో వచనము సందర్భానుసారముగా నుండును

ఉదా : బైక్ పెర్గి బెలి పకు; ఎసాక్ నక్ బుఅత్ పగర్

నీవు వెళ్ళి మేకులు కొనుము; రేపు ఫెన్స్ కట్టవలెను.

ఇచట ''పకు'' (మేకు) అను పదమును బహువచనములోనే యర్థము చేసుకొనవలెను.

ద్విగుణీకరణముయొక్క ముఖ్యోద్దేశము బహువచనములోని యవ్యక్తతను (Indefiniteness) సూచించుటకే గాని బహు వచ నమును గాదు. కావున సంఖ్యావిశేషణమున్ననూ, బహువచనమును సూచించు ఇతర పదమున్ననూ ద్విగుణీకరణము సంభవించదు.

ఉదా : 1. తుజొహ్ ఒరంగ్=ఏడుగురు మనుష్యులు.

(ఒరంగ్=మనుష్యులు)

లా  ల్

ఉదా: 2: జికత లపర్, అంబిత్ సదికిత్ బుఅహ్ పిసంగ్

ఆకలిగాయున్న, కొన్ని అరటిపండ్లను తీసుకొనుము.

(సదికిత్ = కొన్ని. పిసంగ్ = అరటి పండ్లు)

అవ్యక్త విబేధము (Unspecified Variety)ను తెలుపు నపుడు ద్విగుణీకరణము జరుగును

ఉదా : ది—పెర్సున్‌జొకన్ ఇతు అద బుంగ—బుంగ యంగ్ ఎలోక్ స—కలి. ప్రదర్శన(=Flowershow)లో అందమైనయనేక రకముల పుష్పములున్నవి. (బుంగ—బుంగ=పుష్పములు. మల్లె, గులాబి, చామంతి ఇత్యాది.)

కాని, అద బుంగ ది—అతస్ మెజ.

బల్లమీద పుష్పము లున్నవి.

శ్రీ పిళ్ళారిసెట్టి నరసింహారావు

## పాకాల-యాదగిరి

నవంబరు 'భారతి'లో శ్రీనాధుని జన్మస్థలం గురించిన శ్రీ విద్వాన్ టి. రామకోటేశ్వరరావుగారి వ్యాసం చదివాను. శ్రీ విద్వాన్ కొమాండూరి రామానుజాచార్యులవారు శ్రీ శేషయ్యగారి వద్ద నున్నదంటూ చూపెట్టిన పారాంతరంలో రామకోటేశ్వరరావు గారెత్తి చూపిన ఛందోదోషము సరియైనదే. అయితే ఇది లేఖక దోషమై ఉండవచ్చును కదా!

ఒకమూలప్రతిలో కొన్ని అక్షరము లేకారణముచేతనో శిధిల మైనపుడు దానికి ప్రతికల్రాయు వివిధ లేఖకులు ఆ శిధిలభాగము నర్థం చేసుకోవడంలో వైవిధ్యం తప్పదు. ఆ విధంగా శ్రీ శేషయ్య గారివద్దనున్న పురాతన వ్రాతప్రతికిని, ప్రచురణ భాగ్యం పొందిన ప్రసిద్ధ వ్రాతప్రతికిని మూలప్రతి ఒకటి ఉందనుకుంటే అందులో వివాదాస్పదమైన ప్రస్తుత పద్యపాదం ఇలా ఉండాలి :

''కనక క్ష్మాధరధీరు వార్థితట పాకాల్పట్టణాధీశ్వరున్.'' దీనివలన ఎంతోకాలంగా అంతుపట్టని కాల్పట్టణ నిజరూపం తెలు స్తోంది. ఇక శ్రీనాధుడు పాకనాటి వాడనే విషయం ఆ తరువాత మరో పద్యంలో స్పష్టంగానే ఉంది. అందుకీ పద్యపాదాన్నే ఉప యోగించుకోవలసిన పనిలేదు.

అదే సంచికలో డా॥ ముదిగంటి సుజాతారెడ్డిగారు 'యాద గిరి'పై వెలిబుచ్చిన అభిప్రాయం సమంజసంగా లేదు. ఆంధ్ర దేశంలో జైనమత వ్యాప్తినాటికి జైన తీర్థంకరుడు వర్థ మానుడు అతని ముందువాడు పార్శ్వనాధుడు. అక్కడి స్థలాలకు జైనసంప్రదాయానుగుణమైన పేర్లు సిద్ధింపడం నిజమైతే పైన పేర్కొన్న తీర్థంకరు లిద్దరిలో లేక కాకతి రాజులను జైనమత ప్రవిష్ఠులను చేసిన జైన యతి ఋషభనాధ తీర్థునిదో ఆ పేరయి ఉండాలి. అది తీర్థంకరుని ఉపనామం వచ్చిందనుటలో అన్వయ దూరత కనిపిస్తోంది. ఇందుకు వారు చూపిన ఆధారాలు కూడ అంతగా అతకటంలేదు. ఆదియ్య, ఆదెమ్మ అనే పేర్లు గుంటూరు, ఒంగోలు ప్రాంతాలలోనూ ఎక్కువగా కనిపిస్తాయి.

నిజానికి 'యాదగిరి' అనేది కాకతి రాజుల తొలి రోజుల వరకు ప్రసిద్ధి పొందలేదు. ఆ ప్రదేశమందలి నరసింహక్షేత్రం పురాతన మైందిగనే భావిందబడుతోంది. జైనక్షేత్రంగా కనుక మార్చబడి ఉన్నట్లైతే అక్కడ ఉన్న నరసింహాలయం యింకానిలిచి ఉండేదా!

యాదగిరి ఓరుగల్లుకు వాయువ్య దిశలో ఉంది॰ రుద్రమదేవి మీదకు యాదవరాజు రుద్రమదేవి సవతికొడుకైన హరిహరదేవుని సహాయమున వాయువ్యదిశనుండియే దండెత్తి వచ్చాడు॰ కాబట్టి అలా దండెత్తి వచ్చిన యాదవరాజు కీ ప్రదేశం స్థావరంగా ఉప యోగపడి ఉండి ఉంటుంది. అందుచేత ఆ చిన్న కొండలాంటి గుట్టకు 'యాదవగిరి'అని పేరువచ్చి ఉంటుంది. తరువాత తరువాత ప్రజల నోళ్ళలో అది 'యాదగిరి'గా స్థిరపడింది.

శ్రీ చింతలపూడి వెంకటేశ్వర్లు

# గ్రంథ విమర్శలు

## "తెలుఁగు వారెవరు ?"

[తెలుఁగు వారెవరు—పరిశోధక వ్యాసము. వేదము వేంకట రాయశాస్త్రి ఎం. ఏ. 4. మల్లికేశ్వర గుడినందు, లింగిసెట్టివీధి, మదరాసు–1. వెల–౧.50.]

సుప్రసిద్ధ విద్వాంసులు వేదం వేంకటరాయ శాస్త్రి యమ్మే గారు దీనిని పరిశోధక వ్యాసముగా ప్రకటించినారు. ఇది మొదట 1969 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో వ్యాసముగా ముద్రిత మైనది. పెద్దలెందరో ఇందలి విషయ విశేషముచే నాకర్షింపబడిరి.

56 పుటల లఘు పుస్తకమైనను 14 భాగమైన శీర్షిక లతో నిది వెలువడినది. ఆంధ్ర, తెలుగు, తెనుగు,పదముల విమర్శ ఇందున్నది. ఈ పదములతో బాటు గ్రంథకర్త శాసన పరిశోధన కావించి 'తిలు' శబ్దమును బయటికి లాగినారు. ముదిరాజుల చరిత్ర కూడ కొంత కలదు.

గ్రంథసారాంశ మిట్లున్నది :

"శాతవాహనులు ప్రాకృతమును, పల్లవులు మొదట ప్రాకృతమును, తర్వాత సంస్కృతమును వృద్ధిపఱుపఁగా చేర, చోళ, పాండ్యులలో పాండ్యులు తమిళమును పోషింపగా. చేర (కేరళ) రాజులు మళయాళ భాషను ఆదరింపగా చోళులును, వారితో చేరిన ముది రాజులును, కాకతీయులును, రెడ్లుగా వెలసిన రాష్ట్రకూట, తులువ కులాల వారును తెలుఁగును వృద్ధిపఱిచిరి. వీరి వలననే తెలుఁగని పేరేర్పడి, వీరు క్రమముగా ఆంధ్రదేశమున వ్యాపించుటచేత, ప్రాకృతము పోయి దాని స్థానమును ఈ ద్రావిడ భాష ఆక్రమింపఁగా సంస్కృత ప్రాకృత వాఙ్మయముల ప్రభావముల చేత తెలుఁగు కూడ మారినది......ప్రాచీన శాతవాహనులది కాన ఆంధ్ర శబ్దము నిలిచినది

తెలుఁగువారు క్రొత్త వారగుట చేత తెలుఁగు శబ్దముకూడ నిలిచినది. ఉత్తర, దక్షిణ దేశముల సంస్కారములకు కలయిక కలిగిన దానిని ఈ రెండు పదములు సూచించుచున్నవి. మన దేశమునకు భాషకును రెండు పేర్లుండుటకు ఇదే కారణము !! (పుట 55).

తెనుగు వారెవరు అనునది చారిత్రక దృష్టిలో పరిశీల నాంశమే. 1969లో తెలంగాణా ఉద్యమ సందర్భమున రచించిన వ్యాసము కావున దీనికి ఈ ప్రశ్నార్థక శీర్షిక సముచితముగా నున్నది. నేడీ సమస్యను చర్చించుట కేవలము విశోద్దైక ప్రదర్శ నమే మతములు వేరైనను భాషా పరముగా దీసికొన్నచో తెలుగు గడ్డ తరతరముల నుండి తెలుగు మాతృ భాషగా గలిగిన మహమ్మ దీయులు, క్రైస్తవులు తెలుగువారే; అదేవిధముగాఇతరరాష్ట్రముల నుండి వచ్చి తెలుగు నేలపై తరతరముల నుండి జీవించుచున్న వైష్ణవులు, ద్రావిడుల, మహారాష్ట్రులు, మాధ్వులు, మొదలైన వారు తెలుగువారే. అందరూ భారతీయులే.

4 సంవత్సరములొక చోటనే విద్యాభ్యాసన మొనరించినచో స్థానికులగుచున్నారు. అయినను చారిత్రకారులు ఇటువంటి చర్చలు చేయుట సహజమే.

ప్రస్తుత పుస్తకములో గ్రంథకర్త భాషాపరముగాను, జాతి పరముగను ఈ పదముల పుట్టు పూర్వోత్తరములను చక్కగా చర్చించి యున్నారు. అయినను కొంత చర్చ వ్యర్థమని పిం చుచునే యున్నది.

ఆంధ్రభాషా సుకవిశేఖరుడని తన సహధ్యాయి నారాయణ భట్టును పొగడి, తాను తెనుగులో భారతము రచించితినని మన ఆది కవి నన్నయభట్టే 'ఆంధ్రభాషా,' 'తెనుగు' అను పదములు సమా నార్థకములని సూచించెను. ఆంధ్రావళి మోదము లొడకు తిక్కన కూడ తెనుగుననే భారతము ననువదించెను. అయినను "తెలుగు" పదమువాడక పోలేదు. నిర్వచనోత్తర రామాయణమున ఈ పద మును ప్రాసఘటితముగా ప్రయోగించెను.

తెనుగునకు లక్షణము లేదని వగచిన కేతన క్రొత్తగ నాంధ్రభాషకు లక్షణము వ్రాయుచున్నానని చెప్పెను. ఈ అభినవ దండి 'తెలుగు' 'తెనుగు' పదములకు నిర్వాహక ప్రయోగములు చేసెను.

వేయేల తెనుగున భారతమును రచించిన నన్నయను కవి బ్రహ్మ తిక్కన ఆంధ్ర కవిత్వ విశారదుండని స్తుతించినాడు.

ఆంధ్రదేశమును తెలుగు దేశమన్న వారును కలరు. వేముల వాడ భీమన్న చాటువే నిజమయినచో 'తెలుంగాధీశ,' యని తన రాజును సంబోధించి యున్నాడు. విన్నకోట పెద్దన తెలుగు దేశ మని పేర్కొన్నాడు. 'దేశంబు తెలుగౌను' అని రాయల నిష్కర్ష.

1194 చక్రధరుడనవి మహారాష్ట్ర కవి "తైలింగ దేశ కన్నడదేశ మహారాష్ట్రీయ దేశ నవత్సావే" అని తెలుగు దేశమును పేర్కొనెను.

బ్రాహ్మణోత్పత్తి మార్తాండమను గ్రంథమున పంచగౌడ, పంచ ద్రావిడులను పేర్కొనుచు —

కర్ణాటక కశ్చ తైలింగ ద్రావిడ మహారాష్ట్రకాయని పంచ ద్రావిడులలో తెలుగు వారొకరని తెల్పెను.

చిన్న పుస్తకమైనను గ్రంథకర్త అనేక విషయములను క్రోడీకరించి క్రొత్త ఆలోచనలను రేకెత్తించునట్లు దీనిని సంత

రించిరి అంతయు బాగున్నది కాని పూదూరు ద్రావిడుల వంటి వేద పండితులతో ఆనాటి రాజులు ఆంధ్రదేశమున క్రమముగా వ్యాపించి రనుట స్వశాఖాభిమానమును చాటునేగాని చారిత్రక సత్యము మాత్రము కాదు.

# పాశ్చాత్యులు తెలుగు భాషా సంస్కృతులు

(గ్రంథకర్త: కె.ఆర్.కె. మోహన్, డెమ్మీ—129 పుటలు వెల: 15—00, ప్రచురణ : శ్రీముఖపబ్లికేషన్స్, ప్లాటునె. 10, 1—3. గడ్డి అన్నారం, హైదరాబాదు—36.)

ఈ గ్రంథమున పాశ్చాత్యులు తెలుగు భాషా సంస్కృతుల కొనర్చినసేవ వివరింపబడినది. ఇందు 1. ప్రస్తావన 2. నాటి పరిస్థితులు 3. ముద్రణావతరణం 4. మత సాహిత్యం 5. ఫ్రెంచి విద్వాంసుల తెలుగు భాషా సేవ 6. జర్మన్ విద్వాంసుల సేవ 7. ఇతర పాశ్చాత్య విద్వాంసులు 8. కల్నలు కాలిన్ మెకంజీ 9. బిషప్ కాల్డ్వెల్ 10. తెలుగు నిఘంటువును గూర్చిన పాశ్చాత్యులు 11. తెలుగు వ్యాకరణాన్ని రచించిన పాశ్చాత్యులు 12. కారణజన్ముడు ఆంధ్ర బంధు సి. పి. బ్రౌన్ 13. గ్రంథ సేకరణ సంస్కరణ ముద్రణ 14. బ్రౌన్ తెలుగులిపి సంస్కరణ 15. బ్రౌన్ తెలుగు వ్యాకరణ రచన 16. బ్రౌన్ తెలుగు నిఘంటువుల నిర్మాణము 17. బ్రౌన్ ఇతర రచనలు 18. పాశ్చాత్యుల దృష్టిలో వేమన 19. తెలుగులో భావ భాషా విప్లవాలు ఆంగ్ల విద్య 20. రష్యనుల తెలుగు భాషా సేవ 21. అమెరికన్ల తెలుగు భాషా సేవ 22. ముగింపు అను శీర్షికలు గలవు.

ఈ గ్రంథము ప్రధానముగా ఆంధ్ర భాష కనిర్వచనీయమైన సేవ యొనర్చిన బ్రౌను దొరవారి యపూర్వ కృషిని వెల్లడించుటకు రచింపబడినది కాని గ్రంథము సక్రమమైన రీతిని సంతరింపబడక పోవుటచే గ్రంథకర్త యుద్దేశ మెంత మాత్రము నెరవేర లేదు. అతడు చాల పరిశ్రమ చేసినాడనుట వాస్తవము. కాని రచనాపద్ధతి అస్తవ్యస్తమైనది. తక్కిన పాశ్చాత్యులమాట యటుండగా బ్రౌను గూర్చి ఈనాడు జరిగిన పరిశ్రమ కూడ ఈ గ్రంథకర్తకు ఈషన్మాత్రము తెలియదు.

తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము వారు బ్రౌను గూర్చి ప్రత్యేక పరిశోధనకు 'బ్రౌను పరిశోధన ప్రణాళిక' అను పేర ప్రత్యేక విభాగము నేర్పాటు చేసినారు. ఈ దేశమున గాక ఇంగ్లండులో అతని అముద్రిత రచనలు సేకరించుచున్నారు. బ్రౌన్ పై పి. హెచ్. డి. కోసము పరిశ్రమ చేయుచున్న విద్యార్థులు కలరు. ఇప్పటికి 1. బ్రౌను లేఖలు 2. బ్రౌను కడప లేఖలు 3. బ్రౌను ఆంధ్ర గీర్వాణ ఛ్ఛందము—బ్రౌను ఆత్మ కథ, అను మూడు గ్రంథములు ప్రకటించినారు.

ప్రస్తుత గ్రంథమున పై వానిని గూర్చి పల్లెత్తు మాట యైన లేదు. అంతకన్న ముఖ్యముగా బ్రౌను చేసిన సేవయు విస్తరింప బడలేదు. బ్రౌను వేమన పద్యములను 3228 ని ఆంగ్ల భాషలోనికి అనువదించినాడు. అవి అయిదు పెద్ద సంపుటాలు. ఆతని నిఘంటు రచన గూర్చి అసమగ్రముగా నున్నది. అతడు తెలుగు కావ్యములను గూర్చి, తెలుగు వాఙ్మయమును గూర్చి ఆంగ్ల భాషలో వ్రాసిన వ్యాఖ్యా వ్యాసములు ఇందు కలికమానకైన కానరావు

తెలుగు గ్రంథ ముద్రణ గూర్చి యీ వరకే. డా. మంగమ్మ గారి 'బుక్ ప్రింటింగ్ ఇన్ ఇండియా' అన్న గ్రంథము ముఖపత్రములతో గూడ వివరములు గలవు.

# మె క ం జీ

ఈతని సంపుటములను గూర్చి వ్రాసిన వ్రాత సరియైనది కాదు. ఇవి 1553 సంపుటాలులేవు. 300 మాత్రమే. ఇందులో 184 సంపుటాలు తెలుగునకు సంబంధించినవి.

బిషప్ కాల్డ్వెలు తెలుగు కన్న తమిళమునకే ఎక్కువ సేవచేసి యున్నాడు. 46 పుటలో ఇల్లీసు గూర్చి వ్రాసినది సరి కాదు. ఆతని గ్రంథము పేరు "A Dissertation of the Telugu Language" రచన 1816; దీనిని నేను—1951లో మద్రాసు విశ్వవిద్యాలయ పరిశోధన పత్రికలో ముద్రించియున్నాను.

విషయ వివరణమున తప్పులు కుప్పలు. 'తెలిగు భాష' ఆదిలో గాంసపాదు, ముద్రణావతరణం 9వ పుట 16వ పుట ఒకటే రెండు సారులు ముద్రితమైనది. రెండింటిలో విషయము చర్విత చర్వణము. గ్రంథ ముద్రణ సంవత్సరములు అన్నీ తప్పులు. కాల్డ్వెలు గ్రంథము1913లో1953లోకూడా అచ్చయినది.కావలి వేంకటరాయస్వామి డెక్కను పోయట్సు1829, 1847, 1888, 1974లో నాలుగు సారులు అచ్చయినది. భాగవతము మొదట అచ్చువేసినది బ్రౌనుకాదు ఎన్నని చూపను—? పురాణము హయగ్రీవశాస్త్రి. ఇందలి విషయములు విస్పందేహములు, నిర్దిష్టములు అయినను నిందు రచనలో వరుస వాడియు లేకపోవుటచే మనకు పాశ్చాత్యుల కృషి ప్రవ్యక్తము కాలేదు గ్రంథకర్త పాటించవలసిన క్రమమిది. షూల్జ్—తెలుగు గ్రంథ ముద్రణ బ్రహ్మ—2 ఇల్లీసు—భాషావేత్త 3 కాంబెలు—వ్యాకరణ నిఘంటుకర్త—4 మెకంజీ—సంస్కృతి చరిత్రకర్త—బ్రౌను భాషా సాహిత్యవ్యాప్తి—తెలుగులో షూల్జ్, ఇల్లీసు, కాంబెలు, మెకంజీ, బ్రౌను. వీరిలో షూల్జ్ ముద్రణ బ్రహ్మ—బ్రౌను విష్ణువు.

పై సమీక్ష వలన గ్రంథ ప్రయోజన మెట్టిదో పాఠక లోకమే నిర్ణయించుగాత—

*శ్రీ నిడుదవోలు వేంకటరావు*

## శ్రీకృష్ణ పరమాత్మ జాతకము

[రచన : శ్రీ టంకాల సత్యనారాయణ. ప్రాప్తిస్థానం: రచయిత పేర నివగాం, పిన్‌కోడ్ 532457 శ్రీకాకుళం జిల్లా అని వ్రాసేది. వెల: రు. 2-50.]

వాల్మీకి రామాయణం, భోజచంపువు ఆధారంగా శ్రీరాముని జాతకం వేసినట్లు శ్రీకృష్ణునికి జాతక చక్రం వెయ్యడానికి ఒక్క నక్షత్రం, సమయం తప్ప ప్రధాన గ్రంధమని భావించే శ్రీ మద్భాగవతమువల్ల ఏ ఆధారాలూ దొరకనందువల్ల హరివంశమునూ, ఎర్రన అనూదితమైన హరివంశమునూ, గార్గ్యమునూ ఆధారము చేసుకుని శ్రీ సత్యనారాయణగారు నక్షత్రమును, అయిదు గ్రహాల ఉచ్ఛస్థితినీ,లగ్నమునూ, వారమునూ, కృష్ణజనన సమయమునూ, తిథినీ, సంపాదించి ఒగ్గా గ్రంధమును పటిష్ఠమైన శాస్త్రీయ పద్ధతిని వ్రాశారు. వారి కృషి సఫలమనే సంతోషించవచ్చు.

గ్రహపంచకం ఉచ్చస్థితిగా ఉండడం వారు సాధించిన తీరు శాస్త్రీయంగా ఉందనడానికి సందేహం లేదు. ఇక తమోగ్రహమైన రాహువుకి మేషస్థితి కలిగించడమనేది దైవికంగా వారికి తోచినదే. అది హేతూవే అయితే కారాగృహజన నాదికం కలిగించలేదు. గోచార రీత్యా రాహువు వ్యయమందు ఉన్నాడు కనుక

'చతురష్ట మద్వాదశ పంచమగే
శనిసైంహిక భార్గవ భూమిసుతాః
వధబంధ నిరర్ధక రోగకరాః'

అనే లక్షణానికి లక్ష్యముగా చెరలో పుట్టడం జరిగిందనవచ్చు. ఆ రాహు దశలో వ్రేపల్లెను, మధురను వదలి ద్వారకలో స్థిర నివాసం వంటివి కలిగా యనవచ్చు.

శరీరచ్ఛాయ విషయం కూడా సత్యనారాయణ గారూ అంశ లగ్నాత్తు సాధించడానికి ప్రయత్నించారు. అది మాత్రం నాకు అంత బలీయముగా తోచలేదు

(బల) రామకృష్ణులు విరాట్పురుషుని సితాసిత కేశ సంభవులుగా సనాతన పురాణోక్తినిబట్టి తెలుపు నలుపు మైచాయలతో ఉన్నారనేది పరమ ప్రమాణముగా తీసుకుని ఒగ్గా జ్యోతిష సంబంధం వదులుకుంంటే నచశంకాసచోత్తరవ్—అని నా ఉద్దేశం. వృషభం లగ్నమై దానితో ఉచ్చశశి ఉండి రోహిణి జన్మ నక్షత్రము కాగా నవాంశ చక్రమందలి గ్రహసమ్మేళన మాత్రాన అంత నీల వర్ణంరావడం విపరీత సిద్ధాంతమవుతుందని నా అభిప్రాయం. కర్కాటము లగ్నమై గురు చంద్రులు దానియందు ఉండగా జన్మించిన రాముడు ఎందుకంత విరుద్ధ వర్ణుడయాడంటే ఇదే సమాధానం.

ఇక, కృష్ణుని బహు భార్యత్వం, పుత్రబాహుళ్యం, పరాక్రమాదికం గురించి సత్యనారాయణగారి సిద్ధాంతం పొందికగాఉంది. నేటికి కృష్ణు జననం ఎంతకాలం ముందు జరిగిందన్నది చక్కగా లెక్కచూపి తేల్చారు. సమర్ధనీయంగా ఉంది.

కలి పూర్వము 138 ఏండ్లు. క్రీస్తుపూర్వం 3239– దుర్మతి నామ సంవత్సరము అని సత్యనారాయణగారు వివిధ గ్రంథ విషయాలను విమర్శించి ఒక నిర్ణయానికి వచ్చి తేల్చారు. వారి కృషి కృతార్థమయింది.

ఈలాటివి చాలా ఆవశ్యకములైన విషయాలు ఈ గ్రంథములో ఉన్నవి. ముఖ్యముగా అవతార పురుషుల జాతక చక్రాలను ఆధారము చేసుకుని జ్యోతిషికులు తమ విజ్ఞానాన్ని పెంపొందించుకొనడం అవసరం కదా! ఆలాటి వారికి ఈ గ్రంధం మహోపకారి అని నేను గట్టిగా చెప్పగలను.

*శ్రీ యామిజాల పద్మనాభస్వామి*

## ఏకాంక సంగ్రహం

భరతుడు రూపకములతో వ్యాయోగ, అంక, ప్రహసన, బాణ, వీధులు ఏకాంకికములని చెప్పెను ఈనాడు వెలువడుచున్న నాటకాలు ప్రాచీన లక్షణానికి దూరమైనట్లే ఈ ఏకాంకికలు దూరమయ్యాయి. పాశ్చాత్య సాహిత్యంలో (one act play) ఏకాంకిక అనేది ఒక నూతన ప్రక్రియ. ఆధునిక కాలంలో నాటక సమాజాల వారు ఏకాంకిక ప్రక్రియ చేపట్టటం చేత దీని వైశాల్యం పెరిగింది. రచయితలు కూడా దీని పై మోజుపడి రచన చేయటం ప్రారంభించారు.

ఈ ఏకాంకిక నాటిక కంటే వైశాల్యమున చిన్నది. ఇది వ్రాయటం అంత సులభం కాదు. నాటక రచన చేసిన వారు ఏకాంకికను రచింపగలరని నిష్కర్షగా చెప్పలేం. దేని ప్రత్యేకత దానిది. దేని రచనా పద్ధతి దానిది.

ఏకాంకికకు క్లుప్తంగా కథ చెప్పటం ప్రధానం. వస్తువును విస్తృతి చేయకూడదు. సంభాషణలు పరిమితంగానే ఉంటాయి. కథలో ప్రాసంగేతి వృత్తాలు ఉండవు. స్థలంలో కూడ మార్పు ఉండదు. ప్రదర్శన కాలం పరిమితమే. పాత్రలు చాలా తక్కువగా ఉంటాయి.

ఏకాంకిక కన్నడ సాహిత్యానికి క్రొత్తది. ఒకవేళ అది సాహిత్యంలో ఉన్నదంటే దానికి కారణం పాశ్చాత్య సాహిత్య సంపర్క ఫలితమే. ఆందునా ఆంగ్ల సాహిత్య ప్రభావంగా కన్నడంలో ఏకాంకిక ఏర్పడింది.

కన్నడంలో ఆద్య రంగాచార్యులు గారు ఉత్తమ రచయితల ఏకాంకికలను సంకలనం చేసారు. ఆ సంకలన గ్రంధాన్ని శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి గారు తెలుగులోకి అనువాదం చేసారు. ఈ 'ఏకాంక సంగ్రహం' లో మొత్తం పదకొండు

ఏకాంకికలున్నాయి. అవి బిరుదు మగడు, వైద్యునివ్యాధి, దాంపత్య రగడ, మాజాతి, శూద్రతపస్వి, హరిణాభిసరణము, గండ్రగొడ్డలి, ఎత్తినచేయి, చచ్చేఆట; సాముద్రికుల సామ్రాజ్యం, అనుగ్రహం.

ఇందులో మొదటి ఏకాంకిక 'బిరుదు మగడు' ఇతివృత్తం చారిత్రికం — మహీశూరులే మైసూరు ప్రభువులు· ఆ ప్రభువుల కున్న బిరుదముల యొక్క వైశిష్ట్యాన్ని చెప్పటానికే నంజశెట్టి పాత్రను సృష్టించి అతని వ్యక్తిత్వ ప్రదర్శన ఇందులో ప్రధానంగా కాన్పిస్తుంది.

'వైద్యునివ్యాధి' హాస్యపూరితమైనట్టిది. భిన్న సంసారాల యొక్క స్వరూపం ఇందులో కాన్పిస్తుంది. తన సంగతి తాను తెలిసికోలేక పొరుగుననున్న వానికి సలహా యియ్యటానికి పూను కుంటాడు. తన భార్యకు తాను లొంగిపోయి అడ్డమైన చాకిరీ చేస్తున్న విషయం మరచిపోయి ఎదుటి వాని భార్యను గూర్చి రెచ్చగొట్టి రచ్చకీడుస్తాడు. విషయం తెలుసుకొని సుబ్బన్న యింటిమీద రంగన్న భార్య, అత్తగారు దండయాత్ర చేస్తారు. దాని ఫలితం వల్ల ఎవరి సంసారాలు వారు చూచుకుంటారు.

'దాంపత్య రగడ' ఒకడు ప్రేమించిన స్త్రీని మరొకడు వివాహమాడతాడు. ఆ స్త్రీకి తాళికట్టిన వాడిమీద, కట్టనివాడి మీద ప్రేమ, మమకారాలు కలుగుతాయి. పూర్వ ప్రేమికుడు ఇంటిలో చేరతాడు. ఆ స్త్రీ అతన్ని బిడ్డగానే చూచింది గాని ప్రేమికునిగా పరిగణించలేదు· అట్టి ప్రవృత్తిని ప్రదర్శించటమే ఈ ఏకాంకిక వైశిష్ట్యం.

'మా జాతి'ఎలక్షన్లు, రాజకీయాలు, మోసాలు, క్రౌర్యాలు, కుమ్ములాటలు మొదలైన వానిని రచయిత సహజంగా అద్దంపటి చూపించారు.

'శూద్ర తపస్వి' 'హరిణా భిసరణము' ఈ రెండూ గేయం, వచనాలతో సమ్మేళనం చెంది ఉన్నాయి. ఏకాంకికలో ఇది యొక ప్రక్రియ. 'సామాజిక జీవితంలో ఎటువంటి తిరుగుబాటు నడుస్తున్నదో వేల సంవత్సరాలుగా శాస్త్ర సంప్రదాయాల అధికారాన్ని, మద్దతుని పొందిన జాతి పద్ధతి అసహనీయమైందని, అన్యాయమనీ తెలుపబడుతోంది.'' తరతమాలు లేక అందరూ సమానమే అనే తత్వాన్ని బోధిస్తుంది 'శూద్ర తపస్వి'. సీత బంగారు లేడిని కోరుట, రాముడు లేడిని అనుసరించుట మొదలైన వన్నీ 'హరిణాభి సరణము' నందు రచయిత వివరించారు.

'గండ్ర గొడ్డలి' పరశురాముని వృత్తాంతానికి చెందింది. కథ పౌరాణికమైంది· తండ్రి మాటలు జవదాటని పరశురాముని ప్రతాపమిందు వ్యక్తమైంది.

'ఎత్తిన చేయి' ఉద్యోగం పురుషలక్షణం అనే సూక్తిని చాటుతుంది. శంభురాయలు భార్య పోరుపడలేక ఉద్యోగం కొరకు నానాయాతనలు పడ్డాడు. చివరకు ఆ ఉద్యోగం దొరకక అలసి పోయాడు. అతని జీవితమే ఇందు వర్ణితం.

'చచ్చేఆట' చాలా చిత్రమైన ఏకాంకిక. దొరగారు అమాయకుడు. ఒక దొంగ వచ్చిపోతే ఆ దొంగ చావటానికి కారణ మైన వ్యక్తులను దొరగారు అన్వేషిస్తారు. చస్తానని వచ్చే వ్యక్తే దొంగ చావటానికి కారణమనుకుంటాడు పిచ్చిదొర. రాజుల న్యాయ విచారణపై ఈ ఏకాంకిక పరిహాస ప్రభంజనంలా కాన్పిస్తుంది.

'సాముద్రికుల సామ్రాజ్యం' చదువులు చదివి నిరర్థకంగా ఉండలేక జ్యోతిష్కుడైన వ్యక్తి చరిత్ర ఇందు చెప్పబడింది.

'అనుగ్రహం' అనే ఏకాంకిక ఉదాత్తమైంది. శత్రువును శత్రుత్వంతో గాక ప్రేమతో జయింపవచ్చునన్న నగ్నసత్యాన్ని చాటి చెబుతుంది. ఆదర్శం, ఉదారత ఈ రెండూ ఈ ఏకాంకికతో ఉన్నాయి.

శ్రీ ఆద్యరంగాచార్య గారు పరిచయంలో 'ఏకాంకమనేది ఆధునిక కన్నడానికి కొత్తది' అని ఆ పేజీలోనే మరొకచోట 'ఏకాంకిక కన్నడానికి కొత్త అని చెప్పడంలో' అన్నారు. పై వాక్యంలో ఆధునిక కన్నడానికి కొత్తది అన్నప్పుడు ప్రాచీన కన్నడానికి పాతదేమోనను సందేహం కలగటానికాస్కారం ఉంది. కాని రెండో వాక్యం మొదటి వాక్యంతో భేదిస్తుంది. పైవాక్యంలో 'ఆధునిక' తీసివేస్తే పేర్కొనిన వాక్యాలకు సమన్వయం కుదురు తుంది.

ఈ గ్రంథాన్ని శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి గారు తెలుగు చేసారు. అనువాదమే అయినా అనువాదంలా లేదు. సహజంగా తెలుగులో వ్రాసారేమో అనిపిస్తుంది వారి అనువాదం చూస్తుంటే. సామాన్యునకు అవగతమయ్యే వ్యావహారికంలోనే అనువాదం చేసారు. అచ్చటచ్చట ఏకాంకికలందు కన్నడ పదాలే ఉపయోగించారు. ఆ పదాలకు ఆ పేజీలోనే తెలుగు అర్థాన్ని ఇచ్చారు. తెలుగు అర్థాన్ని ఇవ్వకుండా ఆ పదాలను కూడా తెలుగు చేసి ఉంటే మరల వేరుగా అర్థం వివరించేపని ఉండేదేది కాదు.

ఇతర భాషల నుండి ఈ విధంగా కథ, నవల, నాటకం, సాహిత్యం మొదలైన వానిని ఆయా భాషల్లోకి అనువాదం చేసు కుంటే ఆయా ప్రజల యొక్క జీవన విధానం తెలిసికొనటానికి అవకాశం కలుగుతుందని ఎకాడమీలు ఈ విధంగా దేశంలో భాషల మధ్య సంబంధ బాంధవ్యాలు నెలకొల్పుటకై ఇట్టి గ్రంథాలు ప్రచురించటం ఎంతైనా ముఖ్యం, అని ఈ గ్రంథ ప్రచురణను బట్టి తెలుస్తుంది.

—శ్రీ రామమోహనరావు

# రెండు వ్యాకరణ పుస్తకాలు

## (1) విద్యార్థి వ్యాకరణము

[ (హైస్కూలు, కాలేజి విద్యార్థులకు) గ్రంథకర్తలు— శ్రీమతి బి. సీతాబాల, ఎం. ఏ., శ్రీ జి. వెంకటేశ్వర్లు ఎం.ఏ.

జూనియర్ తెలుగు లెక్చరర్, శ్రీమతి పి. ఎ. కె. కాలేజి, కాకినాడ. క్రౌను 8+128 పుటలు. వెల 3 రూ. ప్రతులకు – శ్రీమతి సీతాబాల, ఎం. ఏ. 9–3–14 బూసివారివీధి, ఎల్విన్‌పేట, కాకినాడ.]

## (2) సుధాధార

[ (వివరణాత్మక వ్యాకరణము) గ్రంథకర్త శ్రీ నీలకంఠం పాండురంగము, ఎం. ఏ. తెలుగు పండితులు, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, బి. హెచ్. ఇ. ఎల్ రామచంద్రపురం క్రౌను 8 + 79 పుటలు. వెల 3 రూ.[

తెలుగు భాషలో మంచి ప్రవేశం కలగడానికి వాఙ్మయంతో పాటు ఛందోవ్యాకరణాలంకారాల లక్షణాలను కూడా తెలుసుకోవలసి వుంటుంది. వీటిలో ఛందో వ్యాకరణ లక్షణాలు తగుమాత్రం గానూ, వ్యాకరణ లక్షణం కొంత ఎక్కువగానూ అవసరం. ఈ లక్షణాలను తెలిపే గ్రంథాలు మనకు విరివిగానే ఉన్నాయి. ముఖ్యమైన వాటికి టీకలు, వ్యాఖ్యానాలు కూడా ఉన్నవి. అయినా, విద్యాలయాల్లో విద్యార్థులకు వీటిని బోధించే ఉపాధ్యాయులు వీటిని ఇంకా సులభ పద్ధతిలో బోధించాలనే కుతూహలపడుతూఉంటారు. రచనాశక్తిగల అధ్యాపకులు సంగ్రహంగా వీటిని రచించడమూ, అచ్చువేయించి ప్రచారానికి తేవడమూ పరిపాటి. అట్టి సంగ్రహ లక్షణ గ్రంథాలలో ఈ వ్యాకరణద్వయం లెక్కించదగినది.

(1) విద్యార్థి వ్యాకరణం హైస్కూలులో చదివే వారికే కాకుండా కాలేజీ విద్యార్థులకు కూడా ఉపయోగపడేది. రచించిన వారు ఎం. ఏ. ఉపాధిధారులైన దంపతులు. పరస్పరం సంప్రతించుకుని దీనిని వ్రాసి ఉండవచ్చు. ఇందులో వరుసగా సంస్కృత సంధులు, తెలుగు సంధులు, ముఖ్య వ్యాకరణ సంజ్ఞలు, సమాసములు అనే వ్యాకరణ విషయాలు మొదట ఉన్నవి. ఇవి బాల వ్యాకరణ లక్షణోదాహరణాలనే చాలా వరకూ స్వీకరించాయి. ముఖ్యమైన వ్యాకరణ సంజ్ఞలను మొదటి చెప్పి, తర్వాత సంధులను చెప్పితే బాగుండేది. అక్షరాలను గురించీ, కళ్ళాద్రుత ప్రకృతికాలను గురించీ, కృదంత తద్ధితాంతాలను గురించీ కూడా చెప్పడం కూడా అవసరమని తోస్తున్నది.

తర్వాతది అలంకార లక్షణం. ఆ విభాగంలో శబ్దాలంకారాలలో వృత్త్యనుప్రాస, లాటానుప్రాస, ఛేకానుప్రాస, ముక్తపద గ్రస్తాల లక్షణోదాహరణాలున్నవి. అర్థాలంకారాలలో ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము, అర్థాంతరన్యాసము, అతిశయోక్తి, స్వభావోక్తి, శ్లేష మాత్రం ఉన్నవి. అవసరమైన దృష్టాంతం,సందేహం, భ్రాంతిమత్తు, స్మృతి, అప్రస్తుత ప్రశంస మున్నగునవి కూడా ఉంటే బాగుండేది ఉత్ప్రేక్షలో–వస్తు, హేతు, ఫలభేదాలను చెప్పడం అనవసరమేమో! అలా చెప్తే రూపకం, అతిశయోక్తి, శ్లేషల భేదాలూ చెప్పవలసి వస్తుంది.

ఛందోవిభాగంలో, గురు లఘు నిర్ణయం, గణవిభాగం, అక్షరమైత్రి, వృత్తాలలో ఉత్పలమాల మొదలైన 12 వృత్తాల లక్షణాలూ, జాత్యుప జాతుల లక్షణోదాహరణాలూ ఉన్నవి. చివరి దోష విభాగంలో విద్యార్థులు తరుచుగాచేసే తప్పులు-అక్షర–పద వాక్యదోషాలు, వాటి ఒప్పులు చెప్పబడినవి.

దీని పైని అనుభవజ్ఞులగు లెక్చరర్లు చాలామంది సదభిప్రాయా లిచ్చారు. పరీక్షలలో కృతార్థతను పొందడానికి ఇది ఉపయోగిస్తుందని వారు తెలియజేస్తున్నారు

(2) 'సుధాధార' అనే యిది వివరణాత్మక వ్యాకరణమట! వ్యాకరణమంటే చాలామందికి ఆముదం తాగినట్లే ఉంటుంది. అలాటి వారికి ఈ 'సుధాధార' అమృతధార నందిస్తూ అభయమిస్తుందని రచయిత అభిప్రాయమేమో! రచయిత ఎం. ఏ. డిగ్రీ ఉన్నవారు. హైస్కూలు పండితులుగా అనుభవం ఉన్నవారు ఇందులోఉన్న 23 శీర్షికలలోనూ మొదటి 15 వ్యాకరణానికి సంబంధించినవి. తర్వాతి మూడు ఛందస్సుకూ, 19వది అలంకారాలకూ చెంది ఉన్నవి. తర్వాతి నాలుగూ క్రమంగా వ్యాసరచన, లేఖారచన, ప్రకృతి వికృతులు, దోషాలు–అనేవాటిని గురించి చెపుతున్నవి. వ్యాకరణాంశాలు క్రమపద్ధతిలోనే ఉన్నవి. అమృతధారగా ఉండవలసిన ఈ విషయాలలో కొన్ని అనవసర విషయాలు, కొన్ని అనుచితాలు కానవస్తున్నవి.

అక్షర విభాగంలో (5–6 పుటలు) కంఠ్యతాల వ్యాది విభాగం అనవసరం. అది కేవలం సంస్కృతానికి సంబంధించినది

పుట 8లో ద్రుతలక్షణం చెపుతూ నకారపుపొల్లు ద్రుతమన్నారు. ఇలా అంటే ఉత్వవిశిష్ట నకారానిది ద్రుతత్వంలేకుండా పోతుంది.

పుట 9–ఓ–ఓరి–ఓయి ఓసి–సంబోధన ప్రథమా ప్రత్యయాలనడం సరికాదు. ప్రకృతికి ముందు చేరే శబ్దాలు ఇవి·

12వ పుటలో లింగానికీ, వాచకానికీ భేదం లేనట్లు చెప్పబడింది. అవి విభిన్నమైనవి.

''స్వంత అర్థములు కల్గియుండిన పదములు ఒక దానితో యొకటి కలిసి సామూహిక అర్థమును బోధించు దానిని సమాస పదమని యందురు'', (పుట 38). వేర్వేరుగా ఉన్న పదము లేక పదముగా అగుట సమాసమని చెప్పుట మేలు.

60వ పుటలో శబ్దాలంకారములలో ''యమకానుప్రాస'' చెప్పబడినది. యమకం వేరు. అనుప్రాసవేరు. యమకానుప్రాస అనే అను ప్రాస భేదంలేదు. వృత్త్యానుప్రాసకాదు. వృత్త్యనుప్రాస అని చెప్పవలసి ఉన్నది.

66వ పుట—''స్వభావోక్త్యలంకారము''ను స్వభావోక్త్య లంకారము'' అనవలెను. శీర్షికయే పెద్దక్షరములతో ఇట్లుండుట తప్పు. 67వ పుటలో''స్మృతిమదలంకారము'' పై రీతినే ''స్మృతి మదాలంకారము'' అని పెద్దక్షరములతో ఉన్నది.

68 పుటలో ''ప్రస్తుతము జరుగు దానిని జరిగిపోయిన దానితో కలియజెప్పుట'' అప్రస్తుత ప్రశంస అని యున్నది. ఇది సరికాదు. అప్రస్తుత వృత్తాంతము వలన ప్రస్తుత వృత్తాంతము గమ్యమానమైనపుడే అప్రస్తుత ప్రశంస అగును.

74వ పుటలో—ప్రకృతి—వికృతుల వివరణలో ''అన్నము''నకు ''బోనము'' వికృతి యనుట సరికాదు. అది 'భోజనము'నకు వికృతి. గుణమునకు ''గొనము'' వికృతి. 'గున'మనుట ప్రసిద్ధము కాదు. 'నిక్కము'నకు సంస్కృతములోని 'నిజము' ప్రకృతికాదు.

ఎందరో అభిమానుల ఔదార్యమున ఈ పుస్తకము ముద్రింప బడినది. దీనిపైని చాలమంది విద్వాంసులు సదభిప్రాయములను ఇచ్చియున్నారు. అట్టి అభిప్రాయములను సేకరించిన రచయిత గ్రంథముద్రణ సమయంలో కొంత శ్రద్ధవూని, సంస్కరింపవలసిన చోట్ల సంస్కరించి ప్రకటిస్తే బాగుండేది.

*శ్రీ బులుసు వేంకటరమణయ్య*

# భూమిక :

[కావ్యం. డాక్టర్ సి. నారాయణరెడ్డి. డెమ్మి 1/8 90; వెల—రు. 6/—ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్; సికిందరాబాదు ]

మృదుమధుర కవితా తపస్వి — నారాయణరెడ్డి నవయుగ కవితా వియత్తలంలో ఒక దీప్తతార; తెనుగుకేకాదు—విశ్వసాహిత్యానికే ఒక సహజ కర్ణావతంసము. ఈ ఖండికలు ఆ కవి కుసుమిత భావసుమాలు; పంక్తి పంక్తి లిరికల్ ఎలిమెంటు భాసిస్తుంటుంది. ఈ కవి వచన కవితారీతుల తిరునాళ్లలో కల్లిదొక్కి (కొన్ని జాతర లలో నిప్పులగుండం బదులు, గట్టిముల్లను కల్లంలో బోసి దేవి ఎదుట భక్తులు వట్టికాళ్లతో తొక్కి కంపను నుగ్గు నూచం చేస్తారు, దీనిని కల్లి దొక్కడం అంటారు) మరల మాత్రా ఛంద రచనా బ్రహ్మోత్సవానికి ధ్వజారోహణం చేసి, ఆంధ్రులను మురి పిస్తున్నాడు. ఇది ఆయన కీర్తి నిలుకడకు, చదువరి ఆనందానికి ఒకస్థాయిని ఒనగూరుస్తుంది.

ఈ భూమిక(Back ground?)లో శీర్షికలు లేవు. పాఠకుని చదివి నిర్ణయించుకోమన్న ఒక పరీక్షా పత్రమేమో ! ఇందు 18 శీర్షికలు; ముస్లింవాసనకు ఇదిగిట్టక పోయినా మనకు పరమ పవిత్ర మైన సంఖ్యగదా! వీటిలో భవ్యకవితావేశం మన్ను వదలి మిన్ను చేరినది. భావాలకు భాషకు ఒక అలౌకిక సుగంధం చేకూరి ఉన్నది; కాబట్టే ప్రతి పొరటా పులకలెత్తిస్తున్నది. కవి మనస్సు అంతర్ముఖమై, ఆధ్యాత్మిక భావబంధురమై ఉన్నది; అందుచేతనే భగవద్గీత మొదలు, ప్రపంచ మహాపురుషులను, సహన సమతలను కీర్తించి, ఈ కవి మానవుని మహిత పరచినాడు.

తెనుగు ఎంత తీపి ఎక్కినదో, సంస్కృతానికి అంత చారు గభీరధార అబ్బినది. భాష భావాన్ని విప్పదీసి, పరిమళింపజేసినది. ఇంత భట్టు వక్తణం ఎందుకంటారేమో—ఇందు జాలువారిన తేనె సోనలో కొన్ని దోసిళ్లు త్రాగండి:—

వేదబుక్కులు ప్రథమ కవిత (1)''హృదయోదయంలో విస్ఫుటించిన చిత్ర భావ సువర్ణమయ శతపత్రమిది. సర్వసుందరో జ్జ్వలంగా పల్లవించిన ప్రథమ కవితయే ప్రకృతి పలికిన మాతృ భాష.'' (3) భగవద్గీత—''ఇలాతలమే ప్రమిదగా వెలిగింప జేసిన విశ్వదీపం; విపుల వాఙ్మయ పుష్కరిణులివి, ఎపుడు ఇంకని నీరనిధు లివి.'' (4) కాళిదాసు—ఆ కవిలోక తిలకుని భావాలకు మనోజ్ఞ పునర్విశదీకరణం; ఇందు కవితావేశం మనసును ఊపించి వేస్తున్నది— ''ఏసుమ సమభావన కన్యాసుముగ్ధ సుందరతను చిత్రించెనో గోరానని చిగురాకని.'' (6)పోతన—ఆంధ్ర సాహిత్యానికి కర్పూర నీరాజనము– ''కురిపించె భావాల సిరిజల్లు'' అని ఆసుకవిని కీర్తిస్తాడు. (7) వేమన—ఆలోకప్రియకవి కారణ విమర్శక శక్తికి స్పష్ట వ్యాఖ్యానము; ''పలుకులా అవి? కావునడిచే ప్రాణదీపికలు— ఇంత జనమా పల్లెయాసకు?'' అని ప్రజల భాషకు కైవారం చేస్తాడు. (8) కవిత్వ భిన్నరూపాలను కొనియాడుతూ ''సృష్టికర్త ఊహల్లో ఎంతకవిత?'' అని ఆశ్చర్యపడి భాషకు, భావానికి ఇట్లా సౌకుమార్య మబ్బ చేసుకొంటున్నాడు—''తూరుపు ముంగిట కుంకుమ తోరణాలుకై పేసిన ఇనుని ఇగురు చేతుల్లో ఎంతకవి? కాంతి కవిత!'' (9) స్థానాన్నిబట్టి గుణ మేర్పడుతున్నదంటాడు ''ఒకే నాదమున్నది, అది ఉక్కు తీగలో పలికితే వీణారుతి, వెదురు ముక్కలో మ్రోగితే వేణుశ్రుతి'' ఎంతటికవితా శిల్పదీప్తి!

(10) లింకను మార్క్సు గాంధి—ఈనవయుగ భాస్కరుల స్తుతించి, వారి సందేశాల వివరించినాడు. (13) సహనాన్ని గురించి బహు విధాలచెప్పి, ధారుణి సహనాన్ని నొక్కి చెప్పినాడు—

"ఎంత మృదువో మొక్క; మరి అది ఎట్టగట్టి ధరిత్రినైనాచీల్చు కొని లేస్తుంది! శాఖాశిఖలతో వర్ధిల్లుతుంది." 'ఎంతటి మధుర భావం! సుకుమార ప్రకృతి వజ్రసన్నిభ మవుతున్నదనే గదా! (15) "అలల వీవనలతో పథికుల ఎదను స్పందించి" అని భావో న్మీలనంతో సముద్రాని వర్ణిస్తాడు. (18) చరమగీతంలో నవమా నవతను నెలకొల్పి జగత్తును ఆనందమయం చేయమంటాడు.

ఈ పుస్తకమందంతటా భావశబలత ఇంద్ర ధనువు భిన్న వర్ణాలతో శోభిల్లుతున్నది; మానవుని మనస్సు వివిధ పార్శ్వాలను ప్రదర్శిస్తున్నది.

## చైత్రవంది (భావగీతాలు)

[శనగన నరసింహస్వామి. క్రౌన్ 1/11–140 పారటలు; వెల. రు. 8/– ప్రతులకు :– న్యూ స్టూడెంట్సు బుక్ సెంటర్, ఏలూరురోడ్, విజయవాడ–2.

పైపై వన్నెలు ప్రచరించే ఈ కాలంలో, పాండిత్యపు లోతు పరపు గలిగి – కవితావేశపు పొంగుతో భావబంధురత, భాషా సౌభాగ్యం గలిగిన సాంప్రదాయిక కవిత్వం చెప్పడం ఒక వింత! నరసింహస్వామి గారిది ఆర్ష ప్రబంధ పంథా; లిరికల్ గుణం కలిగిన కుసుమ తోరణాల నెన్నిటనో ఈదారి పొడుగునా కట్టి ఉన్నాడు – ఈ ప్రౌఢ మధురకవి; ఈ కావ్యగుణమే అది!

ఈయన ప్రౌఢ భావాన్ని మృదు మధుర భాషలో పొదిగి రాణింపజేయ గలిగిన కవితాశిల్పి. వీనులకు విందుగొలిపే సుస్వనాలతో కన్నులకు పండువు గూర్చే ఒయ్యారి నడకలతో రచన సాగుతున్నది, ఒడుదుడుకులు లేని నిండు నది పారినట్లున్నది. సంస్కృతం, తెనుగు రెంటిలో బాగా చేయి తిరిగిన వ్రాతగాడు. భావుకత వ్యుత్పత్తి రచనలో పేరుకొనిపోయి ఉన్నది! "భూరి కవిత్వ కళా పరిశ్రమలో" ఆరితేరినవాడు – సౌందర్య ప్రీతస్వాంతుడు అయి నందున ప్రకృతిని పొగడి తన్మయుడైనాడు.

ఈ గ్రంథంలో మూడు భాగాలు· మిత్రుడు దాశరధి తమ పారశీక రివాజును బట్టి చివరినుండి లోపలికి వస్తే, జిలేబిచుట్టమ ఎక్కడ కొరుక్కోంటే ఏమని, మధ్య ఖండికను రుచిచూస్తున్నా; అంతా తీపే!

ఛందోవాణి – వివిధ వృత్తాల స్వభావాలను సొంపుగా చెప్పినాడు. "అందరూ శక్తిగలవారె అయిన గాని ఉజ్జ్వలింతురు కళాయోగసిద్ధి" అని వెల నిర్ణయిస్తున్నాడు. శరణాగతి – వైష్ణవుల విభీషణ ప్రపత్తివలె శబరి ఆత్మార్పణాన్ని చెప్పి "విరికి విరికేగి మధుసంబుకరణిదేనె బొట్టు బొట్టులుగా గూడ బెట్టినాను, చెట్టు చెట్టునకు బోయి చిలుక పగిది ఎంచి రుచి చూచి పండ్లు గ్రహించినాను" అని తేనెనే జాలువారించినాడు.

శిల్పసుందరి – రాయి అయిన అహల్యకు సౌభాగ్యమబ్బజేసినాడు; భావస్పందన తన్మయతను గూరుస్తున్నది. "ఒక్కమారైన మధుమాస ముత్యహించి వచ్చిన వెళ్లిన జాడలే లేవని" ఆ ఆశ్రమ భూమి నిర్జీవతను చెపుతున్నాడు; "దేవరాజు ప్రతి దినంబును నీ శిలా పాదయుగళి లోచన సహస్ర దుఃఖాశ్రువిచి గడిపి కల్పసుమ పూజనంబులగా రచించు" అని తప్పుజేసిన ఇంద్రుని పశ్చాత్తాపాన్ని తెలుపుతున్నాడు. ప్రతి ఖండిక ఎత్తుగడ బాగున్నది.

విక్రమ శశాంకము—"సాహసులు నీయెడందపై చరణ మూన, ముజ్జగంబులు పులకించి మూగబోయె" అంటూ చంద్రుని గూర్చి మునుపటి, ఇప్పటి భావనలను పోల్చి చెపుతున్నాడు. మొదట అందు అడుగుబెట్టిన అమెరికను పేరు=ఆరంస్ట్రాంగ్, ఇతనిని డా. సి. నారాయణరెడ్డి "బాహుబలుడు" అన్నాడు, అనువాదం ఫసందుగా ఉండలేదా? "పాలమున్నీటి కెరటాలబోలు శీతరశ్ములిల జార్చు మృదు మధుర స్వరూప! పవన జల శూన్య కఠిన స్వభావ మెట్లు పాదుకొనెనోయి నీ మనపి ప్రాంతమందు?" అని చంద్రునే ప్రశ్నిస్తున్నాడు. శశి వింశతి—చంద్ర వర్ణన ప్రబంధ ధోరణిలో చెప్పిన ఇరవై పద్యాలు. ఇందు, ప్రియునికై సంకేతానికి పొయ్యే అభిసారిక, అలంకరించుకొని ఇంటనే ప్రియునికై వేచియుండే వాసవ సజ్జిక నాయికలను హృద్యంగా వర్ణించినాడు. విరహయామిని—"ఎడబాటు బరువు లేక కలదె సంయోగమున సౌఖ్యకలన యెపుడు" అని విరహం గూర్చే తిక్త మధుర ఫలాన్ని వర్ణిస్తాడు.

అంతా బాగున్నది గాని, ప్రావేశిక ధ్రువలో, శ్రీనివాస ప్రసాదుగారు, దారినపొయ్యే తగువును నెత్తికి దెచ్చుకొన్నట్లు వ్రాసినాడు:– తన మిత్రులను అనవసరంగా పొగడి, పరోక్షంగా పాఠకులచేత మాటలనిపిస్తున్నాడు. "కృష్ణశాస్త్రి వేదుల తర్వాత కవులు ఆంధ్రలో అరుదైపోయినారు, మళ్లీ ఇంత కాలానికి ఈ కవి పుట్టినా" డనటం మర్యాద మాటగాదు. వీరిద్దరిని పెద్దవారు కాదనేవారు లేరు, కాని ఆంధ్ర సాహిత్య లక్ష్మి వట్టిపోయి గొడ్డుపోయిన దనటం సాహసమే కాదు—సహించరానిది. భావకవికుల గురువు రాయప్రోలు ఏమైనాడు? జాషువ, రామిరెడ్డి, నాయని సుబ్బ

రావు, ఆనాటి శ్రీశ్రీ ఈయన కండ్లలో మెదలలేదా? ఈ నరసింహ స్వామి వలె సాంప్రదాయిక మధుర కవులు—వానమామలై, పుట్టపర్తి, పూతలపట్టు, తుమ్మల విశ్వనాథ పేర్లు ఈయన చెవిన పడలేదా? దాశరథి, నారాయణరెడ్డి, ఉండేలు, మాలకొండారెడ్డి, సోమసుందర్, మహమ్మదాలి, భీమన్న, బాపురెడ్డి మొదలైన భావుకులను మరవడం తన స్నేహితుని ఘనపరచడం అవుతుందా? అయినా ఇవి శనగన వారికి అంటవు లేండి.

## మానస సరోజాలు (కవిత)

[మేకా సుధాకరరావు. క్రౌన్ 1/16–120 పేజీలు — ధర. రు. 6/–. ప్రతులకు—గ్రంధకర్త, మేకావారివీధి; పిఠాపురం—533 450.]

ఇవి, ఒక కవితా రస పూర్ణ హృదయం వెలువరించిన సుస్వనాలు. ఆత్మాశ్రయమైన మన శతక పద్యాల వంటి Stray Thoughts. భావ స్పందన గల వారంతా చేసే పనే ఇది. ఈ కవే వీటిని గురించి చక్కగా చెపుతున్నాడు:— పెద్దలనోట విన్నవీ, మనోనయనాలుకన్నవీ, సద్గ్రంథాలలో చదువుకున్నవీ — వివిధ విషయాలు, అభిప్రాయాలూ, అనుభవాలూ, బీజాలుగా, నా మానస సరోవరంలో వికసించిన కవితా ప్రసూనాలు (రాజీవాలంటే ఇంకా బాగుండదా!) ఈ మానస సరోజాలు!

ఇటువంటి సూక్తులకు సంక్షేపోక్తి అనుప్రాస బిగువు నిస్తవి. ఈ గుణమే గదా సామెతను నిలబెట్టుతుండేది? ఇందు మాటలు ఎక్కువై ఒకపాటి సడలింపు తోచినా భావ వ్యక్తీకరణం కుంటుబడలేదు. భక్తి, లోకపు తీరు తెన్నులు, దివ్యప్రేమ, జీవితము మొదలైన గంభీర విషయాలు కవితకు వస్తువై ఉన్నవి. రసస్ఫూర్తి గలిగిన వాక్యాలు చాలా వ్రాయబడి ఉన్నవి, (148). వీటిలో నుడి కారపుసొంపు సూక్తి వైచిత్రి బాగున్నవి.

కొన్ని:—అపకీర్తికన్న అధిక ప్రమాదభరితం కీర్తి (4) అవును! అందుకే ప్రతిష్ఠ సూకరీవిష్ఠం (ఆడు పందిపెంట) అన్నది ఒక సూక్తి. (6) మురిసి మురిపించే వనిగా అలరారాలి జీవితం (19) పూలవనంలో పెరుగదు—ప్రేమ, హృదయవనంలో విరుస్తుంది. (21) కనపడకుండా కర్రను లోలో దొలిచేసినట్లు నీ గుండె పిండిచేసే పురుగు అవినీతి. (23) తావిలేని పూవు శీలం లేని పూబోడి. (34) కమ్మగా ఉంటుంది గనుక ఎప్పుడూ వెన్ననే తినాలని కోరుకోవడం కుర్రతనం. వెన్నరుచా? జున్నురుచి వెన్న కబ్బునె? అనికదా ఒక శతకపద్యం. (35) అడవిలో ఉన్న సింహా నికీ సింహం ఉన్న అడవికీవలె, పరస్పరం చిత్తశుద్ధితో జీవించే భార్యాభర్తలకు తగిన రక్షణ ఉంటుంది. అన్యోన్య సంబంధాన్ని గురించి మంచి ఉపమానం వెంటనే—ధృతరాష్ట్రుండును పుత్రులున్ వనము, కుంతీనందనుల్ సింహముల్, మతి నూహింప నసింహమైన వనమున్ మర్దింతురెందున్, వనావృత వృత్తంబులు గాని సింహములకున్ వేగంబ చేటొందు—అనిన ఉద్యోగపర్వ పద్యం మనసుకు వస్తున్నది.

(40) భర్తపై కోపంతో తీర్పుకు వెడితే — ఆ తీర్పు ఆమెకు భరణం ఇప్పిస్తుందేగాని బ్రతుకు నీయ లేదు; తూచి అన్నమాట! (43) కవి వెలయించినదంతా కవిత్వం కానేరదు; బలేమాట! (53) అనుకూలవతియైన అతివతో వివాహం జీవన తుఫానులో నౌకాశ్రయంగా అలరారుతుంది. (58) ప్రేయసి కోసమే మహాసామ్రాజ్యాన్ని (రవి అస్తమించని) త్యజించిన ఎనిమిదవ ఎడ్వర్డువంటివారు చిరస్మరణీయులు. కాబట్టే, చాకలివాని నీలాప నిందలు విని, అగ్ని పవిత్రఅయిన సీతమ్మను విర్వాసనంపి, రాజ్యం నిలుపుకొన్న శ్రీరాముని తప్పుబట్టుతారు హేతువాదులు. (65) అణువంత అదృష్టం కొండంత ఆశ తీరుస్తుంది. ఇటువంటిదే ఒక చాటున: గుమ్మడికాయంత తెలివికంటె గురిగింజంత అదృష్టం మేలు.

(78) జలం తనను అలలతో కొడుతున్నా ప్రేమతో భరించే జలజంవలె—మనోజ్ఞమైన భావం! (124) కోటి తారకలను పోగొట్టుకున్న మేటి దుఃఖంతో అరుణ వదనయైన ఆకాశంలో—నా మంచు బిందువు మాయమైపోయిందని మొరపెట్టుకొనే సుమం. (148) బుతువుల రాకపోకల వర్ణన బాగున్నది; రస భరితం, ఇట్లా చాలా మంచి తునకలున్నవి.

శ్రీ మదపూరు కోదండరామరెడ్డి



Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.

# అమృతాంజన్ లిమిటెడ్

## 75 సంవత్సరాల పైగా గృహౌషధములు తయారుచేస్తున్నారు!

- **అమృతాంజనం బాధానివారిణి**
  తలనొప్పి, ఒళ్ళునొప్పులు, బెణుకులు, జలుబు, దగ్గు, కంఠరాల నొప్పులకు.
- **అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్**
  పసిబిడ్డల అజీర్ణానికి, పళ్ళు వచ్చేటప్పుడు కలిగే బాధలకు.
- **అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్**
  తామర, తీట, గజ్జి వగైరాలకు.
- **అమృతాంజన్ ఇన్‌హేలర్**
  జలుబుచేసి ముక్కుదిబ్బడ, తుమ్ములు వగైరాలకు.
- **అనోలియమ్-కోల్డ్ రబ్**
  దగ్గు జలుబులను పారద్రోలే అమోఘమైన ఒక కొత్త శక్తి.
- **శాలోఫెన్ -బాధానివారిణి మాత్రలు**
  తలనొప్పి, ఫ్లూ, ఒళ్ళు నొప్పులకు.

...ఇండియాలోను, ఇతర దేశాలలోను పేరు పొందినవి.

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు-4




DS/AM.1759 TEL